# ప్రభావతీప్రద్యుమ్నము.



ఇది

రాఘవపాండవీయ కళాపూర్ణోదయాది కావ్యములను

రచియించిన మహాకవి యగు

## పింగళి-సూరనార్యునిచే

విరచితమైనది.



చెన్నపురి:

శ్రీ చింతామణీ ముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడినది.

1901.

వెల 12 అణాలు.

# ప్రభావతీప్రద్యుమ్నము.

## ప్రథమాశ్వాసము.

ఉ. శ్రీమదుమామహేశు లతిచిత్రవిలాసులు దార్ఢ్యముల్ వియో
గామితచింత నొండొరులకై సగమాటలు నిచ్చఁ దెల్పు కాం
క్షామహిమంబుచేఁ జెలువగంబుగ నొక్కరొయొడ ధరించు స
త్ప్రేమపుదంపతు ల్కృతిపతిం దనరింతురు గాతఁ గీర్తులన్. ౧.

ఉ. అంగజహేతుకంబు లరయ న్మిథునంబులప్రేమ లిట్టిచో
నంగజుతల్లిదండ్రు లగునట్టియనన్యసమానహార్దపం
సంగు లనాదిదంపతులు సత్కృప నిత్తురుగాక సౌఖ్యము
ల్పింగళిసూరధీరవరుబిడ్డకు మాయమరేశమంత్రికిన్. ౨.

చ. అమలనవీనహైమనిజయానగరుద్ద్యుతిఁ బ్రోచునద్వపు
ర్విమలరుచిన్ స్వభక్తులకు వెండియుఁ బైఁడియుఁ గీర్తియు న్సతే
జము నెపుడప్పుడే యొసఁగు సద్గనిధానముఁ దాల్చియున్నయ
ట్లమరెడువాగ్విధాత లమరార్యున కిత్తురు నిత్యసౌఖ్యముల్. ౩.

వ. అని సకలభువనప్రవర్తనహేతువులైనపురాతనమిథునంబులం గొనియాడి. ౪.

గీ. ఆదికవులఁ బ్రాచేతసవ్యాసమునులఁ। దలఁపులోన భజించి యత్యంతసరస
మగుప్రభావతీప్రద్యుమ్న మనుప్రబంధ। మాచరింపుచు నొక్కనాఁ డాత్మలోన. ౫.

మ. జనము ల్మెచ్చఁగ మున్రచించితి నుదంచద్వైఖరిం గారుడం
బును శ్రీరాఘవపాండవీయముఁ గళాపూర్ణోదయంబు న్మఱిన్
దెనుఁగుం గబ్బము లెన్నియేనియును మత్పి। తాదివంశాభివ
ర్ణన లేమిం బరితుష్టి నా కవి యొనర్పం జాల నత్యంతమున్. ౬.

క. తండ్రియు సుతులకు దైవం। బండ్రు గదా వేదవాదు లది వినియును నే
పీంద్రుని వాంద్రుని బలె మా। తండ్రిఁ బరమపూజ్యుఁ గాఁగఁ దలఁపమి తగునే.

మ. గయలోఁ గాశిఁ బ్రయాగ శ్రీగిరిని గంగాద్వారనీలాచలో
జ్జయినీద్వారకలం దయోధ్య మథురన్ సంస్తుత్యపుణ్యస్థలా

గ్రియుత న్వొండియు మించునైమిశకురుక్షేత్రాదులం దర్పణ
క్రియచే నాపినతమ్ముఁ డొప్పన యొనర్చెం దండ్రి కాహ్లాదమున్. ౮.

క. ఏనుం బితృపూజన నాచే నైన ట్లెద్ది యొనఁ జేయఁగ వలయున్
గానఁ గృతి యిచ్చి పేరిని। పై నిలుపుదు నతనికీర్తిఁ బరమేశకృపన్. ౯.

వ. అని నిశ్చయించి ప్రభావతీప్రద్యుమ్నంబు మద్గురుం డైనయమరామాత్యుని పేర నంకితంబుగ రచియింపం గడంగి తత్కావ్యలక్ష్మీముఖంబునకుం దిలకాయమానంబుగ నావంశావతారం బభివర్ణించెద. ౧౦.

గీ. గంగఁ దనదు పేర గౌతమీనామవి।ఖ్యాతిఁ బరఁగఁ దెచ్చె భూతలమున
కేమహానుభావుఁ డామునిసింహుఁడు। గౌతముఁడు తపోధికతఁ దలిర్చు. ౧౧.

ఉ. వాదున గెల్వ లేక పురవైరి లలాటముకన్నుఁ జూపఁ దా
బాదమునందుఁ గన్ను ప్రతిపక్షతఁ జూపెను శాస్త్రిముల్ ప్రమా
ణాదిపదార్థతత్త్వకథనాత్మకమున్ రచియించె నాత్మసం
వేదముకై మును ల్కులపవిత్రుని గౌతముఁ బోల నేర్తురే. ౧౨.

క. ఆగౌతమగోత్రంబున। నాగమనిధి పుట్టె గోకనామాత్యుఁడు స
ద్భోగక్షేత్రస్వామ్యస।మాగతిఁ బింగలిపురాంకుఁడై యతఁ డొప్పెన్. ౧౩.

ఉ. పేర్వెలయంగ నాఘనుఁడు పింగలిగోకబుధోత్తముండు గం
ధర్వి నొకర్తుఁ బేకి యనుదానిని దాసిఁగ నేలె యోగితా
గర్వనుభావుఁడై నెరపె గోపకుమారునిఖడ్గవర్ణనం
బర్వపునిండువెన్నెలలపై నెఱిఁ జూపెడుకీర్తిసంపదన్. ౧౪.

ఉ. సంతతి లేక ము న్నతనిజాయ సభక్తిని సూర్యసేవ య
శ్రాంతముఁ జేయఁగా నతఁడు సద్విజుఁడై కల వచ్చి దొండచె
ట్టింతికి నిచ్చి బాల ఫలియించును నీ కిది ప్రోది చేసి తా
మ్మెంశియు నంచుఁ బల్కెఁ నటఁ యింతియు నాకల గాంచి ధన్యయై. ౧౫.

గీ. సకలదిశలకు శాఖోపశాఖ లిడుచుఁ। బాదలి ఫలియించుదొండయుఁ బోలి ప్రబలి
యాత్మసంతతి పుత్రపౌత్రాదిబహుప।రంపరల నొప్ప వెలసె భర్తయును దాను. ౧౬.

మ. తెరము ల్నాల్గయి రెండు నెందు నగుఁ దత్తద్గ్రామనామంబులన్
బరఁగున్ వంశము లెల్లఁ బూర్వపునిజప్రఖ్యాతి మాయంగ నే
మఱదో పింగళినామ మందుఁ జిరకాలావాసులై యున్నను
శ్రితన్ గోకనమంత్రివంశజులకున్ జె న్నొందు మిన్నందుచున్. ౧౭.

ఉ. రంగుగ గౌతమీపరిసరంబులఁ గృష్ణకెలంకులన్ ఘనుల్
పింగళిరామయాదులు లలిం బలనాటను బాకనాటనుం

బింగళిగాదయాదు లిటఁ బెంపు వహించినయస్మదాదు లా
పింగళిగోకమంత్రియిలు పేరనె చాలఁ బ్రసిద్ధు లెల్లచో౯. ౧౮.

వ. అది యట్లుండె నమ్మహావంశంబునందు నస్మజ్జనకజనీజీవంతికాత్యంతకమనీయం
బైనశాఖావిశేషం బెట్టిదనిన. ౧౯.

క. గంగయ్య నా వెలయుచు శుచి।తం గడు శోభిల్లె నొకఁడు తద్వంశములో
గంగ యనా వెలయుచు శుచి।తం గడు శోభిలెఁ దదూర్జితయశఃశ్రీయు౯. ౨౦.

క. మాంగల్యశోభి యగునా। గంగయకును ముగురు వంశకరు లైరి సుతుల్
రంగత్కీర్తులు మహి నె।న్నంగ న్సూరనయుఁ గుప్పనయు రామనయు౯. ౨౧.

క. కనియె౯ గుప్పన సూరన। యనుపుత్రుని నతనిపుత్రు లగుబానయ భ
ద్రన కుప్పార్యుల కాత్మజు। లనేకు లెఱ్ఱయ్య పాపయాదులు ప్రాజ్ఞుల్. ౨౨.

క. జనియించెను రామనకుం। దనయుఁడు గంగన్న గంగనకు గాద్వన గా
దనకుం బెద్దయు మొదలుగ। ననేకు లీగతిఁ దదన్వయము శోభిల్లు౯. ౨౩.

గీ. ఇట్లు పుత్రపౌత్త్రాదుల నెనఁగునట్టి। సోదరులు దన్ను మిక్కిలి నాదరింప
నలఘుసౌద్గుణ్యసౌభాగ్యకలితుఁ డగుచు। గంగనామాత్యసూరయ కరము వెలసె.

ఉ. పింగళిగంగమంత్రివరుబిడ్డకు సూరనకుం బజాబ్జరే
ఖం గలకాంతికే వలచి కైవస మయ్యెను రాజ్యలక్ష్మి దా
బంగరుకామకుంచెలును బల్లకియు న్మోద లైనయాత్మస
ర్వాంగసమృద్ధితోడ సిరి కంబుజరేఖలప్రేమ వింతయే. ౨౪.

సీ. సూరనిభుఁ డైనపింగళిసూరవిభుని। దొరయఁ బోఁ డొరఁ డలవేల్పుదొరయ కాని
యతనిదానము సిరికి నియతనిదాన। మర్థు లప్పుడు దానమహర్థు లైరి. ౨౫.

క. సూరయమంత్రికిఁ గలిగెను। సూరయమంత్రియ యనంగ సుతరత్నము కం
ఠీరవమున కెందును గం।ఠీరవము జనించునట్టినియమము దోఁపన్. ౨౬.

ఉ. సూరయసూరమంత్రి కతిశుద్ధిఁ దలిర్చినయక్కమాంబయం
దౌరసు లుద్భవించిరి మహాత్ములు నల్వురు సజ్జనస్తుతో
దారగుణాభిరాము లంట యన్నయభవ్యుఁడు సూరసూరియు౯
ధీరుఁడు వల్లశౌరియును నీతయశస్కుఁడు లింగనార్యుఁడున్. ౨౭.

వ. వారిలోన. ౨౮.

క. వల్లయమంత్రికిఁ బుత్రుఁడు। పుల్లయమంత్రి యనఁ బుట్టె భువి లింగన కు
త్పుల్లయశుఁడు సూరయయును। సల్లాలితనీతి యక్కసచివుఁడుఁ దనయుల్. ౩౦.

క. వారలకు నగ్రజుం డగు। సూరయసూరప్రభుండు సుకవిత్వసదా
చారశివభక్తివినయో। దారత్వాదులఁ బ్రసిద్ధతముఁ డై మించె౯. ౩౧.

క. వేడుక నాయన పెండిలి| యాడె వెలగలేటియమరనామాత్యసుతన్
ప్రీడావతులందును గొని|యాడం దగినయమలాంబ నఖిలగుణాఢ్యన్. ౩౨.

క. అమలమహాగుణనిధి యా|యమలమ హారిప్రకారయశమునఁ దనరెన్
గమలాలయాసరస్వ|త్యుమ లాలలితాంగిఁ బోల్ప నొనరెడుగరితల్. ౩౩.

ఉ. ఆయమలమ్మయందును గృహస్థశిరోమణి సూరశౌరి య
త్యాయతశీలురం గనియె నాత్మజుల న్సుగుణన్ సుధీజన
ధ్యేయగుణప్రశంసు నమరేశ్వరమంత్రిని ధర్మనిర్మలో
పాయుని మల్లనార్యు నతిభవ్యత మించినయక్కధీయనిన్. ౩౪.

వ. అందు. ౩౫.

క. ఇమ్మగ నుదయించిరి జన| సమ్మతుఁ డగుమల్లనకును జగ్గన యనఁగాఁ
దమ్మయు సూరయ్య చిన్నయ| తిమ్మయ లనఁ బరఁగుసుతులు ధృతిబలసహితుల్. ౩౬.

క. ఆమల్లనకును జన్నమ|చే మంత్రుల కెల్ల గుణవిశేషంబులచే
భూమిన్ జ్యేష్ఠుఁ డనంగ మ|హామహిమాదార్యుఁ డమరనార్యుఁడు వెలసెన్.

సీ. చిఱుమనఁ దెచ్చి రాచటిక మిచ్చినబుధోత్తముఁ డేవధూమణితాతతండ్రి
యనవరత మునికి నాయూరి పేరఁ దా వెలయు కేసయ్య యేవెలఁదితాత
యన్నయ బాపయ్య లగ్రజానుజులుగాఁ బరఁగుభావయ్య యేగరితతండ్రి
జయనయోన్నతులు కొండయరాఘవార్యు లేసతి కన్నదమ్ములై సుతులం గనిరి
పృథివి నేపురంధ్రి పెదతండ్రికొడుకు స|త్కీర్తిశోభితుండు కేసవిభుఁడు
తనరు నేగుణాఢ్యపినతండ్రిసుతుఁడు గం|గయ్య బహుసహోదరాంచితుండు. ౩౮.

గీ. రమ్యగుణనిధి యన్నమ్మ రాచపూడి| గణపతిసుపుత్రి యేసాధ్వికన్నతల్లి
యట్టియంబమ్మఁ బింగలియమరమంత్రి| పెంపు నింపును మెఱయంగఁ బెండ్లియాడె.

గీ. అనఘసౌభాగ్యవర్తనార్ధాంగలక్ష్మి| పింగళియమరామాత్యవర్ధాంగలక్ష్మి
యంబమాంబిక భోగభాగ్యముల మరుని|యంబకును నంబికకు సాటి యనఁగ వెలసె.

క. ఆజంపతులకుఁ బుత్రుల|మై జనియించితిమి సూరనాఖ్యుఁడ నేనున్
భ్రాజితమతి యమలార్యుఁడు| రాజితబోధార్థనాభిరతుఁ డెల్లనయున్. ౪౧.

క. స్తోత్రముల కయ్యె నమ్య|క్పాత్రము శ్రీరాచపూడిగంగనయును దౌ
హిత్రులు గలుగఁగ వంశప|విత్రం బామిథున ముభయవిధసంతతులన్. ౪౨.

క. అత్నయగుణవిభవైతా| దృక్షకులోత్తంసునకు సదృక్షవిదూర
ప్రేక్షాసిలలితధర్మసు|రక్షాంసునకు సురరుచిధురాహంసునకున్. ౪౩.

క. గౌతమగోత్రునకును బ్రా|ఖ్యాతాపస్తంబసూత్రయాజుషశాఖా
ధీతిపవిత్రునకును లో| కాతిగవశితాజితాంతరామిత్రునకున్. ౪౪.

క. పృథులాకాశీసేతు। ప్రథ నిడుమానూరికృష్ణరాయసముద్ర
ప్రథితాగ్రహారభోగా। తిథేయనిజనంతతిప్రతీతాత్మునకున్. ౪౫.

క. గంగాశుచివృత్తికి నఖి। పంగానాఘూర్ణితనీతిసంపత్తికి స
న్మంగళగుణపాత్రునకును। బింగళిసూరప్రధానిప్రియపుత్రునకున్. ౪౬.

క. శ్రీమద్రఘ్రాజేంద్రగురు। స్వామిస్థిరవంశకలశజలనిధిసోమ
తోస్సమారాధ్యకృపాల। ధ్యామలశివభక్తిశోభితాచారునకున్. ౪౭.

క. అమలాంబానందనునకుఁ। గమలాంబాగురుసమానఘనధైర్యునకున్
గమనీయమనీషివ్యృప। గమనీయున కంబమాంబికారమణునకున్. ౪౮.

క. మజ్జనకున కర్చితధీ। మజ్జనకునకు నభినుతిసమార్జితమాయో
న్మజ్జనకున కమలచిదవ। మజ్జనకున కమృతరసనిమజ్జనకునకున్. ౪౯.

క. అమరామాత్యున కురుమ। త్యమరామాత్యున కజోపయమనకృతార్థో
ద్యమరామాత్యుపమేయా। యమరామాత్యురుగుణోదయయశశ్శ్రీకిన్. ౫౦.

వ. అక్షయకీర్తివైభవాభివృద్ధి యగునట్లుగా నేను సమర్పింపం బూనినప్రభావతీప్ర
ద్యుమ్నంబునకుఁ గథాక్రమం బెట్టి దనిన. ౫౧.

క. శ్రీరమణీరమణీయను। హారస్థలుఁ డచ్యుతుఁడు సముజ్జ్వలమహిమన్
ద్వారక నుండఁగ వొకనాఁ। డారూఢాదరత నింద్రుఁ డవ్విభుకడకున్. ౫౨.

వ. లోకహితకార్యపర్యాలోచనంబునకై చనుదెంచువాఁడు నాకంబు వెడలి యాక
సంబున నడతెంచుచున్న సమయంబున. ౫౩.

సీ. ధాత్రీమహాదేవి తాల్చినమున్నీటిమొలనూలిరత్నంపుమొగ పనంగ
జలధి పేరిటిపాఁపతలచుట్టు గలధరిత్రీమూర్తిశివుచిత్రతిలక మనఁగ
నపరదిక్సతి కట్టినట్టిసాగర మనుపుట్టంబుతుదివ్రాఁతమొగడ యనఁగ
వరుణగోపురబద్ధవార్ధితోరణమధ్యగుంభితనవపుష్పగుచ్ఛ మనఁగ
వివిధమణిమయగృహదీప్తివిసరవిసరణోపశోభిత మగుద్వారకాపురంబు
దవులఁ గాన్పించెఁ దనుఁజూడ దైవవిభుఁడు। వేయికన్నులుఁ జాలక వెఱఁగుపడఁగ.

వ. ఇట్లు గనుపట్టునాపట్టణంపుసొంపునకు శిరఃకంపంబు సేయుచునిలింపవల్లభుఁ డింపు
పెంపు పరికించి కించిదుల్లసితవిలోచనంబుల నానసహస్రవిలోచను విలోకించి
తదీయరథసూతుం డగుమాతలి యిట్లనియె. ౫౪.

క. ఏమీ యిది దేవరకను। దామరలకు నింత వెఱఁగు దలకొలిపెడు నే
యే మనఁగ నహహ నాక। స్వామికి నబ్బ మగుప్రోలు వసుమతిఁ గలిగెన్. ౫౫.

క. జలనిధి యను తెరమఱుఁగఁ గటు। వెలసి నిలిచినట్టియాటవెలఁదియపోలెం
గడు నింపులు గులుకుచుఁ దన। కడు నీపురలక్ష్మి యావహించితె యధిపా. ౧౭

క. పడమట నంభోరాశియుఁ। గడమదిశల వనచయంబుఁ గప్పారఁగఁ దా
నడుమఁ బురలక్ష్మి గనుప। ట్టెడు హరితాంబరమున సుఖించుతీవి దలిర్పన్. ౧౮

ఉ. దోహదధూపధూమములతోఁ గనుపట్టెడుతత్పురీవన
వ్యూహము నోసమస్తవిబుధోత్తమ చూచితె యంబుపానకా
తూహలలంబమానవపయోదరాజివిరాజితాభినం
దేహనితాంతకంధరోనదీపిలసైపుణి నేఁడుఁ జూపెడున్. ౧౯

ఉ. భోగపుఁజాట్లు కోటలుగ భూరికిరీటసముజ్జ్వలత్ఫణా
పూగము సౌధబృందముగ భోగికులేంద్రుఁ డుపేంద్రుఁ బాయ లే
కీగతిఁ దాను వచ్చి భజియించెనొకో యవతార మంచుఁ జే
తోగతి నాకు సంశయము దోఁచుచు నున్నది నిర్జరేశ్వరా. ౨౦

మ. అవచూషోపలదీప్తిచిత్రితములై హర్మ్యాగ్రవిన్యస్తకే
తువులం దేర్పడ కొప్పె నప్పురము పైఁద్రోవన్ మొగుళ్ళేగి యిం
ద్ర విలోకించితె యెంత సేల చని యేర్పాటయ్యెవా సమ్మరా
దవిశాలాగరుధూపధూమతతులో యభ్రింబులో యిప్పుడున్. ౨౧

చ. హరిహయ చూడుమా తెలియ టబ్బము డగ్గఱి చూచి కాని యాం
గిరసుని కైన నల్లయది కెంపులమేడలతోడివిస్ఫుర
న్మరకతకుట్టిమస్థలిరుచు మవ్వపులేఁజిగురాకుకెంపుమ
మ్మరమునఁ దేజరిల్లు నెఱమామిడిమ్రాఁకులతోడితోఁటయో. ౨౨

సీ. కలధౌతకేళినగంబు గాఁబోలును దనరుచున్నది శంభుశైలలీల
ఘనపుష్పచాంపేయవనరాజి గాఁబోలు నేలుచున్నది పులితోలుసిరుల
హరినీలసోపానసరణి గాఁబోలును బగటుచున్నది నల్లపాఁపపేరుఁ
బవడంపుటలువసౌభాగ్యంబు గాఁబోలుఁ జాటుచున్నది జటాజూటరుచిని
సరసి గాఁబోలుఁ గ్రాలెడు సురనదిగతి। నోడ గాఁబోలుఁ బోలెడి నుడుపతికళ
ననిమిషాధిప చూచితే యల్లపసిఁడి। కోటనడిమిశృంగారపుఁదోఁటలోన. ౨౩

సీ. ఆలోలశైవాలజాలలాలిత్యంబు జంగమోద్యానవేషము వహింప
రంగదుత్తుంగతరంగసంఘాతంబు నడగోటలతెఱంగు నడుపుచుండ
డిండీరమండలాఖండసౌభాగ్యంబు చరసౌధచయవిలాసము భజింప
శ్రీకరశీకరాస్తోకప్రవర్షంబు కానుకముత్యాలకరణిఁ బరఁగ

నగడితలు తత్తద్వాఃశోపయాతవాత। వశతచేత సేతత్పురవర్యపర్య
పానవాశానవానీతపరపురీప। రంపరాలీల నెఱపెడు నింపుమీఱి. ౬౪.

క. పడమటితుది సాగర మని। యెఱుఁగదజ్జాలమాటఁ దక్క నేతత్పురి న
ల్గడలందుఁ బరిఘలెవ్వియొ। జడనిధి యెయ్యదియొ తెలియ శక్యమె ప్రజకున్. ౬౫.

చ. తను ధరణీతటిజ్వహ్పాలిధన్యవనావళి యింతె మీఱుటల్
కనియును మేఘు మిచ్చటి కలజ్జతఁ జేరెడుఁగాక చేర కే
గినను గొఱంత యేమి పురికిం బువుఁదేనియసోనకాలువల్
జనములపైఁబుపంటలకుఁ జాలవె యెన్నటికైన నెన్నఁగన్. ౬౬.

వ. అని యివ్విధంబున రథికసారథులు తత్తద్వస్తుసందర్శనసమయసముచితవచోరచనల వినోదించుచుం గొంతదవ్వువ నయ్యూర్వికి డిగ్గి యన్నగరంబు చేరం జనునంత నతని రాక విని వనజోదరుండు ప్రియసహోదరుం డగుసాత్యకిం బిలిపించి యద్ద్విజవల్లభు నెదుర్కొని తోడితెచ్చుటకు నియోగించిన నతండు సముచితపరివారసమన్వితుండై యెదుర్కొని తోడ్కొని చన వేడ్క లిగురొత్తుచిత్తంబున నద్దేవోత్తముండు నూత్నగారుత్మతస్తంభసంభృతకేతనావలంబిరంభాతరువిభూషితగోపురపార్శ్వభాగం బగుతత్పురంబు ప్రవేశించి యుభయపార్శ్వసౌధవీథికాధిరూఢపౌరవిలాసినీకటాక్షనివహబహుగుణీకృతమార్గతోరణుం డగుచు వారిజనాభుమందిరద్వారంబు చేర నరిగి నతండును సుగ్రసేనవసుదేవసంకర్షణగదాక్రూరప్రముఖులతోఁ గక్ష్యాంతరంబులు గడచి యెదురు వచ్చి తత్ప్రవేశవిధానంబు యథోచితంబుగా నడపి పరస్పరార్ఘ్యసంభావనంబు లస్తంభసంభ్రమసంభృతంబులై జరగునంతఁ గుశలప్రశ్నంబుఁ గావించిన నద్ద్విజనాయకుండు జనార్దనున కిట్లనియె. ౬౭.

గీ. ఇపుడు నీదర్శనం బనియెడుకుశలము। కలిమి ప్రత్యక్షమే చెప్ప వలదు కృష్ణ
యటమటముగాక యటమున్నటికుశలము। నఖిలవిదుఁడవీవెఱుఁగనియదియుఁ గలదె.

క. ఐనను నాచేతను వినఁ। గా నభిమత మయ్యెనేని కమలోదర నీ
కే నెఱిఁగించెద వినుమవ। ధానముతో మన్మనోవ్యథాభర మెల్లన్. ౬౯.

చ. తపమున వజ్రనాభుఁ డనుదైత్యుఁడు బ్రహ్మఁ బ్రసన్నుఁ జేసి వ
జ్రపురి యనంగ నొక్కనగరంబును మేరువుపొంత మారుతా
తపములకున్నిజాసుమతిఁ దక్కఁ బ్రవేశ మొనర్పరానియ
ట్టిపసఁ దనర్చుదానిని ఘటించి యతం డొనఁగన్ బ్రదీప్తుఁడై. ౭౦.

వ. యథేష్టవైభవోపభోగంబులం బ్రవర్తించుచు. ౭౧.

ఉ. ఆతఁడు మున్న నున్నతమదాంధత దాడిగ నేగుదెంచి యా
పోతర మేమి చెప్ప వసుఁ బూనికిఁ గైకొన కప్సరోవధూ
వ్రాతనిశాతపాణిరుహవారినలాలసనవ్యపల్లవం
బై తనరారునందనమహావనిలో విడియించె సేనలన్.

సీ. దనుజాధిరోహతాడనభంజనాదుల కోర్చునే కల్పవృక్షోత్తమమ
శోష్యపర్యుషితమనుష్యమాంసంబులు పూనునట్టివియె సంతాన
దానవద్విపఘటాలానతాదురవస్థ సైరించునే హరిచందనములు
మనుజఖాదిస్వేదమలినవస్త్రాదులు దాల్పఁ జాలివియె మందార
నందనమ్మునకును వజ్రనాభదైత్యుఁ డపుడు చేసినకష్టపా టబ్జ
యిపుడుఁ దలఁపునఁ బాఱిన హృదయమునకు నధికతరమైనపరి
గీ. వాని కెదిరించి పోర దేవతలలోన నెవ్వరును జాల రిది బ్రహ్మ
వరములోపలియదియ పంకరుహనాభ మదికలఁకఁ జేసి మును చేయ

వ. కావున వానిచేఁత లన్నియు నప్రతిహతంబు లయి సాగుచుండె
న్పతియును విచారించుకొని యుద్ధురాత్మునకు.

గీ. అక్కచెలియండ్రసంతాన మైనయట్టి మనకు మనలోన నింత
వలదు మాపల్కు నీవు నీపలుకు మేముఁ జేసి బ్రదుకుట మేలు

వ. కొంత శాంతసంరంభంబుగా మఱియు నప్పటితీఱమిఁ గొలంది
టికంబు సెరవుచుం బట్టణంబులోనికి రప్పించి వానికి వానిసే
విడుదులు పాలుపెట్టించితి మట్టిసమయంబున.

సీ. తన కులుపా చాల దని మిట్టిపడఁగ ననామధేయపుదైత్యునకు న
తనవిడిదికి రంభ ననుపవై తని తిట్టుకిగ్గాడియసురకుఁ గేలు మొ
తనకుఁ బెద్దఱికంబు మును సేయ వని దూఱునధమరాత్మునకు
తన కమృతముఁ బోసి యనుప వంచు నదల్పఁ బినుగురక్కసునకు
పంకరుహనాభ యేఁబడ్డపాటు లరయ నెందు నెవ్వరుఁ బడరి
యెంతపాపంబు చేసినజంతువొక్కొ యింద్రుఁ డగు నని యపు

ఉ. వారిజనేత్ర యే నిపుడు వచ్చుచు నుండి యులోకికాద్భుత
శ్రీరుచిరత్వదీయనగరీగరిమాతిశయావలోకలీ
లారసదూరధూతసకలవ్యథచిత్తుఁడనైతి యథాపురా
కారత నీకుఁ దోఁచెదనొ కాని తనుద్యుతిఁ బాసితిం జుమీ.

వ. అది యట్లుండె నవ్విధంబున వివిధోపచారంబుల సంఘటింపఁ బెంపునం బ్రవర్తిల్లుచుండి యాచండదానవుం డొకానొకనాఁడు సకలసైనికసన్నాహసంపదం బొదలుచుం గదలి యేతెంచి మదీయమందిరద్వారంబునఁ దనబలంబుల నించి నిలిచి మాటలాడఁ బని గలిగి వచ్చితి నని లోనికిం జెప్పి యనుపుటయు నేనును దత్ప్రవేశంబు నడుపం దగువారి నియమించితి నప్పుడు. ౨౦.

చ. మెఱియలవంటిరక్కసులు మిక్కిలి లెక్కకు మీఱి క్రొవ్వు నే
డెఱయఁ దలిర్పఁగా వడివడిం దనవెంటనె ద్వారపాలురన్
నెఱి చెడ మట్టికొంచుఁ జోర నిర్భరగర్వము నుబ్బు బింకముల్
మెఱయఁగ వచ్చి యాయసుర మించె మదగ్రమహాసనస్థితిన్. ౨౧.

చ. బలిమిఁ దదీయు లప్పుడు సభామునిముఖ్యుల రెట్టఁ బట్టి యా
తలఁ బడవైచుచుం దమకుఁ దామె యవారణఁ దత్తదాసనం
బులు గొని కూరుచుండిరి తపోధనులున్ సురలు న్వెడంగుపా
టొలయఁగ గ్రుక్కుమిక్కు మనకుండి రొదుంగుచు నక్కడక్కడన్. ౨౨.

ఉ. యాదవసింహ నాతలఁపు నప్పుడు వారలపాటొకింత యాఁ
గా దనుదాఁక లేదు గలఁకం బడఁ జొచ్చె ఖిలుండు వీఁడు పెం
పేదఁగఁ జుట్టుముట్టి మము నిద్దఱఁ బట్టిన నేది దిక్కు ప్రా
మాదిక మైనమోస మిది మన్నతి కంచు జనించుశంకతోన్. ౨౩.

వ. ఏ నప్పు డుప్పతిల్లెడుమదికలంక యెఱుకపడకుండ గాంభీర్యంబుఁ దెచ్చుకొని తనకు వస్త్రాభరణాదిసంభావన లొనర్చుటకు వారి వీరిం బిలిచి నియోగించుచు సంభ్రమించుటఁ గనుంగొని యన్నియు వచ్చెం జాలు నిలు మని వారింపుచు నిలింపద్వేషి యిట్లనియె. ౨౪.

గీ. వలసినట్లు దివ్యవస్తువు లెల్ల నా। యిచ్చ ననుభవించి వెచ్చపెట్టి
ప్రభుత నెఱప కకట పరుఁ డిచ్చునందాఁక। నెదురుచూచు దైన్య మేల నాకు. ౨౫.

క. నీమంచితనపునటనల। నే మొగమోడుచు నెఱుంగ కిట్లుండితిఁ గా
కేమిటికి నాకు నీదువ్య।ధామాధురి యొండు వినుము తగవరి వైనన్. ౨౬.

మత్తకోకిల. ఎంతకాలము నీవు నాకము నేలి తిచ్చుట నుండి నా
కంతకాలము నేలఁ బాడి బిడౌజ కశ్యపమౌనిరా
ట్సంతతిత్వము మీకు దానవజాతికి న్సరి గాదె నీ
వింతయుం గని రాజ్యహీనత నేఁగు మెచ్చటి కేనియున్. ౨౭.

గీ. ఇట్లు సేయవేని యింద్ర మీరెల్ల నా। చేతిలోనివార చెప్ప నేల
యిపుడ పట్టి నిగ్రహించెద నావుడు। నేను నగుచు యాతుధానుతోడ. ౨౮.

గీ. నిగ్రహాముల కేమి నీవును నేము నన్యోన్యమైత్రిఁ బొదలునట్టి తెఱఁగు
నడపవలయుఁ గాక యెడసి పోనాడుకోఁదగవె వేగిరింపఁ దగునె యనఘ.

వ. దానవేంద్రా నీపలికినట్లు మన మిరువురము గశ్యపసంతానం బగు మనయెల్లవివాదంబులు నతండె తీర్ప నర్హుండు గావున నమ్మహామునీంద్రు నరిగి యతనియొుక్కమీఁద నీకు నాకాధిపత్యంబు నొసంగవలసిన నొసఁగెఁ దొలుత మదీయవచనంబులు విని యిట్టిసైరణ వహించి తదితుదముట్ట నడపక పెట్టుట నీయట్టిగట్టిదొరకు నుచితంబె తియ్యనినోరం జేఁదు మేయుట నాఁగా దని మఱియు ననేకప్రకారంబుల నొడంబఱిచి యతని యతివ్యగ్రతకుం విఘానంబు గానక యే నపుడె యప్పటికి దొరకినబృహస్పతిప్రముఖులు నహోగా నమ్మహాదైత్యువెంటం గశ్యపుపాలి కేఁగితి నప్పు డప్పరమతపోధనుండు దీక్షితుండై యున్నవాఁడు గావున మావివాదంబులు నిజయజనావసానంబునందె తీర్చుటకు నియమంబు చేసి యాసురవిరోధిని యథార్థసాంత్వనాలాపంబుల శజేసి యిప్పుడు నీవు నీవజ్రపురంబునకుఁ జను మని యాజ్ఞాపించిన.

ఉ. ఇంబడరంగ నియ్యకొని యెన్ రజనీచరుఁ డేమిభాగ్యమో
యంబుజనాభ యప్పటికి నమ్మునిసత్కృప నేము నేమి చె
ప్పం బులినోరికండ విడి పడ్డగతిం దలపట్టి చూచుకొం
చుం బెనుచేటు దప్పె ననుచుం దివి కేఁగితి మెయ్యా నొయ్యనన్.

చ. అదరి మదోద్ధతత్వమున నద్దనుజుం డెపు డేమఱించి పైఁ
బడునొ యెఱుంగరాదు సురపట్టణరాజ్యసుఖాశ యేర్పడ
న్విడిచితి నింక నీవు తల నిండఁగ నర్థము వోసితేని నే
నడుగటు పెట్టఁగా వెఱతు నచ్యుత నిన్నునె కొల్చి యుండెదన్.

వ. అనుటయుఁ గర్ణంబులు మూసికొని వాసుదేవుండు.

ఉ. పాడిఁ దొఱంగఁ జన్నె యొకపట్టునఁ గొల్చెద నంచు నెంతమా
టాడితి సర్వదైవతకులాధిప యోడలు బండ్ల వచ్చు బం
డ్లోడల వచ్చు నొండొరుల కొక్కొకచో ననువైనతావులం
గూడుట యిష్టబంధులకుఁ గ్రొత్తయె యిత్తఱి నింత యేటికిన్.

ఉ. ఎన్నఁగఁ దొల్లి యీకోలఁది యే బలురక్కసు లెంద ఱెంద ఱ
త్యున్నతిఁ గ్రొవ్వి త్రుళ్ళరు బిడౌజ తుదిం జెడి పోరె వాండ్రు వీఁ
డు న్నిజనాశకాలము కడు న్నికటం బగుడు న్నలంగఁ జే
సె న్నిను నింత సత్పురుషచిత్తము నొచ్చిన రిత్త వోవునే.

మ. వసుదేవుం డిపు డధ్వరం బొకటి నిర్వర్తింప నుద్యుక్తమా
నసుఁ డైనాఁ డదియున్ ద్వదర్థము కదా నాకేశ యా కార్య మె
ప్డు సమాప్తం బగు వంతనుండియు వరప్రోల్లాసి నాదుష్టరా
క్షసు సాధించుటకుం బ్రయత్నముఁ దగం గావింత మేకాగ్రతన్. ౯౬.

క. నీవు నుపాయాన్వేషముఁ। గావించుచు నుండు మల్పకార్యం బది గా
దే వెరవునఁ దత్పురి చొరఁ। గా వలయునొ యెవ్వ రోర్వఁ గలరో వానిన్. ౯౭.

వ. అని యింద్రు వీడ్కొలిపి వేడ్క భాసిల్ల వాసుదేవుండు వసుదేవయజ్ఞనిర్వహణ ధూర్వహుం డయ్యె నంత. ౯౮.

సీ. నిఖిలదేశాయాతనృపతిభూషాకర్షరేణుసంపోషితక్షోణికంబు
మహితావభృథలాభమహిమధన్యత్వభాగ్జలదర్శితాపూర్వసౌష్ఠవంబు
వరమంత్రతంత్రహవ్యద్రవ్యషాడ్గుణ్యసంభృతానలనవౌజ్జ్వల్యకంబు
సన్నుతసాన్నాయ్యసౌరభ్యసంపదాఢ్యంభవిష్ణుప్రవపూతానిలంబు
హోమధూమానురంజితద్యోతలంబు। నగుచు వసుదేవునధ్వర మతిశయిల్లె
భవ్యలీలామహాభూతపంచకమున। కొక్కొకవిశేష మొనఁగుచు నొప్పుమీఱి. ౯౯.

శా. అక్షయ్యం బగు పెంపుఁ దాల్చును దపోయజ్ఞక్రియాదుల్ తదీ
యక్షేమంకరనామసంస్మరణపుణ్యావాప్తి నాఁ బుండరీ
కాక్షుం డచ్యుతుఁ డాదిపూరుషుఁడు ప్రత్యక్షాకృతిం దావె సం
రక్షింపం బెనుపొందుయజ్ఞమునకున్ బ్రాశస్త్య మింకే మనన్. ౧౦౦.

వ. అది యట్లుండె నతండు యాగసమాప్తిసమయంబున సమస్తదేశాయాతు లైనబంధుమిత్రాదులం దత్తదర్హసంభావనలచేతం బ్రీతులం జేయుచున్న యత్తఱి భద్రుం డను నటుం డచ్చటికి వచ్చి యత్యద్భుతం బగునర్తనప్రవర్తనంబునం బరితోషంబు నొందించి సభాసదు లయినమునులచేత వివిధంబు లైనవరంబులు నితరులచేతం బారితోషికంబు లైనయంబరాభరణముఖ్యంబులుఁ గైకొనుచు వారిని వేఱువేఱ యనేకప్రకారంబులం బొగడుచుం బ్రవర్తిల్లుచున్నంత. ౧౦౧.

చ. కలికిపిసాళినవ్వు లెసఁగ న్నటుధూర్తులు గొందఱొండొరుం
దలకొన నెచ్చరించి తమదండపుఁగోలల నున్నమాఱుగోఁ
చులు వెనఁ బుచ్చి వైచి కడుసొంపులుగాఁ బొగడించుకోఁ జామీ
తలఁపఁగ నిప్పు డింత తెగుదారుల మైతిమి భద్ర నావుడున్. ౧౦౨.

క. ఎలనవ్వొలయఁగ నాతఁడు। కలయఁగ నవి చుట్టి పట్టి గంభీరపుఁబే
రెలుఁగొప్ప నొహొహోయని। పలుమఱు నెగరంగ వైచి పట్టుచు వేడ్కన్. ౧౦౩.

సీ. వేదశాస్త్రభములు వెదచల్లఁ గలుగుచిబ్రాహ్మణజాతికోరకములార
పరిశుద్ధి పెంపొందుబ్రహ్మవర్చసపావకస్ఫూర్జితస్ఫులింగంబులార
యరయ నటికసికలంత లయ్యును బింకమున బ్రహ్మశిఖ ముట్టుప్రోడలార
దంటమాటలకు ధాత్రి ధ్రీమునకు సానతి పడిపట్టినట్టిసత్ప్రాజ్ఞులార
చిన్నవడుగులార వెన్నునివామన। త్వంబు నభినయించుతంద్రులార
మీప్రసాద మిది సమృద్ధికారణము మా। కఖిలకార్యముల మహాత్ములార. ౧౦౪.

వ. అని పొగడిన నవ్వి యవ్వటువులు దుండగంబున. ౧౦౫.

గీ. ఓరియాటకాఁడ యీరీతియబుపులా। పొగడు టనఁగ మెచ్చు పుట్టె దిందు
మగుడఁ బుచ్చుకొనఁగఁ దగదు నీవంటిన। గోఁచు లిపుడు పుచ్చుకొనక చనము.

వ. అనుచుఁ దలంగి పోక యిట్టు నట్టుం జుట్టు మెట్టాడుచిట్టివడుగుల నానట్టు నగవునుం గోపంబుఁ గదుర నదలించుచుం దనమేళగాండ్ర నాలోకించి యిబ్బాలకులు మనవాలకపుసొమ్ములందు నేమేనియు నపహరించుటకు నల్లాడుచున్నవారు మీరలీ ప్రముచ్చుల నెచ్చరికం గనుపెట్టుకొని యుండుఁ డనుటయు నుదరిపడుచు నప్పడుచులు గడుసుఁదనంబున నతని నధిక్షేపించి. ౧౦౬.

సీ. ఏము ప్రముచ్చులమె యూహింప ప్రముచ్చుఁదనాలపుట్టినయిండ్లు మీబోంట్లె కాక
యాటవాండ్రని నమ్మి యనుమతింపఁగ నెట్టిపుర మైన నశ్రమంబునను జొచ్చి
పగలెల్ల నాటల భ్రమయించుచును సందుగొందు లెల్ల నెఱింగికొనుచు రేలు
కన్నగాండ్రగుచు నగళ్ళు ప్రవేశించి యందు నెంతటివార లడ్డ మైనఁ
జక్కడఁచుచుఁ జేనుగ్రుక్కినపాటిగా। నిష్ట మైనయర్థ మెల్లఁ బడసి
బ్రతుకుచునికి మీస్వభావమింతయును ద।ప్పదు యథార్థ మనుచుఁ బలుకుటయును.

మ. వనజాక్షుం డపు డింద్రకార్యము డెన న్వర్తిల్లుచిత్తంబుతో
నునికి న్వజ్రపురంబుఁ జొచ్చుట కుపాయాన్వేషి యై యున్కిఁ జే
సి నిజాపేక్షకు నుత్తరంబుగ గ్రహించె న్విప్రవాక్యం జనా
ర్దన యస్మాట యథార్థ మై పరఁగఁ దద్వాక్యక్రమం బంతయుఁ. ౧౦౯.

వ. ఇవ్విధంబున విశ్వంభరుండు వటువచనంబు లుపశ్రుతిగం జేకొని తదనుసారంబున వజ్రపురప్రవేశంబును వజ్రనాభవినాశంబును నతిసుకరంబులుగా మనంబున నిశ్చయించుకొని తత్ప్రయోజనంబునకు నరుగ నర్హుం డెవ్వఁడొకో యనువిచారంబునం బ్రవర్తిల్లె నటమున్న యమరనాయకుండు దనుజాపాయంబునకు నుపాయంబు భావించి దేవశైవలినీవిహారమహారసతరంగితాంతరంగంబు లగుచక్రాంగంబుల రావించి సగౌరవంబుగా ని ట్లనియె. ౧౧౦.

గీ. హంసవరులార మా కొక్కయవసరంబు। గలిగి పిలిపించితిమి మీరు గలుగుటకును
ఫలము మీచేత నైనయీ పని కొదవుట। గావున వినుండు వివరింతుఁ గార్యసరణి.

క. మము వజ్రనాభుఁ డనియెడు। నమరరిపుఁడు పఱచినట్టియాపాట్లు సమ
స్తము మీ రెఱుఁగుదురే కద।క్రమమున నవి చెప్పనేల ఖగవరులారా. ౧౧౨.

గీ. మాకు నిప్పుడు వాని మర్దించుయత్నంబు। గలిగి యున్నయది ప్రకాశ మైన
నెగ్గు పుట్టుఁ గాన నీరహస్యంబు మీ। మనసునందె పెట్టుకొనఁగ వలయు. ౧౧౩.

క. మాకంటె వాఁడు మునుపుగ। నేకార్యము సేయఁ గలఁడొ యెఱుఁగము మీరల్
జోకగఁ దత్పురి మెలఁగుచు। నా కేదొకపనికి వేగు నడపఁగ వలయున్. ౧౧౪.

చ. ప్రతిదివసంబు వానినగరంబునఁ బుట్టువిశేషము ల్భవ
న్మతిపస నన్నియుం దెలిసి మా కెఱిఁగింపుట మీప్రయోజనం
బితరులచేతఁ గా దిది తదిష్టము లేక చొరంగ రాదు మా
రుతమున కైనఁ దత్పుర మొరు ల్చొరఁ జాలమి చెప్ప నేటికిన్. ౧౧౫.

క. మీరాకపోక లింపు సు। రారాతికిఁ గేళిదీర్ఘికాదులకు నలం
కారములు మీవిహారము। లారయ నేరికి నతిప్రియంబులు కావే. ౧౧౬.

వ. అనుటయు నాపులోమజావల్లభునకు శుచిముఖివల్లభుం డనుమరాళతల్లజుం డుల్ల
సితవదనుం డగుచు నెదుట నిలిచి దేవా యీవేళ నావజ్రనాభుండు ప్రాభవాభి
మానంబునఁ గన్నుగానమిఁ దన్నుఁ దా నెఱుంగ కున్నవాఁడు నాకుఁ జూడ నిప్పటిక
కా దెప్పటికి నప్పరమతామసుం డింక నీవంకకుం గదలి రా నెఱుంగఁ డని తోఁచు
చున్నయది యైనను మానసంబున దేవర దేవకార్యం బేమియు నేమఱ కుండునది
యిది యంతయు నింతకుమున్ను వజ్రపురినుండి యేము గొందఱము వచ్చితిమి గానఁ
గానంబడినయర్థంబు విన్నవించితి నెంచి చూడం గించిదూనంబుగా వానిరాజ్య
సంపదయుఁ దుదకు వచ్చినది యిది మదీయజాయవలన వినంబడియెఁ దద్విశేషంబును
దానిచేత విన్నపంబు చేయించెద నని తనచెలువం బిలిపించి బలరిపుం గనిపించి నీవు
నాకు వినిపించినవజ్రనాభరాజ్యావసానసామీప్యంబు స్వామికి నేమియుం
గొఱంత పెట్టక విన్నవింపు మనుటయు నాశుచిముఖి శతమఖున కభిముఖి యై యి
ట్లనియె. ౧౧౭.

చ. తడవులఁబట్టి యేము సతతంబును బోదుము వానివీటికిన్
గడు మతి చాలమిం గడుపుఁగక్కఱితి స్సురలోకనాథ మా
యెడఁ గలయట్టితప్పిది సహింపుము పక్షుల మాట నొక్కవెం
బడి నిది చెల్లెఁ గాక రిపుప్రాంతము చేరెడువార లాప్తులే. ౧౧౮.

వ. ఏమునుం బోక మానెద మని తలంతు మేని. ౧౧౯.

సీ. గగనస్రవంతిలోఁ గలసువర్ణాబ్జంబులందు మేలేర్చి తా నపహరించి
మానసంబు శతాత్మమానసంబును బోలె నిస్సారసత్త్వంబు నెరయఁ జేసి
బిందుసరంబులోఁ గుందనపుందమ్మి పేరు లే కుండంగఁ బెల్లగించి
సౌగంధికాఖ్యకాసారంబు జలమాత్రశేషమై దీనతఁ జెందఁ జేసి
మఱియుఁ గలదివ్యసరసులు నెఱయఁ జెఱిచి। తనదుకేలిదీర్ఘికలందుఁ గనకనలిన
జాతు లెల్ల నాటించినాఁ డాతఁ డింద్ర। యటు చనక మేఁత నచుచునే హంసములకు.

వ. అది యట్లుండె నట్లు వజ్రపురంబునం గలకొలంకులం దటాకంబులం గేళీకూపుల
బొడ్డనబావుల నడ్డపెట్టు లేక విహరించుటకు వజ్రనాభుముదల యడిగి తజ్జలాశయంబు
లన్నింటికి నస్మదీయసంక్రీడనంబుకలిమి యలంకారం బగుట యెంచి యతం డంగీక
రింప యథేష్టవిహరణంబుల నహరహంబునుం బ్రవర్తిల్లుచున్నయేము నిన్నఁ గన్య
కాంతఃపురంబున నొక్కసరోవరంబునం బరఁగుతఱి సామ్రాజ్యలక్ష్మీసాక్షాత్కారాను
కారిణి యైనయొక్కకన్యకామణి తనచెలికత్తియతోడం దత్తటంబునం గ్రొత్తవిరి
గుత్తిమొత్తంబుల నత్యంతంబు చెలువొందుగురివిందపొదరింట నొంటి నుండి య
వ్వాలుగంటితోడ. ౧౨౧

చ. కమలదళాక్షిరో వినవుగా కల యొక్కటి గంటి వేకువన్
సమధిక మైనయద్భుత మొనర్చుచు నున్నది యెన్నకొన్న లో
కమునను గన్నవిన్నయది గాదది కొంత నిజంబు కొంత స్వ
ప్నము నని పల్కి సిగ్గుకతనన్ మఱి చెప్పక దాఁచె దాఁచినన్. ౧౨౨.

క. ఒట్టిడుకొంటివి గద నీ। కెట్టిరహస్యంబు దాఁప నే నని మనలో
నిట్టివి గలవా యని చెలి। యట్టే తప్పదన విరచితాంగీకృత యై. ౧౨౩.

వ. ఆకలకంఠి తనకల సకలంబు నకలంకసౌహార్దంబున నిట్లని వినిపించె. ౧౨౪.

చ. హిమగిరిరాజకన్య పరమేశ్వరి నాకల సుప్రసన్న యై
విమలదరస్మితామృతము వెల్లువ చెక్కులఁ బిక్కటిల్ల నన్
మమతను జేరఁగాఁ బిలిచి మక్కువచే నను నొక్కకేల మే
నిమురుచు నీకు నొక్కమగనిన్ ఘటియించితి నంచుఁ బల్కుచున్. ౧౨౫.

సీ. సంకల్పమాత్రతత్క్షణసన్నిధాపితం బగుచిత్రఫలకంబునందు నొక్క
పురుషు నత్యాశ్చర్యతరరూపలావణ్యగాంభీర్యశౌర్యాదిశుంభదఖిల
గుణములఁ గొమరొందుకొమరుఁబ్రాయపువాని వ్రాసి యితండ నీవల్లభుండు
ప్రద్యుమ్నుఁ డనియెడుప్రభుకుమారుఁడు మీకు నిద్దఱకును జనియించినట్టి
పుత్త్రుఁ డీపురి యేలు నోపడఁతి యనుచుఁ। బలికె నఁట నేను నచటిపెద్దలు గఱపఁగ
మ్రొక్కి యనిపితినఁట యిందునిక్క మగుచుఁ। బడఁతియున్నది తచ్చిత్రఫలక మిపుడు.

మ. అనుచు న్నెచ్చెలితోడ నచ్చెలువ యట్లత్యద్భుతస్వప్నమున్
వినిపింప న్నికటంబున న్నెలఁగుచున్ వింటి న్సురాధీశ దా
నన యే నెన్నిక నిర్ణయించితి మదిం దథ్యంబుగా వజ్రనా
భునకుం గాలము చేరువాట యిది నీబుద్ధి న్వివేకింపుమా. ౧౨౭.

సీ. ఆయింతికిఁ బ్రద్యుమ్ను జాయగాఁ బలికిన గౌరిమాటకు బొంకు గలుగ దనుము
దనుజవిరోధిపుత్త్రునకు నాదుష్టదైత్యుఁడు తనంతఁ దనూజ నొసఁగఁ డనుము
ప్రద్యుమ్నుఁ డట్లు ప్రభావతీపతి యైన దానవునకుఁ బోరు తప్ప దనుము
వజ్రపురము ప్రభావతికొడు కేలుట యసురకు జయ మైనఁ బొసఁగ దనుము
చిత్రఫలకంబు ప్రత్యక్షసిద్ధ మగుటఁ| జేసి యాకల యధికవిశ్వాసయోగ్య
మదియు వేకువఁ గావున నచిరభావి| ఫలము దేవేంద్ర నీ వెంచి తెలిసికొనుము. ౧౨౮.

వ. ఆకన్నియపేరు ప్రభావతి యగుటయు నది వజ్రనాభునికూఁతు రగుటయుఁ దదీయ స్వప్నకథనానంతరప్రవృత్తంబు లయినయమ్మత్తకాశినులయుత్తరప్రత్యుత్తరంబుల వెంబడి నెఱుంగంబడియె నవియును గొన్ని వివరించెద భవదీయకార్యోపకారి యైనయంశంబు గలిగిన గ్రహియించునది యని యాయంచ గరిత యకించిదంచితసహజ మాధురీధురీణవాణీరామణీయకంబు కార్యకామనీయకంబున నినుమడించి బిడౌజుని బిడౌజుం జేయుచుండ నిట్లనియె. ౧౨౯.

క. విను మట్లు తనదుకల చె| ప్పినయాయమఁ జూచి దానిప్రియసఖి యనయం
బును వెఱఁగందుచు మెచ్చుచు| వనితా నీ వెంతభాగ్యవతివే యనుచున్. ౧౩౦.

వ. శిరఃకంపం బొనర్చి. ౧౩౧.

గీ. మునుపు గౌరివరంబుచేతనె జనించి| తబల నీవు నిన్గన్న మాయమ్మ సేమ
మట్టి దిట్టిది నాఁ జన్నె యగజ నీవు| నింత మెప్పించుకొంటి నీ కెవ్వ రీడు. ౧౩౨.

చ. వలిమలయాఁడుబిడ్డ కల వచ్చి యనుగ్రహ మెంతయేనియుం
గలుగక యిట్లు చిత్రఫలకంబున నీకు లిఖించి యిచ్చునే
చెలువుని నింతదృష్టముగఁ జెప్పెద నొండొకపోఁతుటీఁగకున్
బొలయఁగ రానిచోట నిది పుట్టుట నెగ్గు నీదుతండ్రిచేన్. ౧౩౩.

గీ. చిచ్చు లేక చిగుడుమచ్చరీఁ డీసుద్ది| వజ్రనాభుఁ డోర్చువాఁడె యకట
యజగ పేరుపెట్టి యతివ యెవ్వతో యింత| చేసె ననుచు మమ్ముఁ జెండుఁ దొలుత. ౧౩౪.

క. ఆచిత్రఫలక మెవ్వడు| చూచిన వెలివిసరి యపుడు సుబ్బెడు నది నీ
వే చూచి తేను జూచుట| యోచంచలనయన యింతయు నెఱుంగుదువే. ౧౩౫.

చ. ఇతరులు రాకమున్న యది యెక్కడఁ బెట్టినదానవో సఖీ
ఘనోత్కటఁ గొనితెమ్ము తల్లిఖితుఁ గన్నులఁ జూచినదాఁక సామనం
బతిముదితంబు గా దగజ యారసి యెవ్వని వ్రాసెనో సురా
పతపన నీకు జో డయినభవ్యుఁడు దుర్లభుఁ డెల్లసృష్టిలోన్. ౧౩౭.

వ. అనవుడు నక్కాంత యిక్కడ నొక్కచిగురుంబొదరుటీఁజమి నిడినదాన నని యా
క్షణంబ తెచ్చి నెచ్చెలియుం దాను నప్పలకకప్పుఁబావడ యొడలించి. ౧౩౮.

చ. కలకల నవ్వినట్ల తెలికన్నుల నిక్కము చూచినట్ల తోఁ
బలుకఁ గడంగినట్ల కడుభావగభీరత లబ్బినట్ల పెం
పొలయఁ దనర్చి జీవకళ యుట్టిపడన్ శివ వ్రాసినట్టియా
చెలువున కాభిముఖ్యము భజింపఁ దలంకెను దాను బోఁటియున్. ౧౩౯.

ఉ. చిత్తరు వన్ననిశ్చయముచే నెదు రుండి మొగంబు చూడ మో
మెత్తును నత్యపుంభ్రమసమృద్ధిని గ్రమ్మఱఁ దత్క్షణంబ లో
నొత్తుచుఁ దత్తఱంబుఁ ద్రపయున్ మగుడంగ నిరీక్షణేచ్ఛఁ బో
మొత్తును భర్తచూపు దనుమోచుట దోఁచిన నోసరిల్లుచున్. ౧౪౦.

గీ. వెఱయుఁ ద్రపయు లోనుగఁ గలవిఘ్నసమితిఁ
గడుఁ గలఁగి పోక యుండఁ దా నడుమ నడఁచు
నేచి చిత్రతానిశ్చయ మెచ్చరింప
నింతి క్రమమునఁ బ్రియునిరూపెల్లఁ జూచు. ౧౪౧.

వ. అత్తలోదరి చెలికత్తెయు నత్యంతవిస్మయాయత్తచిత్త యై యొక్కింతతడవు చూచి
యి ట్లనియె. ౧౪౧.

ఉ. ఇంతచెండగు లోకమున కెవ్వరి కున్న ది యంబ తా నిజా
త్యంతికనైపుణీమహిమ యంచన వ్రాసెనొ యేమొ కాక యా
చింతయుఁ గూడ దీతని సృజించియె జోడుగఁ గోరినుమ్ము దా
నెంతయు నేర్పుమీఱ నజుఁ డిట్లు సృజించె నిను బ్రభావతీ. ౧౪౨.

వ. అనుటయు నక్కాంతాతిలకంబు. ౧౪౩.

ఉ. ఇచ్చక మాడుమాట లివి యెల్ల నటుండఁగ నిచ్చి నీకు నీ
నెచ్చెలితోడు సుమ్ము సఖి నిక్కము చెప్పుము వ్రాఁతనేర్పు గా
కిచ్చెలువంబు గల్గునను డెక్కడ నే నొకఁ డుండె నేని నేఁ
దచ్చరణద్వయంబునకు దాస్య మొనర్పఁగ నైన నర్హ నే. ౧౪౪.

అని మఱియుఁ బెక్కుచందంబులం గందర్పరాగంబు తేటపఱుచుమాటలం దనబోటి తోడం దడవు సంభాషించుచుండె నవియుఁ బదిలంబుగాఁ దెలిసిన నమ్ముద్దియ ప్రద్యుమ్నుశీఘ్రానయనంబునకు నుద్యోగంబు తద్దయుం జేయుట సంభావితంబు గావున దేవకార్యంబునకు నుపకారంబు వోలెఁ దోఁచుచున్నది యని చెప్పుటయు నవహిత మానసుండై యాకర్ణించి. ౧౪౫.

ధారుణ్యాభరణాయమానబుధతాధారుండు భూమోల్లస
త్కారుణ్యామృతశైత్యనిత్యదృగలంకారుండు నేత్రాంతగా
హారుణ్యాంకురకల్పితారిమదసంహారుండు కీర్త్యంగనా
తారుణ్యాంగళనౌషధాభిజనవిస్తారుండు శూరుం డనిన్. ౧౪౬.

సారతరవైదికసమా।చారుఁడు బహునృపకృతోపచారుఁడు నిరహం
కారుఁడు సాంగానంగా।కారుఁడు సన్నుతవచఃప్రకారుఁడు సభలన్. ౧౪౭.

విరాజవిరాజితము. జలధిగభీరుఁడు శాంతవికారుఁడు శాస్త్రవిహారుఁడు సౌమనసా
చలవరధీరుఁడు శశ్వదుదారుఁడు సంహృతవైరుఁడు శంభుపదా
చలితవిచారుఁడు సాదిమసారుఁడు సత్పరివారుఁడు సర్వనుతో
జ్జ్వలగుణవారుఁడు నంవిదగారుఁడు సంశయదూరుఁడు సద్విభులన్.

గద్యము. ఇది నిఖిలసూరిలోకాంగీకారతరంగితకవిత్వవైభవ పింగళి
యమరనార్యతనూభవ సౌజన్యజేయ సూరయనామధేయ ప్రణీతం
బైనప్రభావతీప్రద్యుమ్నం బనుమహాప్రబంధంబునందుఁ
బ్రథమాశ్వాసము.



## ద్వితీయాశ్వాసము.



క. శ్రీచణగౌతమగోత్ర। ప్రాచీనామాత్యకీర్తి భామావిష్వ
ద్రీచీనగమనశిక్షై। కాచార్యుఁడు సూరమంత్రియమరార్యుఁ డిలన్. ౧.

వ. ఆసహస్రాక్షుం డపేక్షితప్రయోజనానుకూల్యంబుకంటె నా పెంటిరాయంచయం చితవచనరచనావిచక్షణత్వంబు చిత్తంబునకుం గ్రొత్తయింపు సొంపు సంపాదింపుచుం బెంపు మీఱ నింపులగు మెచ్చు నచ్చెరువు నిచ్చలంబులై తనర నిట్లనియె. ౨.

సీ. శబ్దసంస్కార మెచ్చటను జాఱఁగనీక పదమైత్రి యర్థసంపదలఁ బొదలఁ
దలఁ పెల్ల నక్లిష్టతను బ్రదీపితముగాఁ బునరుక్తిదోషంబు పొంతఁ బోక
యాకాంక్షితస్ఫూర్తి యాచరించుచును శాఖాచంక్రమక్రియఁ గడవఁ జనక
ప్రకృతార్థభావంబు పాదుకో నదుకుచు నుపపత్తి యొందు నతూర్జితముగ
నొకటఁ బూర్వోత్తరవిరోధ మొందకుండఁ। దత్తదవయవవాక్యతాత్పర్యభేద
ములు మహావాక్యతాత్పర్యమునకు నొనరఁ। బలుక నేర్చుట బహుతపఃఫలము గాదె.

క. నీ వెవ్వరికోలఁదియుఁ గా। వో వరటామణి విహంగయోషవె భాషా
ప్రావీణ్యము చూడఁగ వా। గ్దేవతవో కాక యాకె దిద్దినకవివో. ౪.

క. అనుటయు రెండవపక్షం। బనిమిషవర తప్ప దెట్టియర్థము నదగు
ల్కొనఁ దివియక వెలివో ని। చ్చునె బుధుఁ డూహించి చేయుసుకవిత్వంబుల్. ౫.

గీ. విను సురేంద్ర పద్మజుని తేరు దివుచుసా। రంధరాఖ్యుఁ డగుమరాళవిభుని
బిడ్డ నేను వాణి పెనుపంగఁ బెరిఁగి త। ద్విమలశిక్షఁ గంటి విద్య లెల్ల. ౬.

వ. అని రాజహంసి తనపూర్వం బెఱింగించిన దేవేంద్రుండు దానం జేసి కాదే నీవింత సామర్థ్యంబునం బొలుపు మీఱుచున్న దానవు మీఁదికార్యంబునకుం బర్యాకులిత భావంబునం జేసి త్రోవఁ గానక దీనత నున్న మాకు మాపాలిభాగ్యదేవత యీవిధంబున నిన్ను నన్నిటికి నాధారంబుగా ననుగ్రహించెం గావున దేవకార్యంబు కడముట్ట నిర్వహించుటకు నీవ తక్క నొరులు నేర రిది యంతయు నెఱింగి యెంతయుం బ్రార్థించెద నంచబలగంబుతో నెప్పటియట్ల వజ్రపురంబున కరిగి కేలిదీర్ఘికల విహరించుచుఁ బ్రభావతితోడి చెలిమికలిమికి నుపాయం బొనర్చి యమ్ముద్దియకుం బ్రద్యుమ్నునం దనురాగంబు బలియునట్లుగా వలయు తెఱంగున నతనిగుణంబు లభివర్ణించి యాయిద్దఱకును శీఘ్రసంగమం బెవ్విధంబున నగు నది నీవ యెఱింగి సంఘటింపుము.

క. ఏ వనిపితి నని ద్వారవ। తీనగరికిఁ బోయి వాసుదేవునితో నీ
పూనిక సకలము చెప్పి వ। విసాదృతి నతనిబుద్ధి విని చన వలయున్. ౮

క. అని హంసంబుల నన్నిటిఁ। గనుఁగొని మీ రెల్ల దీనికార్యవిధికి న
త్యనుకూలత మై నేత। ద్వినియోగము నడపవలయు దేవహితముగన్. ౯.

గీ. అని యనుప మరాళి యమరాళికార్యం బొ।నర్పఁ జనియె సురలు నమ్మి పొగడఁ
బరిగణింప విశదపక్షపాతులప్రవ। ర్తనము లట్లు నమ్మఁ దగక యున్నె. ౧౦.

వ. అది యట్లుండె నట్లు గదలి చని. ౧౧.

గీ. అష్టమహిషీసమేతుఁ డై యాలయోప। వనసరస్తీరమంటపవర్తి యైన
కృష్ణు దవుదవ్వులన విలోకించి తెలిసి। యితని సెజేఁగించుకొనవేళ యిదియ యనుచు.

క. తనయుంచబలంగముఁ దా। నును శుచిముఖి నభము డిగ్గి నూత్నవిలాసం
బొనరించె నరోలక్ష్మికిఁ। గనకాంచితపక్షచకచకద్యుతిచేతన్.. ౧౩.

వ. తదనంతరంబ తా నొక్కతియ రక్కసులగొంగచెంగటికి నల్లనల్లన నడచి. ౧౪.

సీ. తొడలు తలాడగా నిడి రుక్మిణి భజింపఁ బదము లొత్తుచు నత్యభామ కొలువ
నురటి చేకొని భద్ర శుశ్రూష గావింప విరిచామరము మిత్రవింద యిడఁగఁ
గాళింది వేడ్కతోఁ గాళంజిఁ దాల్ప జాంబవతి తములపాకు మడిచి యొసఁగ
గొడుగు పావలు కేలఁ గొని నాగ్నజితి యుండ జలములగిండి లక్షణ వహింపఁ
గ్రొమ్మెఱుంగులతోడికార్మొగులు వోలె। నొప్పుకృష్ణునిచేరువ నొప్పె హంసి
నిండు నెలరీతిఁ దారకాన్వితనభంబు। పొలుపుఁ దెలిపెడి నెత్తమ్మికొలనికెలన.

గీ. బెదరు లే కిట్లు మిక్కిలి గదియ వచ్చి। యున్న తనదిట్టతనమున కువిద లెల్ల
నరుదుపడఁ గృష్ణుఁ జూచి నన్నమరవిభుఁడు। పనిచె నీకొక్కమాట చెప్పంగ ననియె.

వ. అని తదనంతరంబ. ౧౬.

క. తనతనయుఁడు రాక్షసుపైఁ। జనియెడు నని రుక్మిణికి నసమ్మత మగునో
యనుశంకఁ జేసి హంసాం। గన యేకాంతంపుమాట గల దని పల్కెన్. ౧౭.

క. పలికినఁ గమలావిభుఁ డా। పులుఁగుపడఁతిమాటనేర్పు బుద్ధికళాకౌ
శలమును మెచ్చుచు నెంతయు। మొలకనగవు చెక్కుటద్దములఁ దళుకొత్తన్.

చ. చెలువుగ భోజకన్యతొడఁ జేర్చినమూర్ధము సత్యభామయూ
రులపయి నున్నపాదములఁ బ్రోడ్జితలీలఁ దెరల్చి లేచి యు
జ్జ్వలనిజపాణిపద్మమున జాంబవతీకరనాగవల్లికా
దళములు పుచ్చుకొన్నఁ బ్రమద ల్చని రందఱుఁ గొంత దవ్వుగన్. ౨౦.

గీ. ఇట్లు గోవిందుఁ డేకాంత మిచ్చి వినఁగ। హంసి తమ వజ్రి పిలిపించు టాదిగాఁగ
నచటి కనుచుట తుదగాఁగ నతనితమవ।చఃప్రసంగంబు నిరవశేషముగఁ జెప్పె.

వ. ఇట్లు చెప్పిన. ౨౨

చ. వడుగులపల్కుప్రశృతిగ వారక మున్ను సునిశ్చితత్వమున్
బడసినకార్యపద్ధతికిఁ బక్షివధూవచనక్రమంబుచేఁ
గడమ సమన్వితం బగుడుఁ గంజదళాక్షుఁడు సంతసిల్లె నే
ర్పడియెను వజ్రనాభవధభారవహుం డిపు డంచు నాత్మలోన్. ౨౩.

వ. ఇట్లు సంతసిల్లి శుచిముఖి కి ట్లనియె. ౨౪.

చ. బలవిభవాభిశోభితుఁ డభంగురశౌర్యధురంధరుండు కా
వలసినమాయలు న్దివిజవైరులకంటెఁ గరంబు నేర్చు నీ
పలుకులచంద మారయఁ బ్రభావతికిం బతిగాఁ గలాఁడు ని
చ్చలముగ రుక్మిణీసుతుఁడు చంపు నవశ్యము వజ్రనాభునిన్. ౨౫.

క. ఆరాక్షసుపట్టణ మె। వ్వారికిఁ దదనుజ్ఞ లేక వైరమునఁ జొరం
గా రాదఁట ప్రద్యుమ్నుఁడ।వారణఁ దత్పురముఁ జొచ్చువెపు విను మిఁకన్. ౨౬.

సీ. భద్రాఖ్యుఁ డను నటప్రముఖుఁ డొక్కరుఁడు మున్నరు దెంచి మజ్జనకాధ్వరమున
ననయంబుఁ గూడినమునిసభం దన నాట్యగరిమచే మెప్పించి వరము గాఁగఁ
దన కవధ్యతయు సప్తద్వీపగమనంబు నాకాశగతియు నాట్యములయందు
నెవ్వరిరూపు వహించె వారలయట్లు తాను భేదము లేక తనరుటయును
బడసి యేడుదీవుల నాటపన నెరపుచుఁ। దిరుగుచున్నాఁడు వానిపైఁ దెలిసుతునకు
వేడ్కఁ బుట్టంగఁ జెప్పి యప్పిట్టి మచ్చొరఁగ।ముదల గొను మాతఁడై వచ్చు మదనుఁడంత.

వ. ఇది నీకుఁ బరమప్రయోజనంబు దీన నుపయోగింపఁ దగినయుపాంతరకృత్యంబులుఁ దత్తదుపాయంబులు నీవ యెఱుంగుదు పొమ్ము సురకార్యంబు నిర్వహింపు మని వీడుకొలిపినం దనమరాళజాలంబుతో జాలపాదవనిత గగనంబున నెగసి వజ్రపురంబున కభిముఖంబుగాఁ బ్రయాణంబు సలుపునప్పుడు ద్వారకానగరబాహ్యప్రదేశంబున వాహ్యాళివిహారసారస్యంబునం దగిలి యున్నప్రద్యుమ్నుండు. ౨౮.

చ. తనహృదయంబువెంబడిన తప్పక ఘోటక మంతనంత నే
మనుపడ నిల్చి ముందటికిఁ బాఱె కెలంకులకుం దొలంగి దా
వెనుకకు నేగుదెంచి కడువేడ్క యొనర్పఁగ బంతి యాడ నె
మ్మిని గనకంపుఁగోల నడిమింట నెత్రిమ్మరఁ దారి కొట్టుచున్. ౨౯.

వ. మఱియును. ౩౦.

చ. ఎగరఁగ వైచి కొట్టు టది యెంతభరం బని బంతి యగ్రగా
మిగ వడిఁ బాఱవైచి పుడమిం బడనీక యె దాని మీఁటి చి
త్రగతి హయంబుఁ దోలుచును గ్రమ్మఱ మీఁదికిఁ గొట్టి యాడె విం
తగఁ దనచేతిరత్నమయదండము కాంతులు గాడి పాఱఁగన్. ౩౧.

వ. వెండియు నతండు మండలగతుల నతులంబుగాఁ దురంగంబుఁ దోలి యాడె నప్పుడు.

సీ. తొలుదొల్త నయ్యేకతురగంబు మండలగతిచారి యగుచు నిక్కంబు తోఁచె
నావెనుకను నరూపాశ్వాలి చెదరక చక్రాకృతిని బర్వుసరణి తోఁచె
నంతట ననతిస్ఫుటావయవంబుగా నెనసి యేకాంగవేష్టనత తోఁచెఁ
దుదఁ దద్విభూషణద్యుతిరాజిమాత్రంబు కొఱవి త్రిప్పినరీతి మెఱసి తోఁచె
నంతకంతకు గతివేగ మగ్గలింప। రాఁగ వాగె యెచ్చరిక పరాకు జియ్య
యనుజనులు తెచ్చవడి తమపని మఱవఁగఁ। బరఁగునమ్మేటి నెఱరౌతు ప్రౌఢికతన.

చ. ఉరుజవశాలి యత్తురగ ముల్మకచక్రనయావలంబి యై
తిరుగు రయంబుచేత నెడ త్రెవ్వక కుమ్మరిసారెచాడ్పునన్
బరఁగెఁ గడున్ ధృతాభినవభాండతకుం దగ సుక్కుపట్టు దాఁ
దరలక పైని దద్భ్రమణదండగతిన్ హరిపుత్రుఁ డొప్పఁగన్. ౩౪.

వ. అతఁ డంత. ౩౫.

క. వల్గితముఖగతిపంచక। వల్గువిహారముల సైంధవము నలయించెన్
వల్గావిభాగకుశలత। వల్గత్కుండలమరీచివల్లరు లెసఁగన్. ౩౬.

శా. నానావీథిగతిప్రభేదవిహృతిన్ సంతృప్తుఁడై కంతుఁ డిం
పూనన్ వాగె గుదించినన్ బురుషకప్రోన్నమ్రపూర్వాంగ మై
కానంగాఁ బడియెన్ మరుజ్జవన మాగంధర్వ మర్త్యాశ్వసం
తానస్పర్థను మిన్ను బ్రాఁకెడు క్రియన్ బా నెంతయుం జూడ్కికిన్. ౩౭.

సీ. నముపలాలనయుతస్కంధాంతికాస్ఫాలదమితతేజోమహార్ధత్వకంబు
దంతాళికానియంత్రణసమున్నామితాకుంచితగ్రీవానమంచితంబు
దందన్యమానశబ్దాయమానఖలీనకషణఝర్ఝరితసృక్వద్వయంబు
ఘనఘర్మడిండీరఖండపాండురితపల్యయనవర్ధోభయప్రాంతకంబు
నగుహయము డిగ్గెఁ బ్రద్యుమ్నుఁ డంకవన్నె।యొకటి సాహిణియవ్వల నూఁదిపట్టఁ
దనయనుఁగుచెలికాఁడు కైదండ నొసఁగఁ।బ్రజ నురాళించి మణులువస్త్రములు వైవ.

గీ. అపుడు గగనసరణి నరిగెడుశుచిముఖి। యతనిఁ జూచి యల్లయతఁ డితండ
కావలయు నవశ్య మీవరపురుషుతో। మాట లాడి చనుట మనకు మేలు. ౩౮.

క. అని యాప్రద్యుమ్నునకున్ । వినఁబడునట్లుగ మరాళవితతులతోఁ బ
లిక్కె నిజోక్తి కతఁడు వెఱఁగం । ద నయంబున నవియుఁ దాను ధరణికి డిగ్గన్. ౭౦

సీ. మనువశ్యగతి మెచ్చి సురలు వైచినపైఁడిప్రాఁతక్రొమ్మడుఁగుదువ్వలువ లనఁగఁ
దర్పకు నెఱకౌతుతనము పేర్మిఁ గ్రమ్ముకొనుసతేజఃకీర్తిఘనము లనఁగ
హయఫేనధావళ్యయాచ్నార్థమై ప్రాలుతటివనుగతసితాబ్దంబు లనఁగ
వాజివిభ్రమజితావర్తత దొలఁకుదివ్యులయేటిసాజ్జరేణూర్ము లనఁగఁ
గనకరేఖలతోడి టెక్కెలబెడంగు । చూపఱకుఁ గనుపండువై సొంపు మీఱ
జలదపథమునసుండి భూస్థలికి డిగ్గు । హంసములు వర్ణనాసీమ నతకరించె. ౭౧

సీ. ఇట్లు గన్పట్టుచు నేతెంచి యంచలు వసుధ చేరువ నేటవాలుగాఁగ
నతినిశ్చలప్రసారితపత్త్రంబులై డిగుచుఁ గామునిముందటికిని గొంత
సరి గడవఁగఁ జాఁటి మరలి బోరలు దెట్టగిల నొక్కకడ వంచి మలపు దిరిగి
యెఱక లంతట రెండు నెఱయఁ జక్కఁగఁ జాఁచి యవనిఁ గాల్మోపి టెక్కార్చిముడి…
మొగము లోకవింతయొయ్యారముగ మలంచి
యీఁకను విదిర్చికొనుచు నొక్కింతతడవు
హైమరేఖావిచిత్రనిజాంగరుహవి
నిర్మలతఁ జూడ్కులకు నింపు నింపుచుండె. ౭౨

వ. అంతఁ బ్రద్యుమ్నుఁ డుద్యోతమానకౌతుకంబున వాని నుపలక్షించి పక్షివరులా…
తొలుత నితనితో మాటలాడ వలయు ననుకొంటి రిచ్చట నెవ్వనితో నేమి మా…
లాడవలయు నతనిం బిలిచి సంభాషింపుఁ డెట్టిప్రయోజనంబున నెందుఁ బోవుచున్న
వారలో మీర లన్యోపరోధంబునం గార్యవిరోధంబు సైరించి యుండరుగ దాయ…
శంకచేత సంకోచంబు లేక వేగిరించి యీగతిఁ బలుకవలసెఁ గాని భవదీయసన్ని…
ధానసౌభాగ్యంబునం దనిసి కాదు మీరూపచేష్టావచోవిశేషంబు లరయ దివ…
జాతిపక్షులరు గాని ప్రకృతిహంసంబులు గా రనుటయును నంత శుచిముఖి యఖి…
జనమనోహారం బైనమధురస్వరంబున నిట్లనియె. ౭౩

ఉ. ఇచ్చట మేము వేఱ మఱి యెవ్వరితోడను మాటలాడఁగా
వచ్చెద మచ్యుతాత్మజ దివస్పతిపంపునఁ గృష్ణుపాలికి
న్వచ్చి యతండు వీడ్కొలుప వారలయొద్దఱయాజ్ఞలున్ గడున్
హెచ్చరికన్ ధరించి యిపు డేగెదులా గిది యొక్కచోటికిన్. ౭౪

ఉ. ఇప్పుడు నిన్నుఁ జూచి కొలు వించుక చేయ కతిక్రమించి పో
నొప్పదటంచు వచ్చితిమి యోగ్యసమర్హణ మాను టెంతయున్

దప్పు గదయ్యా యాదవవతంస నిసుం గని నీయనుగ్రహం
బొప్పుగఁ గాంచి పోవుట ప్రయోజనసిద్ధికి మూల మారయన్. ౪౫.

క. నీపలికినట్ల యేము సు। రాపగఁ గ్రీడించుదివ్యహంసములము నీ
చూపునకుఁ దప్పు గలదే। యేపట్టున నైనఁ బంకజేక్షణతనయా. ౪౬.

వ. ఏము కాశ్యపులము మమ్ము నింద్రుండును మీతండ్రి యుపేంద్రుండును నిజపరివారం బులోనివారిఁగా విచారించి యీరీతిఁ బనిపంచి నడుపుకొనుచున్నవారు వారి జాతునకు దక్షిణభుజాదండంబునుం బోలె నఖిలకార్యంబులందు నత్యంతధురంధరత్వంబు వహించి యున్నవాఁడవు గావున మావిధంబు నీకు విన్నవించుకొంటి మెల్లపట్టునం దృష్టిఁ బెట్టుకొని యుండునది యేము పోయి వచ్చెద మనినఁ బ్రద్యుమ్నుం డి ట్లనియె. ౪౭.

గీ. మీరు పోయెడికార్య మెవ్వారలకును। జెప్ప రాదేమొ పోనిమ్ము చెప్పు మొకటి
యల్లయతఁ డితఁ డనుకొంటి రాది నెచట। నాప్రసంగంబు రాఁ గారణంబు గలిగె. ౪౮.

క. అదియును జెప్పఁగ వచ్చిన।యది యైన నొకింతవడి ప్రయాణత్వరయున్
గుదియింప వచ్చు నేనిన్। బదరక నిమిషంబు నిలిచి భాషింపఁ దగున్. ౪౯.

చ. అనుడు రహస్య మైనదియె యైనను భవత్పరిపృష్ట మెంతయున్
జనక నిమేషముం దడయ సంగతి గాదును మాకు నైన నీ
వనఁగ జనార్దనుం డనఁగ నారయ భేదము లేదు కావునన్
విను వినిపింతు మాపనియు నీదుప్రసంగము మున్ను కల్మియున్. ౫౦.

వ. అని శుచిముఖి యిట్లు పలుకఁ గొంకి నలువంకలుఁ బాఱఁ జూచుటయు నాచూపు వెంటనె శంబరాంతకుచూపు దీపితైకాంతకాంక్షం బగుచుం బరఁగినఁ బరిజన సమానంబుగా మాననీయులు నాయన యున్నచోటికిఁ గడు నెడ గలుగఁ దొలంగి చని రంత నంతఁ గంతు నభిపీక్షించి యంచచెలువ చెలువంపుఁజెలువు గులుకుకలికి పలుకులకలకలత్వంబు వీనుల కపూర్వపర్వం బగుచుఁ బర్వుచుండ నిట్లనియె. ౫౧.

క. వినవయ్య వజ్రనాభుం। డనియెడునొక దైత్యుఁ జంప యత్నము సతతం
బును నడచుచున్నయది బహు। దినములనుండియును హరికి దేవేంద్రునకున్. ౫౨.

క. తమకంటె మున్ను వాఁడే। తమమీఁదట నేమి కీడు దలఁచునొ యనుచున్
మము వారు వేగు పంపఁగ। నమరాహితుపీటి కిప్పు డరిగెద మనఘా. ౫౩.

వ. అనిన విని యతండు. ౫౪.

క. కటకట మనవా రిది దు। ర్ఘటముగఁ గొని యెంతచింత గావించెద రె
ప్పటి కింక నేను మే మెం।తటిపగయును దీర్ప లేమె తమయాజ్ఞపనన్. ౫౫.

క. అకట తమమహిమ తా రెఱుఁగకయో మతి యేలో తెగరు గాక మరుత్కం
టకుఁ బ్రోచ మదంపసె నన్నొక్కనినె పంపినను దమనియోగముబలిమిన్. ౪౬

వ. అనుడు శుచిముఖి మెచ్చు నచ్చెరువు నిరవుకొన నతనిం జూచి యిట్లనియె. ౪౭

చ. భిదురధరుండుఁ జక్రియును బెట్టుగ దీర్ఘవిచార మింత చే
యుదురేట దైత్యుఁ డెంతబలియుండొ కదా యని క్రోఁచవాఱి కి
ట్లుదుటున వానిఁ ద్రుంతు నను నొక్కనిఁ బంపిన నంటి చాలదే
యిది నెరవైనబంటుతన మిట్టిది నీక తగుం గుమారకా. ౪౮

ఉ. కయ్యపు వేడ్క రేఁచుకొని క్రమ్మెడుతమ్మెదిరించి యేమియున్
డయ్యక కొంతసేపు పెనుధాకను జేతుల కాఁటి నిల్చువాఁ
డెయ్యెడఁ బోటుబంటునకు నెంతయుఁ గౌతుకకారి గాఁడె నీ
వయ్యసురేంద్రుతోడియని కాన యొనర్చుట యుక్త మెన్నఁగన్. ౪౯

గీ. తమకుఁ దామె ప్రల్లదంబునఁ బనిలేని కయ్యమునకుఁ జనరు గాని తగిన
దురము లైనఁ దివురుదురు తమయంతన పిఱికికిఁ గండ లేనిబిరుదుమగలు. ౫౦

వ. అది యట్లుండె నింక నీప్రసంగంబు మున్న వచ్చినతెఱంగును విన్నవించెద వినుము.

ఉ. ఇంతకమున్న వజ్రపురి కేగుచు నుందుదు మేము గావునన్
గాంతతరాంగి నద్దనుజకన్యక నే నొకనాఁడు గంటి శు
ద్ధాంతరసప్రకాండనముదంచితకేళిఁ జరించుచుండి త
త్ప్రాంతలతాగృహంబున వయస్యయుఁ దానును ముచ్చటాడఁగన్. ౫౧

క. తిర్యగ్వనితను నన్ను నమర్త్యాదానందమగ్నమతిఁ జేసె మహా
శ్చర్యముగఁ దత్స్వరూపసౌందర్యం బపు డేమి చెప్ప నలినాక్షునుతా. ౫౨

సీ. నెత్తమ్ము లనుచుఁ గ్రొన్నెల లంచు వటఫలశ్రీలంచు తాబేటిచిప్ప లనుచు
నమ్ములపొదు లంచు ననఁటికంబము లంచుఁ బులిన మంచును సుడిచెలువ మనుచు
వాలిమధ్యమం బంచు హైమకుంభము లంచు నవమృణాళము లంచుఁ జివురు లంచు
మదనుశంఖ మటంచు మణిదర్పణము లంచుఁ బగడ మంచును దిలప్రసవ మనుచు
శఫరు లనుచు సింగిణు లంచుఁ జంద్రఖండ మనుచు శ్రీకారము లటంచు నళు లటంచు
నిట్టివి గదయ్య చెప్పఁబోయిన నుపమలు వీనిఁ దడవ సిగ్గౌదవు నవ్వెలఁది నెంచి. ౫౩

గీ. చామరంబులు వెనుకకుఁ జనుట నీలరత్నములు పూరిఁ గఱచుట భ్రమరతతి మని
తేఁటి బిడ్డ పేరిడుట యాతెఱవకురులకధిక నీలిమ నోడి సూ హరితనూజ. ౫౪

క. అకలుషనీలిమ నాకన్యకకచమున కోడి పాటిపవి యై తేఁటుల్
మకరందార్థము తఱచుగ వికచము లగుపుష్పములకె వెదకుచు నేసున్. ౫౫

గీ. చంద్రభీతఘనధ్వాంతసంచయమున। కభయ మొసఁగి వేణీభరం బను నెపమునఁ
దనవెనుక వేసికొన్నది తరుణిమొగము। చంద్రుఁ గైకొనమి కిదియ సాక్షి గాదె.

క. కాంతతరఫాలసంజ్ఞిత। కంతువిజయలేఖపట్టికావిన్యస్తా
ద్యంతశ్రీకారము లన। నెంతయు నాయింతిబొమలు లింపెసలారున్. ౧౮.

చ. తిలకము సంహితోర్ధ్వముఖతీక్ష్ణశరాగ్రము గాఁగ నాసికాం
చలవిలసత్ప్రసూనసుమసాయకముష్టిగృహీతమధ్యశా
ర్ఙలత యనన్ బొమల్ దనరఁగా నిరుఁగొమ్ముల వ్రేలువెల్లజ
ల్లులగతి నవ్వుడాలు పొదలున్ మదిరాక్షిమెఱుంగుఁజెక్కులన్. ౧౯.

ఉ. అంబురుహాక్షినాసిక నిజాన్వయశత్రువుఁ జంపకప్రసూ
నంబుఁ గరంబు గెల్చుట మనంబునఁ బెట్టి తదీయపార్శ్వయు
గ్మంబున నిత్యసేవకతఁ గ్రాలెడునీక్షణతారకాఖ్యరో
లంబకదంపతుల్ పెనుపళావళి నెంతయు సంభ్రమించుచున్. ౨౦.

ఉ. బింబఫలోష్ఠికన్ను లను బేడిసమీలిరుదిక్కులన్ సమా
నంబుగఁ బర్వుచున్నశ్రుతినామసరోయుగశోభ లిట్టు ల
ట్టుఁ బిరువీకు సేయఁగఁ గదున్ దమి యెందుకుఁ గాక రెంటిమ
ధ్యంబునఁ బాఱెడిం బరువు లారయఁ జాపల మట్టిదే కదా. ౨౧.

గీ. కలయనాపాదమస్తకాంగములయందు। మించి పటలీలఁ దరళతోఁ దంచిత మగు
యువతిలావణ్యమును గన్నుఁగవయునతను। దంటమీలఁ బెక్కియమునఁ దనరుఁజూడ.

ఉ. ఎప్పుడు భక్తిభావమున నింపలరన్ ద్విజరాజుపాదముల్
దప్పక సేవ చేయుసుకృతంబునఁ గాంచె జకోరయుగ్మ మీ
యొప్పున నొప్పఁ గన్ను లవి యోలిని గ్రోలినతేటవెన్నెలల్
చిప్పిలినట్లు మించు నతిలేనగవున్ ధళిని గ్గుఁజూపులన్. ౨౩.

ఉ. సౌవరమాధురీస్పృహ ఘనం బిక మో శుకమో తదీయజి
హ్వావిలసత్స్వరస్ఫూర్తి నుపాసన చేయుచు నగ్రభూమి నిం
పావహిలంగ నేర్చి యుపహారముగా నిడిపట్టిపల్లవం
బో విమలంపుబింబఫలమో యన వాతెఱ యొప్పు నింతికిన్. ౨౪.

క. మగువయధరంబు పగడముఁ। జిగురును బింబమును బంధుజీవకమును గ
ట్టిగ గెల్చి కన్నసత్కీ। ర్తిగతి న్వాసాగ్రమణిమరీచి వెలుంగున్. ౨౫.

గీ. మృదులపవనాహతి నొకింత గదలి యాడు
పల్లవమువాటునను దోఁచుమొల్లమొగ్గ

చాలుగతిఁ బల్కు బడి మోవిచాటునఁ గనఁ
బడుచు నింతిపల్వరుస కన్పాంతి వఱుచు. ౭౬.

క. చెలువపలు కమృతరసములు। గులుకుట పీనులకె కాదు కోమలదంతా
వళిరుచియును శీకరపుం। దెలినిగ్గునఁ గన్నులకును దెల్లము చూడన్. ౭౭.

గీ. కనకకర్ణికాధారాళికాంతు లదికి। బాహులతికలు బిరుదునంపంగిదండ
లిరుఁగడల వ్రేల వైచినకరణిఁ బరఁగఁ। గంబువిజయము పచరించుఁ గాంతగళము.

క. ఖరకరకరభిన్నము లై। కర మెలమి వహించునరుణకమలంబులతోఁ
బురుడింపఁ దగునె గొజ్జఁగ। విరిరేకులబంతిగములు వెలఁదికరంబుల్. ౭౯.

గీ. జిలుఁగుఁబయ్యెద యనువలలోన నా చెల్వ। గుబ్బచనుఁగవ యనుకోకయుగళి
యొగయఁ బెనఁగురీతి నెసఁగుఁ గ్రేవలఁ జల। త్పత్రులీల మెఱుఁగుఁదరఁగ లదర.

గీ. చారుతరనాభి యనెడుగంభీరసరసిఁ। గడఁగి క్రీడించుమరునిశృంగారరసపుఁ
జిమ్మనపుఁగ్రోవిధారనాఁ జెన్ను మీఱుఁ। బడఁతినూగారు కన్నులపండు వగుచు.

చ. తనుతరరోమవల్లరికిఁ దా నిరువంకలఁ గల్గు లేదు నా
ననయము సూక్ష్మసూక్ష్మముగ సజ్జలజాననకౌను మించి లో
చనముల కింపొనర్పఁ గడునన్నపుఁగారు మెఱుంగుదీఁగె చ
క్కనినిడుబీటవాటి కనఁగాఁబడున ట్లతియత్నదృశ్యమై. ౮౨.

క. చనుఁగవబ్రేఁగున గిటగిట। మను నెన్నడు మేమి యగునొ యనియొడిశంకన్
గనకపుఁగట్టిడినాఁడో। వనజాసనుఁ డనఁగ వనితవళు లింపెసఁగున్. ౮౩.

గీ. నెన్నడిమిపేరిమింట నన్నెలఁతబొడ్డు। పొన్నవిరి నిక్కముగఁ జూచి చిన్నఁబోదు.
రద్భకుసుమసౌరభసాధనార్థహేతు। వాశ్రయాసిద్ధ మనియొడియయ్యె లెల్ల. ౮౪.

చ. సుకవులు క్రిందుమీఁదరసి చూడక యీ డని యాడుకొన్న హా
టకకదళీవిలాస మకటా విపరీతము గాక సాటియే
యకలుషరామణీయకసమంచితకోమలతద్వధూరుల
క్ష్మికి సరిగావ యొంత తలక్రిం దయినన్ గరిరాజహస్తముల్. ౮౫.

గీ. రమణిజంఘలు శాలిగర్భములు హీర। దీప్తిజలపూర్తి నొప్పునందియలు మళ్ళ
వానిలోపలఁ జలువకై వచ్చియున్న। కచ్ఛపంబులఁ బోలి మీఁగాళ్ళు దనరు.

క. కెందామరలుఁ జిగుళ్ళును। సౌందర్యశ్రీలఁ దమకు సరి గా వని యా
యిందుముఖిపాదములు నగుఁ। గందళదుజ్జ్వలనఖాంశుకైతవయుక్తిన్. ౮౭.

శా. శృంగగ్రాహికఁ జెప్ప వేఱె తెరవుల్ సిద్ధింపమింజేసి చి
త్రాంగశ్రీనిధి నవ్వధూమణిని స్థూలారుంధతిన్యాయమా

ర్గాంగీకారమునన్ వచించితిని జంద్రాద్యుపమ ల్వాచనా
భంగుల్గాని యధస్సహస్రగుణసౌభాగ్యంబు లాయంగముల్. ౧౮

ఉ. వెన్నెలతేటనిగ్గు నరవిందపుఱేకుమృదుత్వముం బదా
ర్వన్నియజాళువాపసిఁడిరంగు మెఱుంగులధాళధళ్యముల్
గన్నియరూపుగాఁ గరువు గట్టి మనోజుఁడు పోఁతఁ బోయఁ బో
లున్నెఱనేర్పుతో ననుట లోకులపల్కిది చాల దేమియున్. ౧౯

ఉ. ఏమ్మెయిఁ బ్రజ్ఞ మీఱ వచియించెద నన్న వచింప లేన య
క్కొమ్మబెడంగులోన నొకకోటితమాంశము నైన నంతమా
త్రమ్ము మదుక్తిశక్తి యన రా దతివాఙ్మహిమాఢ్య నేను మా
యమ్మ సరస్వతీసతి తనంతటిదానిఁగ నన్ను దిద్దుటన్. ౨౦

వ. అని తాను బ్రహ్మదేవుని రథవాహనం బైనసారంధరుం డనుహంసవంశావతంసుఁడౌ
రగుటయుఁ దదీయసంబంధవశంబున నంబుజాసనురాణివాసంబునందు వాణి
పెంపఁ బెరుఁగుటయుఁ దదనుగ్రహంబునం దనకు నఖిలవిద్యలుం గరతలామలకం
బగుటయుం జెప్పి మన్ముఖంబు శబ్దసంస్కారపూతం బనుబుద్ధి నద్దేవియ నాకు శుచి
ముఖి యనుపేరిడియె నని యిట్లనియె. ౨౧

చ. నలినజరాణివాస మొకనాఁడు ననుం దనచేతిప్రోదిరా
చిలుకను వాదుకుం గవిత చెప్పఁగఁ దా నియమించి యందు నా
పలుకులఁ గొంతవాసి గని భావమునం గడు మెచ్చుచు న్నఖాం
చలమున నాదుఱెక్క నులి చక్కఁగ దువ్వుచు గారవించుచున్. ౨౨

చ. ప్రబలము లైనకౌతుకకృపారసవత్సలతాదరంబులన్
శబలితచిత్త యై యపుడు నా కుపమాతిశయోక్తికామధే
నుబిరుద మిచ్చి తల్లిఖితనూపురము న్భువనైకమాత య
య్యబల మదంఘ్రిఁ దాఁ దొడిగె నాబిరుదం బిది చూడు మేర్పడన్. ౨౩

క. అని నిజనూపురగతవర్ణనికాయముఁ ద్రిప్పి చూపి నారాయణనం
దన యిట్టినాదుపలుకులకు నగమ్యము దనుజకన్యకోమ రూహింపన్. ౨౪

వ. ఆజగన్మోహనాంగిం జిత్రఫలకంబున వ్రాసి యైనం జూపెద నంటేని. ౨౫

క. ఏయంగకమును భావనఁ జేయక వ్రాయంగ రాదు చేసిన నానం
దాయత్తత మది చొక్కఁ బరాయత్తపుబుద్ధిఁ జెలువ నలవియె వ్రాయన్. ౨౬

వ. అదియునుం గాక. ౨౭

క. ఆ తరుణీమణిరూపముఁ। జిత్తరువున వ్రాయ నేర్పు చేకుఱ నేనిన్
దత్తుల్యవనిత నెందే। నత్తొలువేలుపు సృజింపఁ డా తనసృష్టిన్. ౯౮.

గీ. అజుఁడె యొకప్రసంగమై చెప్ప వింటి న।క్కాంత యతనిసృష్టి గా కునికియు
నాదిశక్తి శివుమహాదేవి తనదైన।చిత్రమహిమచే సృజించుటయును. ౯౯.

క. విను మిపు డది సంస్కృతిపద।విని జెందెను మాటమాటవెంబడి నెందే
ననుభవభవసంస్కారం।బున కుద్బోధము ప్రసంగమున నగును గదా. ౧౦౦.

మ. దనుజేంద్రాంగన కంబికావరమహత్త్వస్ఫూర్తి నాలోకమో
హన జన్మించుట వింటి వెండియుఁ దదంగాలౌకికశ్రీప్రవ
ర్తన మూహించిన నట్లు రెంటికిఁ గడున్ దార్కాణ మయ్యెన్ మనం
బున కిట్లిప్పుడు సంస్కృతం బయినయంభోజాతజాతోక్తియున్. ౧౦౧.

క. వినుము ప్రభావతి యన న।వ్వనితామణినామ మర్థవంత మ్మగుచున్
దనరారుచుండు ననయం।బును యదుకులకలశజలధిపూర్ణశశాంకా. ౧౦౨.

గీ. ఆప్రభావతి తనకల నగజ వచ్చి। వ్రాసి దయ నిచ్చె నని యొక్కరమ్యపురుషుఁ
జిత్రఫలకాభిలిఖితు నెచ్చెలియుఁ దానుఁ।గరము వేడుకఁ జూడ నేఁ గంటి ననఘ.

క. ఆకన్నప్రతిమసుద్దులు। మాకు మునుపు కలిమిఁ జేసి మహనీయతదీ
యాకృతిపొలుపంతయు భవ।దాకృతిఁ గని యతఁ డితండ యనుకొంటి మొగిన్.

వ. అని పలికి మాకు నిక్కడ మిక్కిలిం దడయుట యనుచితంబు గాదు పోయి వచ్చెద మనుచు నవధరించితే యనుచుఁ దోడియంచలుం దాను నప్పులుఁగుచెలువ యుప్పరవీథి కెగసె నప్పు డప్పురాళంబు లరాళంబులు గాక యాకాశభాగంబున గమనవేగంబునం దీఁగ సాఁగినబాగు మెఱయు నిజగరుత్కనకరేఖామయూఖంబు లాఖండలారిదిక్కునకు నక్కజంపుటెలమిం గొనలు వాఱి యుద్దీపించు ప్రద్యుమ్నప్రతాపవైభవంబునుం బోలెఁ జాల నాలోకనీయంబు లగుచుండఁ దత్పరస్పరతదీయకీర్తిమూర్తివిశేషంబులో యన సోయగంబున మీఱి గగన మంతయుం గబళించుటకు నొక్కకడకు నొత్తుకొని పోవ బారలు చాఁచినచందంబున నిస్పందప్రసారితంబు లైనతనూరుహంబులతోడం జూడ నొప్పారుచు నప్పటప్పటికి నవిరళధవళిమస్పర్థ నుభయపార్శ్వభాగపాండురబలాహకంబుల నహంకృతి పెక్కువ నొక్కపెట్ట కలహించుటకుం బిలుచుభంగి సంఘటిల్ల నుల్లసిల్లుపక్షయుగళవిక్షేపవ్యాపారంబులచేత నుద్యోగించుచు నొక్కొక్కయెడఁ బ్రడీనోడ్డీనసండీనయానభేదవినోదంబు లాచరించి రోదోంతరం బంతయు నెంతయుం గలయ మలయుతమయమలంపుఁ దెలిదళకుఁ జిలికి యది మలయజంబుఁ గలయంపిచెలువు నలవరింప నందుఁ గుందనంపు

రంగవల్లికామతల్లికలయుల్లాసంబు వెల్లి గొలుపుగురుదంతకాంతివల్లరులచేత నతి
శయిల్లుచు నొక్కొక్కచోట నొండొంటినందున సందర్శనీయంబు లగునభోవిభా
గంబులవలన నస్థానభానుసంభవానంభేదసంభృతసబలతావిలాసభాసురసురాపగా
ప్రవాహసందేహకందళనంబులకు ననుగుణం బయినపరపున నిడుపాఁజాలు గట్టి
యిట్టట్టు చెదరక చదల నడచుచు వజ్రపురంబు చేరి తొంటియట్ల సకల
జలాశయంబుల విహరించు చుండె నందు శుచిముఖి కన్యాంతఃపురసరోవిహార
సమయంబుల. ౧౦౫.

సీ. జలఖేలదంగనాకలకలంబులకు మిక్కిలి దవ్వు వాఱక నిలిచి నిలిచి
పడఁతు లొక్కరొకళ్ళపైఁ జల్లుజలబిందు లొడలు సోఁకినఁ బోక యోర్చి యోర్చి
యోలలాటలతమిఁ నొండొరుఁ దఱుము చెల్వలధాక కులుకక మెలఁగి మెలఁగి
లీలావతీహస్తలీలాబ్జకేసరంబులకును బసి గొంచు మలసి మలసి.
క్రమముతోడ దనుజకన్యకాంతఃపుర। కాంతలకును బెదర కింత నంతఁ
జేరికలఁ జరించు టూహాఢిఁగా నల। వాటు చేసికొనియెఁ బాటవమున. ౧౦౬.

శా. ప్రద్యుమ్నుండు ప్రభావతీరుచిరరూపబ్రహ్మముఁ హంసయో
షిద్వాక్యార్థధురీణవాగుపనిషత్సిద్ధాంతమార్గానుసా
రోద్యత్ప్రజ్ఞను బల్మిఁ మననసంయుక్తంబు గావించుచుఁ
హృద్యంబై యది యంతకంత కలరఁ నిల్పెం గడుం జిత్తముఁ. ౧౦౭.

సీ. కనఁ డొద్దనున్నవారిని వీరు వారని కనినఁ దదర్హవర్తనలు మఱచు
వినఁడు చెప్పినపల్కె వేమఱుఁ జెప్పక వినిన నే మే మంటి రనుచు నడుగుఁ
జనఁ డెత్తు లిడక మజ్జనముఖ్యవిధులకుఁ జనినఁ దబ్బిబ్బుగాఁ జలుపుఁ గ్రియలు
కొనఁడు నానాసేవకులసేవ లెవ్వియుఁ గొనిన వీడ్పాటుగాఁ బనులు పనుచు
శుచిముఖీవాక్యదర్పణస్ఫురితనిరుప। మానదనుజేంద్రకన్యకామణిమనోజ్ఞ
రూపరేఖావిలాససంరూఢమైన। యాత్మ మరలింప నేరక హరిసుతుండు. ౧౦౮.

ఉ. ఉద్యదపేక్ష పక్షివనితోక్తులవెంబడిఁ జంచరీకచం
ద్రాద్యుపమానశోభకు సహస్రగుణంబుగ హెచ్చుఁ గేశవ
క్షాత్రిద్యఖిలాంగలక్ష్మి మది కందినయంతయు నంతయుఁ నయించి యా
హృద్యతరాంగిమూర్తిసాబ గెల్ల నొకింతగఁ జూచు నాత్మలోఁ. ౧౦౯.

చ. మది గొనినంతమేరయును మాన కతం డుపమానకోటియొ
ప్పిద మఖిలంబు నిట్లు గడుఁ జెక్కుమడుంగులుగాఁ దలంచి త

త్తవయవశ్యనుస్థితికిఁ దార్పఁగ నమ్మదిరాక్షిరూప మె
య్యది యదియే కనంబడియె నచ్చపుబుద్ధికి లే వగమ్యముల్. ౧౧౦.

సీ. ఆరూపు మదిఁ జాల హత్తించు హత్తించి యతివ యిట్టిది గాక యనుచు మెచ్చు
మెచ్చి కన్గొనుకోర్కి హెచ్చించు హెచ్చించి యంతమే లె ట్లబ్బు ననుచు వగచు
వగచి నిట్టూర్పులు నిగిడించు నిగిడించి తదవలోకము లేనిబ్రదుకు రోయు
రోసి దాని కుపాయ మాసించు నాసించి కలఁక నేమియు దొరకమికిఁ గుందుఁ
గుంది తలపోఁతలకు మదిఁ గొల్లవిడుచు| విడిచి దరిదాపు లేమిఁ బెన్వెతల మునుఁగు
మునిఁగి యెవ్వరు పిలిచినఁ గినియు మిగుల| హరినుతుండు ప్రభావతీవిరహవశత.

శా. ధీమంతుండు పటుప్రతాపనయమైత్రీనిత్యనమ్రీభవ
త్సామంతుండు సుకీర్తిమూర్తికమణిస్రగ్భూషితాశావధూ
సీమంతుండు విపక్షమంత్రిముఖరాజీవప్రభోచ్చాటనా
హేమంతుండు నిజస్తవానుకలనాహీంమంతుఁ డత్యంతమున్. ౧౧౨.

క. అబ్జాంబావరుఁ డఖిలక|కుబ్జాంధవరమ్యకీర్తికుఁడు నలినీప
త్త్రాబ్జిందునమప్రకృతి| క్షుబ్ధోధమయాత్మతత్త్వకోవిదుఁడు మహిన్. ౧౧౩.

తరల. కుముదబంధునిభుండు పింగళిగోకమంత్రి యశఃకథా
సమదనల్పనభుండు వైదికశాస్త్రసింధునిరంతర
ప్రమథనాత్తశుభుండు సంతతభక్తియుక్తి సమర్చిత
ప్రమథలోకవిభుండు విత్తనిరంకుశప్రతిభుం డిలన్. ౧౧౪.

గద్యము. ఇది నిఖిలసూరిలోకాంగీకారతరంగితకవిత్వవైభవ పింగళి
యమరనార్యతనూభవ సౌజన్యజేయ సూరయనామధేయ ప్రణీతం
బైనప్రభావతీప్రద్యుమ్నం బనుమహాప్రబంధంబునందు
ద్వితీయాశ్వాసము.

# తృతీయాశ్వాసము.



క. శ్రీమద్భక్తివిశేష। స్థేమా విశ్రాంతవిహితశివతత్త్వకథా
మీమాంసుఁడు పింగళియమ।రామాత్యవతంసుఁ డపరహంసుఁడు దీప్తిన్. ౧

వ. హరికుమారుం డొక్కనాఁ డేకాంతవర్తియు హస్తవిన్యస్తగండస్థలుండు నగుచు
ని ట్లని తలపోయుం దొడంగె. ౨

చ. కలుగు నొకో కనుంగవకుఁ గాంతఁ గనుంగొనుభాగ్య మెక్కడన్
గలిగెడుఁ దత్పురంబు చొరఁ గల్గియు దొడ్డఁట చొచ్చి చూడఁగాఁ
గలిగిన నవ్విలాసవతిఁ గౌఁగిటఁ జేర్పక యోర్చు టెట్లు నా
తలఁపుబడిం దదాత్మయును దార్కొన కెట్లది సంఘటిల్లెడున్. ౩

చ. శుచిముఖిమాట యొం డరసి చూడఁగ నెంతయు నానపాటొన
ర్చుచు మదిఁ ద్రిప్పుచున్నయది చూడ్కికి నన్నె పోలువాని నా
రుచిరతరాంగి చిత్తగువురూపాకటిన్ రహిఁ జూడఁ జెప్పెఁ ద
ద్వచనముచొప్పు నేమినియతంబు నమాకృతు లెందుఁ గల్గవే. ౪

చ. ఇది పదిలంబుగా నడుగ కేనపు డక్కట కోర్కి దాఁచి వ
ట్టిదొరతనంపునీటు ప్రకటించితిఁ బాపపులజ్జ నన్ను నొ
రదిమె ననాదరంబు తెలిఁ గై యది హంసికిఁ దోఁచెనేమొ ని
ల్వద మతి యించుకైన గరువల్చవి గానికథ ల్వచింతురే. ౫

ఉ. ఏ నొకయించుకంత మన సిచ్చినమాటలు పల్కకుండఁగాఁ
గాని మరాళి యద్దనుజకన్యక కై నను నొత్తి చూచి యే
మైన ననంగఁ బూను నని యాత్మకుఁ దోఁచుచు నున్న దిప్పు కా
చేని ప్రసంగముం దిగిచి యేల నుతించుఁ దదీయరూపమున్. ౬

మ. అటు గాకద్భుతరామణీయకగుణాఢ్యం బైనసద్వస్తువున్
బటువాచారసికు ల్ప్రసంగ మయినన్ బారంబు ముట్టన్ రసో
త్కటతం జెప్పక మానఁ జాల రసపక్షం బొందు భావించినన్
ఘటియిల్లు న్వనితాంగవర్ణనకు నిక్కం బన్యథాసిద్ధియున్. ౭

చ. హరియును వాసవుండుఁ దమ నంపినకార్యము హంసి తాన యై
ధరణికి డిగ్గి చెప్పి మరుదగ్రమనస్స్థితిఁ గాంచు టెన్న నా

సురరిపుఁ జంప నన్ననుపుసుద్దులు పుట్టఁగఁ బోలు నెల్లెడన్
సరసిజనేత్రుదక్షిణభుజంబవు నీ వని పల్కినందునన్. ౮.

ఉ. అన్నియు నేకవాక్యముగ నారయ నానలు పెంచుపక్షమే
యున్నది కొంత మించి యిది యోజన సేయఁగ నాదురాపె యా
కన్నియచేతిచిత్రఫలకంబున నున్నది యెవ్వ రట్టిచో
నన్ను నెఱింగి వ్రాయ ననినన్ శివ వ్రాయుట వింటిఁ జొప్పడన్. ౯.

సీ. శివ నన్నె వ్రాసి యిచ్చినపక్షమునను లేఖననిమిత్తము వేఱ కలుగు నొక్కొ
కలుగ దంతఃపురకన్య కిట్టిది భర్తృపరతఁ దక్క ఘటిల్లు టరుదు గాన
నది యట్ల యైనను దదభీష్టయువపరీక్షామాత్రఫలకమై జాఱు నొక్కొ
జాఱ దీశ్వరి యిచ్చె నతిక్రూప నని బాల వేడ్కఁ జూచుటఁ జెప్ప వింటిఁ గాన
నిట్టిగతిఁ జెల్వ యుమ వెడ్డుపెట్టు నొక్కొ
పెట్ట దది దా సృజించినబిడ్డ గాన
బొంకగుచు నంత కిదియ త్రోపువడు నొక్కొ
పడ దజుఁడు చెప్పె నని వినఁబడియెఁ గాన. ౧౦.

చ. మును తనసృష్టి కామి నలుమోములవేలుపు చెప్ప వింటి నే
ననుచు మరాళి పల్కె నపు డక్కట యే నడుగంగ లేన యే
మని నను దిట్టుకొందు నజుఁ డట్టిప్రసంగపువేళ నవ్వరా
ననకు విభుం డితం డతఁ డనన్ వినఁబడ్డది యేమి గల్గెనో. ౧౧.

ఉ. వావిరి నవ్విలాసవతివార్తలపట్టున నెన్ని యెన్ని ప్ర
శ్నావసరంబు లైన నొకయర్థము నే నడుగంగ లేమి ని
చ్చావిముఖుం డితం డని ప్రసంగము వచ్చిన నూరకుండు నే
మో వరటాలలామ యిఁక ముద్దియసన్నిధి నేమి సేయుదున్. ౧౨.

ఉ. పోవు నొకో సరోజముఖిపొంతకు నిం కొకమాటు హంసి దా
నావలనం దదిష్టవచనం బొకటేన్ గొనిపోవఁ గానమిన్
బోవుట నిష్ఫలం బనుచుఁ బోక యె మానునొ కాక పోవునో
దైవతకార్యభారమును దద్వశమైనది కొంత గల్గినన్. ౧౩.

క. తరుణికడ కంచ యేగతి। నరిగిన నాన గల దది మహామతి నాయం
తరగతిఁ గనదే వినదే। ధర నప్రతిషిద్ధ మనుమతం భవతి యనన్. ౧౪.

క. ఏపనియు లేక యుండిన। నాపడఁతుకఁ జూడఁ జనక హంసి నిలువ నె
ట్లోపెడును దానిఁ జూచినఁ। జూపులకును వశమె తిరుగఁ జూడక యుండన్. ౧౫.

క. అని భావనాబలంబున। మనమున ఘటిల్లి మగువమధురాకృతి య
క్కునఁ జేర్పఁ గడఁగి తత్తఱ।మునఁ గానక వెగడు పడుచుఁ బొదలు విరాళిన్.

వ. ప్రొద్దు గడపుట తద్దయు భరం బగుడు నుద్యానంబునకుం జనియె నప్పుడు. ౧౯

సీ. నిబిడంపుజిగితోడ నిండుపూఁగుత్తులు బిగువుపాలిండ్లయొప్పిదము నెరప
నునుఁగెంపు గ్రక్కు నూతనపల్లవంబులు కరతలంబులసోయగంబుఁ దెలుప
నెలమిఁ బర్వెడునట్టియెలదీఁగియలసొంపు సుకుమారబాహువిస్ఫురణ జరపఁ
గడుఁ బేరెములువాఱుగండుఁదుమ్మెదచాలు కడకంటిచూపులబెడఁగు నడప
విమలతెలిడాలు చిఱునవ్వువిసరులఁ జిలుక। మధురసపునిగ్గు లావణ్యమహిమ గులుక
వతనిచూడ్కికిఁ జూడ నుద్యానభాగ।మంతయుఁ బ్రభావతీమయం బగుచుఁ దోఁచె.

గీ. యువతిపై విరాళి యొక్కింత మఱతునో।యనుచు నాన నేగి యచట నతఁడు
మఱచెఁ దదితరంబు నెఱయంగ నిది సుమీ। యొకటి కోర వేఱొకటి యగుట.

వ. అతం డివ్విధంబునం బ్రభావతీవిభ్రమభ్రమవశంబున లతలతఁ దప్పకుండఁ గదియం
జనుచు. ౨౦.

సీ. తరుణికెంగేలంచుఁ దమిఁ బట్టి కటకటా చిగురాకె యిది యంచుఁ జిన్నవోయి
వెలఁదిపాలిండ్లంచు వెస నంటి చెల్లఁబో పూఁగుత్తులే యంచుఁ బొలుపు దఱిగి
చెలువపయ్యెద యంచుఁ జేసాఁచి యయ్యో పరాగోదయమె యంచు రహి దొఱంగి
రమణివేనలి యంచు రతికాంతుఁ డొడిసి హా తేఁటిమొత్తమె యంచుఁ దెల్లఁబాఱి

యకట యనిమిత్తకృపఁ దాన యరుగుదెంచి
హితవు నెరపెడిహంసితో హృదయ మిచ్చి
పలుకనికృతఘ్నునకు నాకుఁ బ్రాప్త మగునె
యట్టియువతిపొం దనుచుఁ దా నార్తుఁ డగుచు. ౨౧.

వ. అంత నంతర్గతంబున. ౨౨.

గీ. ఉవిద నాకుఁ బ్రాపించు టటుండ నిమ్ము। హంసి యిఁక నొకమఱి చూడ నబ్బునేని
నాదుకన్నులు కన్ను లెన్నంగ నేన। యగ్రగణ్యుండ ధన్యాత్ములందు నెల్ల. ౨౩.

గీ. వచ్చునో కో సురారివార్త చెప్పఁగఁ దాను। వచ్చి కడలఁ బోక యిచ్చటికిని
దెచ్చునో కో ప్రభావతీక్షేమవృత్తాంత।మాత్ర మయిన నంచమగువ నాకు. ౨౪.

చ. వినుకలిచేత నే విరహవేదన నామది నింత వర్ధిలెన్
గనుకలి నిట్లు చిత్రఫలకంబునఁ గాంచినయింతి నెమ్మనం
బునఁ గడు నింత కెంత పరిపూర్తి వహించునొ యెంత నొచ్చునో
ఘన మని వింటిఁ జిత్తరువుఁ గన్గొనుప్రేమయు నేమి సేయుదున్. ౨౫.

గీ. అందుమీఁద హంసి యరిగి నాతోడఁ దా। మాట లాడుటయును మద్విధంబుఁ
దెలుప నాన లేమి దలపోసి యెట్లొనో। చెలువ యకట యేమి సేయువాఁడ. ౨౬.

మత్తకోకిల. అంచతొయ్యలి దేవతాపతియానచొప్పానరించి యే
తెంచు టెన్నఁడు దానిచేత మదీయహృద్గతిఁ జెప్పి యేఁ
బంచు టెన్నఁడు గావున న్వేసఁ బత్రికన్ లిఖియించి యా
యంచ కిప్పుడు పంచెద న్సతి కంత దెల్పెడు నట్లుగాన్. ౨౭.

వ. అని తలంచి యాక్షణంబ శుచిముఖిపేర లేఖ వ్రాసి యిది గొంపోవువా రెవ్వ రని
నివ్వటిల్లెడుచింత నంతరంగంబు గలంగ నుద్యానమధ్యంబునకుం గ్రమ్మఱ నరుగుదెంచి
యత్తఱి నుత్తరంబు చనువాని నెల్ల నుద్దేశించి తద్దయు దుర్దమం బైనవిరహార్తికతన
వార్తాహరణయోగ్యాయోగ్యవివేకంబు లేక యి ట్లనియె. ౨౮.

సీ. కృప నెఱిఁగింపరే కీరోత్తములార వజ్రపురికిఁ బోవువారె మీరు
సదనుగ్రహమునఁ దుమ్మెదలార చెప్పరే వజ్రపురికిఁ బోవువారె మీరు
కరుణతో వినిపింపఁ గదరె కోయిలలార వజ్రపురికిఁ బోవువారె మీరు
తెలుపరే దయఁ జూచి మలయవాయువులార వజ్రపురికిఁ బోవువారె మీరు
చలువ లొసఁగెడు మేఘరాజంబులార। యమలపక్షత నొప్పు రాయంచలార
నిలిచి నామాటలకు మాఱు పలుకరయ్య। వజ్రపురికిని బోయెడువారె మీరు. ౨౯.

క. అని పలుకుచున్నసమయంబున నొకశుక మభ్రమార్గమున నేగుచు నా
తనిదీనాలాపంబులు। విని కారుణ్యమున నిలిచి విస్ఫుటఫణితిన్. ౩౦.

గీ. ఏను వజ్రపురికి నేగెడుదాన నా। వలనఁ గార్య మేమి కలదు నీకుఁ
దెలుపు మొకటిరెండుపలుకుల ముగియఁగా। ననుచుఁ బలుకుటయును యాదవుండు.

సీ. ఓపక్షివర విను మాపురి శుచిముఖి యనుపేరియొక రాజహంసి యుండు
నది యున్నచోటు నీ వరసి యీపత్రిక యందింపవలయు మత్ప్రార్థనమున
నన విని యాచిల్క యట్ల చేసెద సహాయంబు పోయెద మాట లాడ నాకు
లే దవకాశంబు లేశమాత్రంబును నాదుపక్షంబులనడుమ లేఖ
యొరుల కెఱుకపడక యుండునట్లుగఁ గట్టు। మతిరయంబుతోడ ననుచు నతని
దండ కరిగి నిలిచెఁ దడయ కాతఁడు నట్లు। చేసె నదియుఁ జనియె శీఘ్రగతిని.

వ. అంతకు మున్న శుచిముఖియును నుచితప్రకారంబున నట్లు తనబలఁగంబునుం దా
నును దానవాంతఃపురకామినీసమీపసంచారపరిచయంబు సంపాదించుకొనుచుఁ
గ్రమంబునం బ్రభావతితోడి చెలిమి గలిగించుకొనుటకుం దఱి వేచి యుండుఁ
గావున నది గనిపెట్టుకొని యుండ నొక్కనాఁ డక్కలకంఠి తొంటినరసిపరిసర

బునం దమందకందర్పతాపశమనార్థంబుగ రాగవల్లరి యను నెచ్చెలియుం దానును
వచ్చి వనవిహారంబు సలిపె నప్పుడు. ౩౩.

సీ. అతివమందస్మితద్యుతిప్రసాదంబున విరులపాండిమ యభివృద్ధి గాంచె
నతికటాక్షశ్రీలసాహాయ్యకమునఁ దుమ్మెదపిండుచెలువ మభ్యుదయ మొందె
జలజాక్షికరతలచ్ఛవియనుగ్రహమునఁ జివురుఁగెంజాయ పుష్టిని వహించెఁ
దరుణినిశ్వాసగంధము ప్రోది మలయవాయువుల సత్త్వవైభవము చెందె
నవి లతాంగికిఁ దోడ్తోన యార్తిఁ బెనఁచెఁ। బాటిలదె రజోమాలిన్యపల్లవత్వ
చాపలంబుల కాధార మై పరఁగెడు। వారికిని మే లొనర్చినవారి కెగ్గు. ౩౪.

సీ. విరహిరక్తముతోడిమరువిబల్లెము లన నెల్లెడ విలసిల్లుపల్లవములుఁ
బాంథమేదస్స్నాహభరితకామాస్త్రాళి నా నొప్పునరసప్రసూనములును
భావజాముడివింటఁ బాఱునీలపుగుండ్లభంగిఁ జరించుపుష్పంధయములుఁ
జేతోజబలసముద్ధూతధూళి యనంగ రాజిల్లుసుమనఃపరాగములును
వసమసాయకజయబిరుదావళీని। పాఠవరవందిజనఘనార్భటి యనంగఁ
గడు విజృంభించుశుకపికకలకలములు। నెలఁతకును గుండెదిగులు జనింపఁ జేసె.

వ. ఇవ్విధంబున నయ్యింతి తంతన్యమానకంతుసంతాప యగుచు రాగవల్లరిం జూచి
యి ట్లనియె. ౩౬.

మ. అకటా యిట్టిది ప్రొద్దు పుచ్చుట కుపాయం బే విరోధంబ కా
క కడుం జాలు వనాంతఖేలన మిఁకం గన్నార మత్ప్రాణనా
యకురూపంబును జూచు చుండుటయె మే లామీఁద భావ్యర్థ మం
బిక యొక్కర్తె యెఱుంగుఁ దత్ఫలకమున్ బింబోష్ఠి తెవే వెసన్. ౩౭.

వ. అని తెప్పించి యప్పలకయందు నాత్మసంకల్పవాసనావిశేషవశంబున ననేకవిధ
శృంగారభావచేష్టావిశిష్టతం గనుపట్టునట్టిలిఖితరూపయదుకులప్రదీపు నెదుట నుం
డియుం గ్రేడించియు నిర్నిమేష యయ్యు నిమీలితాక్ష యయ్యుం గొంతతడ వనేక
భావంబు లావహిల్లం జూచి చూచి. ౩౮.

చ. అనయముఁ దృప్తి గావలయు నంచు నజస్రము నెంత చూచినన్
గనుఁగవ కంతకంతకును గాటముగా నొకవింతవింతయిం
పు నెరపు చున్న నుం దరలి పోవఁగ నీ దిఁక నోర్వఁ జాల నే
ననుచు రసోద్ధతిం గదియ నక్కునఁ జేర్చి నిజేశురూపమున్. ౩౯.

గీ. చేర్చి యొకింతతడవు నిశ్చేష్ట యగుచుఁ
జొక్కి కనుఁగవ యరమోడ్చి శోభనాంగి

యంతఁ జిత్రరూపత మదియందుఁ దోఁపఁ
గ్రమ్మఱఁగఁ బుచ్చి కనుఁగొంచుఁ గాంక్ష లడర. ౪౦.

ఉ. ఇట్టిమనోహరాంగుఁ డొకఁ డెం దయినం గలఁడేని గల్గియుం
గట్టిగ నా కతండు బిగికౌఁగిటఁ జేర్పఁగ నబ్బునేని నే
నిట్టటు గొంచిన న్వెదక యిష్టవిహారము లెల్లఁ గాంక్షఁ జే
పట్టి యొనర్పునేని రసభావము లెట్టివి యొక్కొ యత్తఱిన్. ౪౧.

క. అని యువ్విళ్ళూరుచు మది। ననయముఁ దలపోయు నుస్సు రనుఁ గాంతాళం
బునఁ బొరలు నిట్లు విరహం। బున కోర్వక యవ్వధూటి బోటిం బలికెన్. ౪౨.

క. ఉమసేవ యేను సలిపెదు। సమయంబునఁ గర్తృకర్మసాధనవైగు
ణ్యము లేమి గల్గెనో యి। ట్లమితవ్యథఁ దెచ్చి పెట్టె నాయమ నాకున్. ౪౩.

క. ఇటు గాక లోకముల నిం। తటిచెలువుఁడు గలఁడె గలిగినను నుబ్బడె యి
చ్చట నచ్చటఁ గలఁ డని యా। క్కట నన్నిట్లేచు టంబకరుణ తెఱంగే. ౪౪.

సీ. అని పల్కుపలుకు లాయవసరంబునఁ దత్సమీపంబునం దనురూపగతిని
శుచిముఖి సంచరించుచు విని యుత్తన్వి చిత్తంబు వడసి యేఁ జెలిమికలిమి
వాత్తించుకొనుటకు ననుగుణం బగువేళ యిది యటంచు నూహించి మదిని
దగునుపాయంబు వితర్కించి యపుడు యదృచ్ఛనపోలె నా తెఱవయెదుట
వడ్డముగ నల్లనల్లన యరుగుచు నవి। మర్శదృష్టిని బలుమఱు మరలి మరలి
చిత్రఫలకంబువంక వీక్షించెఁ గొంత। నరిగడచుదాఁక నొకవింతసరణి మీఱ. ౪౫.

క. అపు డమ్మరాళిచందం। బుపలక్షించుచుఁ గపోలయుగ్మము దరహా
సపుఁగాంతిఁ దనరఁగా నా। చపలేక్షణ తనదుప్రాణసఖి కి ట్లనియెన్. ౪౬.

క. కలమలపులుఁ గిది తా నే। మెఱుఁగునొకో తిరిగి తిరిగి యీఫలకముపైఁ
బరపెడుఁ జూడ్కుల నా నా। మెఱుఁగుంబోడికి మరాళి మృదుమధురోక్తిన్. ౪౭.

వ. ఇట్లనియె నోపడంతి నీపలికినట్ల మాయట్టితిర్యగ్జంతువు లేమియు నెఱుంగమి యథార్థంబ యైనను నేను నీచేతిచిత్రఫలకం బబ్రపడి చూచుటకుం గారణంబు వినుము మున్నొక్కచోట నొక్కపురుషుఁ జూచి తత్సమానరూపుని మఱి యెందు నుం గానక యిప్పు డిందు నతని కైవడి దోఁచిన నిది తదీయరూపం బెఱింగి వ్రాసిన తెఱంగో యటు గాక యట్టివాఁడె వే ఱొక్కఁ డెక్కడ నైనం గలిగెనో యని యించుక విమర్శించి వీక్షించితి నన విని ప్రభావతి యద్భుతప్రమోదసందేహంబులు డెందంబునం గ్రందుకొనుచుఁ గందళింప నప్పలుఁగుం దప్పక చూచి యి ట్లనియె.

శా. ఏ మేమీ యిఁక నొక్కమాటు చెప్పుమా యీ వున్నరూ పిట్లరో
యే మైనం గలదో విభేద మిట ర మ్మీక్షింపు మింకన్ వచ
స్సామర్థ్యం బరయన్ మహాత్మ వని యస్మద్బుద్ధికిం దోఁచె దా
హా మాభావము గాన లేవె మదిలో హంసీ భయం బేటికిన్. ౪౯.

వ. అనిన శుచి మదిరాక్షి నీక్షించి యి ట్లనియె. ౫౦.

క. నీ వనినయట్లు యేను భ। యావహులను గానివారి నాకృతిన కనం
గావలఁతి నైనఁ బిలువక। యే వెట్టినె చేర నిరువు రేకతమూడన్. ౫౧.

వ. అనిన వెఱఁగంది యాయిందుముఖి సఖియునుం దానును నొండొరులమొగంబులు చూచి నగుచుఁ జెవులకుం జవులు మివుల నలవరించుగులుకు టెలుంగు గలకలికి పలుకులకె వలచి మొలచుకుతుకంబున నతివశంవదహృదయ లై తమ కిద్దఱకుం దాని పెద్దబుద్ధులు నుద్దులు ముద్దు రప్పించుచుం దద్దయు నుద్దీపితరాగంబు లగుచుండ రాగవల్లరి యాగఱువతనంబులాగు తెగరితలందును మున్ను కన్నవిన్నయవియె దీనికఱదు లెంత యరుదులు చూచితే యంచు నాయంచపై నాదరాహ్లాదమేదుర నిరీక్షణంబుల నీక్షించి యోపక్షికులభూషణంబ నీభాషణంబు నిక్కంబ మిక్కిలి వక్కఱ పడి వేఁడక ప్రౌఢ లగుగఱువ లిరువు రేకాంతమాడుచోటి కేటికిఁ బోయెద రిది యట్లు గాదు గదా యేమొక్క సందియంబు నివర్తించుకొనం గోరి యిత్తతి నత్యంతప్రార్థనంబు గావించు చున్నవారము గావున నీకన్నయప్పురుషునియొప్పు నిప్పలుకపై వ్రాసినరూపంబుచొప్పు నొక్కటి యగునో కాదో యీపండకు వచ్చి నిచ్చలంబుగాఁ జూచి నిశ్చయించి చెప్పు మిప్పుడుచు నేను నిట్టివాఁ డెందును లేఁడు కలఁ డనువివాదంబునం బన్నిదంబు చఱచినవారము. ౫౨.

క. అనుటయుఁ బందెముకొఱ కై। నను వే ఱొకపనికి నైన నా కది తెలియం
బని గలదె మీకు నాచే। వినవలసినయర్థ మరసి వివిపింతుఁ దగన్. ౫౩.

గీ. అనుచు శుచిముఖి తనమాట కాపడంతు। లీక్షితాన్యోన్యవదన లై యెంతదూర
మరుగుచున్నది దీనివాక్యాశయ మని। మివుల వెఱఁగందఁ గొంత చేరువకుఁ బోయి.

క. నవిమర్శదృష్టి నాటిత। కవిధాన మొకింత నడపి కడుఁ బదిలముగా
వివరింప నతనిరూపము। యవు నౌ నిది యిందు సందియము లే దనియెన్. ౫౪.

చ. అనుటయు రాగవల్లరి మహత్తరమోదవిశేషసంభ్రమం
బునఁ బఱతెంచి యప్పులుఁగుముద్దియఁ దద్దయు ముద్దు గారవం
బును జిగురొత్త నెత్తుకొని పోయి ప్రభావతిదండఁ బెట్టి యొ
య్యనఁ గొనగోళ్ళఁ దత్తనురుహంబులు దువ్వుచుఁ గూర్మి ని ట్లనున్. ౫౫.

ఉ. అంచవు గావు నీవు నను సారసి ప్రోవఁగ మూర్తిమత్త్వముం
గాంచినభాగ్యదేవతవు గాని మహోక్తి తెలుంగు నేఁడు గ
ల్పించితి వేజగంబునను లేఁ డిటువంటిమనోహరాంగకుం
డంచుఁ గలంచు నిజ్జలరుహాసన మానక నాదుచిత్తమున్. ౫౮

వ. అనిన విని ప్రభావతి నిజవయస్యం జూచి. ౫౯

గీ. రాగవల్లరి నీ వేల వేగిరించె! దింతమాత్రంబ చాలు నే యీప్సితార్థ
సిద్ధి కతనిలక్షణము లీచిత్రమూర్తి! యందు నే మైనఁ గల వేమొ యడుగవలయు.

వ. అనిన విని యాహంసి యాచిత్రరూపంబు నిరూపించి ప్రభావతి నుద్దేశించి
యి ట్లనియె. ౬౦

ఉ. ఆరయ నింక నే మడిగె దల్లవె యాతఁడు శంబరుం ద్రిలో
కారిని ద్రుంచునప్పటిప్రహారకిణంబు లురంబునందు నా
హా రతికంకణాంకములు నల్లవిగో మెడయందు వీరశృం
గారకళాఢ్యు ని ట్లతని గట్టిగ నెవ్వ రెఱింగి వ్రాసిరో. ౬౧

వ. ఈలక్షణకథనంబుచేత నతనినామజాత్యాదు లత్యంతప్రసిద్ధంబులు మీరు మీ
యంత నె యెఱింగెదరు గావలయు నంతఃపురవాసినులు గావున నెఱుంగరో యని
యెఱింగించెద నంటి నేని. ౬౨

చ. ఎనయుఁగ నెవ్వ రెంతమన సిచ్చి వచించిరి తాను వారితోఁ
బనుపడ నంతమాత్ర ప్రతిభాషణ మాడుట యుక్త మంద్రు మీ
కొనరఁగఁ బన్నిదంపుగెలుపోటలు దీర్పఁగ నిప్పు డేను జె
ప్పినదియు చాలు నింకఁ దలపెట్టుట చెల్లద యెక్కు డేమియున్. ౬౩

గీ. నీవ కద ప్రభావతి యన నిన్ను మున్ను! తరుణి నేవింటి రాగవల్లరియొ బోటి
పేరు నీ విపు డన వింటి మీ రిరువురు! నీ యెఱుక మఱచెదరు సూ పోయి వత్తు.

ఉత్సాహ. అనుచు గగనభాగమునకు నంచ యెగయఁ జూచినన్
దనుజకన్యకాలలామ తనదురెండుచేతుల
న్వినయ మొప్పఁ బొదుగఁ బట్టి వేనవేలభంగులన్
దనరఁ బ్రియము చెప్పుచును ముదం బెలర్ప నిట్లనున్. ౬౪

సీ. నిద్దంపుఁబండువెన్నెల గాయు టెక్కులయొప్పు చూడఁగ నొక్కయుత్సవంబు
మెఱుఁగుఁదీఁగెలబాగు మించుపత్త్రాంతహాటకరేఖ లరయ నొండొకప్రియంబుఁ
గమనీయ మగుమహాగమనగాంభీర్యాదివిలసనం బీక్షింప వేఱె యింపు
మాధుర్యధుర్యకోమలవచనామృతం బనుభవింపఁగఁ గౌతుకాంతరంబుఁ

గలుగఁ జేయుచు నువ్విళ్ళు గొలుపునీదు। సంగతి యొకింత గని యెట్లు జాఱవిడుతు
నింక రాగవల్లరి పేరు నీవు నిజము। ననఁగ నీతో నొనర్తు నెయ్యంపుఁజెలిమి. ౧౬.

గీ. ప్రణయ మొప్ప మిగులఁ బ్రార్థించుచున్నట్టి। నన్ను ననుగ్రహించి నాదుచెలిమి
కొడఁబడంగవలయు నోహంసభామినీ। యనుచు వేఁడుకొనఁగ నంచ పలికె. ౧౭.

ఉ. ఇప్పుడు నీవు చెల్మికిని హేతువుగాఁగ గణించినట్టి నా
యొప్పును గప్పఁ దా నెచట నుండు రహస్యవిచారదక్షు మా
చెప్పుడు నీకుఁ దోఁచె నపు డింతయు రోసెదు దీనిచేత మీ
యిప్పటిమంతనంపుఁబని యేమఱ కంపుఁడు పోయి వచ్చెదన్. ౧౮.

వ. అనిన విని రాగవల్లరి హంసీమతల్లికం జూచి యి ట్లనియె. ౧౯.

క. పోయెదఁ బోయెద నంచి। ట్లోయంచలతల్లి యేల యుద్దాడింపన్
మాయేకాంతపుఁబనికివి। నీయునికి విరోధిగాదు నిర్వాహకమ్మున్. ౨౦.

వ. ఇదే నిమిత్తంబుగా సఖ్యంబు గావలయు నని ప్రార్థించెదము గాని కేవలం బైన తావకరామణీయకంబునన కాదు నీదుపలుకుం దెరువులు పరికింప నిది నీవును దెలియుట విస్పష్టంబ యైనను శుద్ధాంతస్థితిదోషంబునం జేసి యే మయి యీమాట మాటు పెట్టక గొబ్బునం జెప్ప నేరకున్నవారము చెప్పి వేఁడికొనక యేపనికిని నీవు చోరమి మొదలన పదిలంబుగాఁ దెలిపినదానవు గావున. ౨౧.

ఉ. వట్టిమఱుంగుఁ బెట్టి నుడువం బని లే దది యెల్ల భేరి గో
ట్టుట కాక నిన్గెలువఁ గూడునె మాటల నీవు గంటిన
న్నట్టిశుభాంగుఁ డీరమణియాసల కాస్పద మిప్పు డాతని
న్గట్టిగ నన్వయాది కథనంబుగఁ దెల్పి యనుగ్రహింపవే. ౨౨.

గీ. ఇప్పు డిది చెప్ప కెడ సేయ టీలతాంగి। ప్రాణసంకటపఱుచు టోపక్షిరమణి
కావునను గావవలయు శీఘ్రింబ చెప్పి। వెనుక నెఱిఁగింతు నీకు మావృత్త మెల్ల.

వ. అనిన శుచిముఖి వచనవక్రత చాలించి యి ట్లనియె. ౨౪.

ఉ. అంతిపురంబుకన్యలఁట యాత్మ తెఱం గభిధాప్రయుక్తి నొ
క్కింతయు నేర్పరింపరఁట యిట్లన నిట్లని నాకు నాకె య
ర్థాంతరము ల్గడించుకొని యంజక యెట్లు యథావస్తుతు ల్ప్రపం
చింతు నటంచు నుంటి నీకఁ జెప్పెద మీరలు గుట్టు దెల్పుటన్. ౨౫.

వ. అని పలికి ప్రభావతిం జూచి నీకు మనోహారి యైనయాపురుషరత్నంబు తెఱంగు విను మని యి ట్లనియె. ౨౬.

క. భారతవర్షమునందున్। ద్వారక యనుపురము గలదు తద్వర్ణన వా
ణీరమణునకైనను దుఃస్పార మపారము సమస్తసౌభాగ్యములన్. ౨౭.

గీ. ఏను దానిమహిమ నానేర్చినంత వ। ర్ణింతుఁ గొంత యని తలంతు నేని
నీవు ప్రకృతయుపకథావిలంబమునకు। నోర్వ వేమొ యది యటుండనిమ్ము. ౭౮.

క. నా విని నీ కిది చెప్పం।గా వలయునె యెందు మిగులఁ గతరాజవు నీ
వోవరటారత్నమ యని। యావనితలు నవ్వ నవ్విహగి యిట్లనియెన్. ౭౯.

ఉ. ఆనగరంబునన్ యదుకులాభరణం బగుమర్త్యజన్మము
న్బూనినసర్వభద్రపరిపూర్ణుఁడు కేశవుఁ డుండు నాథుఁడై
యానలినాక్షు షోడశసహస్రవధూప్రియు మిక్కిలి న్గుణ
శ్రీ నలరించి యష్టమహిషీజను లెంతయు మింతు రున్నతిన్. ౮౦.

గీ. అందు నగ్రగణ్యయై యొప్పు రుక్మిణీ। నామధేయ యొకతె యామగువకుఁ
బట్టి యొకఁడు గలఁడు ప్రద్యుమ్ననాముఁ డా। యనఘురూప మిది సుధాంశువదన.

ఉ. శౌర్యమయుం డతండు భుజసత్త్వనిధానము కాంతిరాశి గాం
భీర్యపుఁబ్రోక సత్కళలపెన్గని రూపము దాల్చినట్టియౌ
దార్యము పెక్కులేటికి సుదాత్తగుణోదయ మాయపూర్వసౌం
దర్యత కెంత యెంత యుచితం బగు నంతయుఁ గల్గి శోభిలున్. ౮౨.

వ. అని చెప్పిన. ౮౩.

శా. సంతోషం బపు డాత్మఁ బిక్కటిలుచున్ సర్వంకషం బై శరీ
రాంతర్భాగముఁ బట్టఁ జాలక నిలింపారాతిరాట్కన్యక
త్యంతంబు న్వికసిల్లఁ జేసె ముఖపద్మంబు న్మృపాశిక్షఁ ద
త్కాంతారత్న మొనర్చునట్టిమువహిత్థాయత్నము న్మీఱుచున్. ౮౪.

మ. ప్రమదం బొప్పఁగ రాగవల్లరియు నాపద్మాననం జూచి చి
త్రము నీ కిచ్చినదేవివాక్యమునకున్ దార్కాణగా నామజ
న్మములు న్వింటి గదమ్మ తద్వసతియున్ సంసిద్ధి యయ్యెం గదా
కమనీయం బగునీమరాళికృప నింక న్నాను మాందోళమున్. ౮౫.

వ. ఇమ్మరాళబాలికయాలాపచాతుర్యంబు చూడఁ గడమకార్యంబును సాధించి పెట్టునట్టిదిట్టతనంబు గానిపించుచున్నది మొదలనుండియు సకలకళల నడినన్నఁ జనుదులప్రోదిఁ బెరిఁగినది గాఁబోలు కాలిపెండెరంబు నొక్కటి గలిగి యున్నది యని తదక్షరంబు లీక్షించి చదువుకొని యాబిరుదంబునకు నరుదుపడి యాహంసివలనం దజ్జన్మనామవిద్యాభ్యాసాదులు విని మనంబునం గడు ముదం బందుచుం బ్రభావతిం జూచి యోచెలువ మనకొదవ లన్నియుం దీర్చుటకు శరణం బింక నిదియ కాని వే ఱొండు గాన మని పలికి యాపులుఁగుఁజెలువకుం దనచెలికత్తె

కలతెఱంగు సకలంబునుం జెప్పి తదాది గా నప్పటితుదకు ముదిత తొఁదవిన మదనా
వస్థ లెల్ల నవిస్తరంబుగా వినిపించి యింతకుం జెల్లంబుగ నీపల్లవాధరయాకారంబు
పరికించి చూడు మని యిట్లనియె. ౧౬.

సీ. సెలఁతముక్కరయందు నీలంబు గాదు సూ తెలిదసకౌస్తుభ ద్యుతియును గాని
యువిదఫుండిళ్ళ బాహుపురులు గావు సూ మిఱి చూడ విడినయార్త్రికలు గాని
సుదతిపాలిండ్లఁ గస్తురినల్పు గాదు సూ కనుదోయి కాటుకకప్పు గాని
రమణికర్ణికల వజ్రపుదీప్తి గాదు సూ ప్రాఁగెంపుఁదునుకలరంగు గాని
యూర్పు వేఁడిమిఁ గృశత బాష్పోదయమున। గండపాండిమఁ దత్తప్తికారవములను
గానఁబడియెడు నోవిహంగమపురంధ్రి। యింక నీచేత నున్న దీయింతిబ్రదుకు. ౧౭.

చ. అరయఁగఁ దల్లి కక్కచెలియంద్రదకుఁ దక్కను గల్గినట్టిచు
ట్టరికమువారికి న్నెరయ డాఁచురహస్యము లీనిజాంతర
స్మరవికృతిప్రవర్తనలమాటలు నీని వినంగ నాప్తవై
పరఁగెడునెచ్చెలుల్ చెలికిఁ బ్రాణము లిచ్చిన నప్పు దీఱునే. ౧౮.

సీ. కావున నోహంసి నీ వెఱుంగనిసఖీధర్మంబు లేదు విద్వజ్జనంబు
సఖ్యంబు నెంచును సాప్తపదీనంబుగాఁగ న ట్లొట వేగంబ యరిగి
యదుకుమారకునకు హృదయంగమముగ నీయతివసౌందర్యాదు లభినుతించి
యేతన్మనోరథం బీడేర్పవలయు నీ వని పల్కుటయును నాహంసరమణి
యతనివద్ద నీయంగనయంగకములు। చక్కఁదన మెల్ల నొక్కప్రసంగవశత
నేను మున్న వర్ణించినదానఁ దత్ప్రసంగ మెయ్యది యంటేని సకియ వినుము. ౧౯.

ఉ. ఏ నిట మున్ను నివ్వనరుహేక్షణఁ గన్గొని చన్నదాననై
యానరవర్యుఁ గాంచి యరుదైనతదాకృతిశోభ కెన్న జో
డైనది యీవిలాసవతియాకృతిచెల్వము కావునం దలం
పైన వచింపఁగా వలసె నాతనివద్దఁ బ్రసక్తివెంబడిన్. ౨౦.

క. వచియించిన నాఁ గా దను। వచనం బపు డేమియు నుడువకయుండె నతం
డచలస్థితి నాకును నది। యచాలు నప్పటికి నేతదర్థ మెఱుఁగమిన్. ౨౧.

క. అన విని మనసు చివుక్కురు। మనఁగఁ బ్రభావతి వివర్ణ ముగువదనముతోఁ
గనుపట్టుడు నింతనె ముగి।సెనె కార్యం బేల యింత చింతిల ననుచున్. ౨౨.

వ. అద్దనుజరాజకన్యక నూరార్చి హంసి యిట్లనియె. ౨౩.

మ. అతివా నిన్వినిపించువేళఁ బ్రతివాక్యం బేమియు న్నేమిఁ ద
ద్రతికాంతుఁడ్ వెనఁ జెత్తుఁ బంపు మని పంతం బాడుకో రాదు గా

నితగం దెచ్చెద నిశ్చలం బయినవూని క్సిద్ధగంధర్వదై
వతదైత్యాదికులంబులం దొకని నెవ్వాని న్మదిం గోరినన్. ౯౫.

గీ. తాను జెప్పినవానిని మాని యితర। పురుషు నేఁ గోర నుమచిత్తమునకు రాదొ
యనవలదు భక్తపరతంత్ర కాభవాని। కరయ భవదిష్ట మెయ్యది యదియు ప్రియము.

వ. కావున సందిగ్ధఫలం బయినప్రద్యుమ్నవాంఛ విడిచి దేవదైత్యసిద్ధవిద్యాధర గంధర్వాదులందు నెవ్వాఁడు గావలయు నన్న నతని నతనుపావకప్రజ్వలనధాయ్యామంత్రాయమానం బయినతావకీనసౌందర్యసంపత్సహస్రతమభాగకథనమాత్రంబున నపాస్తధైర్యుం జేసి తెచ్చి నీకుఁ గింకరుం గావించెద నీ వించుకయు నీరామణీయకమహిమ యెఱుంగవు గాక యిది వినిన మదనవశంవదహృదయుండు గానివాఁడునుం గలండె యదుకుమారుం డొక్కరుండ యనుపమేయరూపలావణ్యగర్వంబునం గన్నుఁ గానకున్నవాఁడు గావలయు నతం డట్లయుండనిమ్ము తత్సమానులన రాదు గాని నానాభువనసంచారిణి నైననాకు నక్కడక్కడ మిక్కిలిం జక్కని కొమరుఁబ్రాయంపుఁగొమరు లెంద రెంద రైనం గనంబడుదురు వారల నందఱ లిఖించి తేవలసి వచ్చినం దెచ్చెద నిచ్చకు మెచ్చువచ్చినవాని వరియింపు మనిన నమ్మాటలు పెడచెవులం బెట్టి యొక్కింతతడవు చింతించి కటకటంబడుచుఁ బ్రభావతి యిట్లనియె. ౯౬.

మ. చిరకాలంబునఁబట్టి యేను మదిఁ గాంక్షింపం బ్రియోదంత మి
ట్లరుదార న్వినిపించి ప్రాణసఖి వై హంసీ తుదన్ యుక్తమే
విరసం బైనవచఃప్రపంచనముచే వేషంగ నిందాఁక ని
న్సరసత్వంబునఁ బ్రౌఢ వంచు మదిలోఁ జాలంగ నే నమ్మితిన్. ౯౭.

గీ. వజ్రనాభుండు మును స్వయంవరపువిధికి। నను నియోగించి దేవగంధర్వసిద్ధ
యక్షవిద్యాధరాదుల నసురవరుల। విశదముగ వ్రాసి చూపించె వేయువేల. ౯౮.

క. వారలలో నెవ్వానిం। గోరెదునందాఁక లేదు కొలుపద యుల్లం
బారసి చూడఁగ నైనను। బ్రారబ్ధం బెట్లు లున్న యదియె యెఱుంగన్. ౯౯.

చ. జనకుఁడు నప్పు డీసకలసద్గుణపూర్ణుని వ్రాసి చూప నా
కనుపఁడు వ్రాయునంతటినమర్థులు లేమినొ తా నెఱుంగఁడో
మనుజుఁ డటంచుఁ గైకొనఁడొ మత్కులవైరితనూజుఁ డంచు మా
నెనొ యెఱుఁగన్ సురారికులనిర్మథనుం డని విందుఁ గేశవున్. ౧౦౦.

చ. అది తలపోసి కుందఁ దగునా యదునందనునందు నున్న నా
మది తెలుఁగున్ జగజ్జననిమాటలుఁ జెప్పఁగ వించు శంక చే

సెను పురుషాంతరానుమతి చేకుఱునో యని నీకు నింక నా
హృదయములోఁతు గానఁబడ దే నెఱిఁగింతుఁ బ్రతిజ్ఞ యొం డిఁకన్. ౧౦౧.

క. విను ప్రద్యుమ్నుని దక్కన్। మనమున నే నొరు వరించుమాట విడువు మా
ఘనుఁ డొల్ల కున్నఁ జెందుదు। మనసిజశిఖిఁ దనువు ప్రేల్చి మఱునటిమేనన్. ౧౦౨.

ఉ. ఈతుద్ధపక్షమే మదికి నిప్పుడు నిశ్చిత మె ట్లటన్న ము
న్నాతఁడు వించు నాకథల కట్టిటు పల్కమి గాక తద్గళ
ద్యోతితకంకణాంక యగుతొయ్యలి నొక్కతెఁ గల్గఁ జెప్పి తీ
జేతప మాచరించె నొకో యిందుల కారతి ప్రాగ్భవంబునన్. ౧౦౩.

వ. అని తదీయం బయినసతీవ్రాల్లభ్యంబునకు ముచ్చట పడుచు నొక్కింత తలపోసి.

సీ. ఆరతికిఁ గరంబు లైతిరే నవ్విభుఁ గౌఁగిలింపఁగ నబ్బఁ గరములార
యాయింతికిఁ గుచంబు లైతిరే నతనివక్షోనిపీడన మబ్బఁ గుచములార
యాలతాంగికిఁ జెక్కు లైతిరే నారమ్యశీలుచుంబన మబ్బఁ జెక్కులార
యానెలంతకు వీను లైతిరే నాకళావిదుమంతనము లబ్బ వీనులార
యట్లుగా నోచ కేల నాకైతి రకట। యని నిజావయవంబుల కాత్త వగుచు
బాల్యమునఁ దన్ను రమణ సౌభాగ్యకలిత। యనినసాముద్రికులమాట లరసి తిట్టు.

వ. ఇవ్విధంబునం బెద్దయుం బ్రొద్దు విరహఖేదనాదోదూయమానమానస యగుచు నుండి యంతట శుచిముఖిం జూచి యి ట్లనియె. ౧౦౫.

సీ. ఓహంసి నిన్ను నే నొక్కటి తుదమాట యడిగెద నీహృదయంబునందుఁ
గలయట్లు చెప్పుమీ కల్ల లాడిన నీకు నాతోడు నమ్ము ప్రాణసఖి వీవు
తడయక ప్రద్యుమ్నుకడ కింక నొకమాఱు పోయి దుస్తర మైననాయవస్థ
చెప్పి చేరికఁ గొంత చేయ వచ్చునో రాదో యీదురాశాపాశ మెందుఁ దెగవి
బంధ మై ప్రాణముల వెలువడఁగ నీక। యాఁగి పెంచెడు మదనాగ్ని నహరహంబు
నీవు చని యవుగాములు నిశ్చయించి। యాశఁ దెగఁగోయు మదియ మత్ప్రాణరక్ష.

వ. అనుటయు నాతరుణికిం గలహారితనయవరణానురాగం బెవ్వారికి నవారణీయం బనియును నింక నియ్యాస చెడకుండ నిర్వహింపక తడసినం గడు నెడరు వాటిల్లఁ గార్యంబు దప్పు ననియు నిశ్చయించి యంచ యి ట్లనియె. ౧౦౬.

చ. మదితమిఁ జూడఁ గొన్ని వెడమాటలు పల్కితి నీవు నమ్ము మే
నిజ భవదీశుఁ డెత్తు నవు డేమి పరాకున మాఱు పల్కఁడో
సుదతి యెఱుంగఁ గాని యిఁకఁ జూడుము తావకరూపవైభవా
భ్యుదయమువిన్కలిన్ బ్రియము పూని యతండు విరాళిఁ గుందెడున్. ౧౦౭.

వ. దీనికి నిమిత్తంబును దైవనియమంబు గల దది విను మెఱిఁగించెద. ౧౦౮.

గీ. బ్రహ్మకును సరస్వతికిని బ్రణయకలహ। మయ్యె మును పొక్కనాఁ డపు డబ్జభవుఁడు
తద్విరహపీడ సైరింపఁ దరము గాక। వాణిఁ దేర్పఁ దజాప్తు లెవ్వారొ యనుచు.

క. ఆరసి నను బిలిపించెను। శారదకడ నప్పు డేను సరసక్రీడా
చారసచివత్వమున సం। చారముఁ గావించు చునికిఁ జంద్రనిభాస్యా. ౧౧౧.

వ. అట్లు పిలిపించి నన్నుం దనపాలఁటిపాలయలుకం దీర్చుటకుఁ బనుపుచ్చుండి యుద్దేశి
సుద్దేశించి. ౧౧౨.

సీ. నీసుప్రసాదసన్నిధిమహత్త్వము సుమీ నిగమరాశి ముఖస్థ మగుట నాకు
నీవిలాసమచర్చికావిశేషము సుమీ సంగీతసాహిత్యసౌరభంబు
నీకటాక్ష శ్రీవిపాక భేదము సుమీ వేణువీణాదులరాణ లెల్ల
నీ వనుగ్రహలీలఁ గావించుటన సుమీ యఖిలలోకవ్యవహారసిద్ధి
కావున నొకింత రోషావాణి నీ వలిగిన। నొకవినోదంబు నొదవ దే నోర్చు టెట్లు
విరహ మేకాంతదాస్యకింకరునియందుఁ। గరుణ లే కింతతడ వలుగంగఁ దగునె.

క. అని యేఁ దనుఁ గడుఁ దూఁతిని। నని మత్ప్రియకడను సేగి హంసి పలుకుమీ
యనుచు నపు డంత శంతనుఁ। దనరుమనోజార్తిఁ గరముఁ దప్తుం డగుచున్. ౧౧౩.

గీ. ఏలరా మన్మథుఁడ నన్ను నింత యేచ। టేమి మేలు రానున్నవి యిట్టిపాట్లు
నీకు నీకఁ బ్రభావతి యను నెలఁతపై వి। రాళి కారణముగ వేగిరంబు వలదు. ౧౧౪.

క. నా విని యేను రతిప్రియ। భావము న ట్లపహరించుపాటిది యైన
న్నీ వనితవనిత యొక్కెడె। లావణ్యాదులను రతివిలాసిని కనుడున్. ౧౧౫.

క. రతిరూప మెక్కడ ప్రభా। వతిరూ పెక్కడ విమర్శవంతులు దెలియన్
రతిసాబగుకంటెను బ్రభా। వతిపస ముమ్మడి నలుమడి వాసి మరాళీ. ౧౧౬.

వ. ఆప్రభావతిరూపంబును మదీయసృష్టియం దతిదుర్లభం బది పార్వతీ వరప్రసాద
జనిత యై పొలుపొందు నని పలికి నిజాంగనారోషంబుఁ దీర్చుటకు సత్వరంబుగాఁ
బనిచిన నే సతనికాలవిలంబనాసహిష్ణుత్వంబు దెలిసినదాన నై యప్పు డేమియు
నడుగ వెఱచి యరిగితి మఱియుఁ గ్రమక్రమంబున నట్టిప్రభావతివి నీవ యని నిశ్చ
యించితిం గావున నీవల్లభుండు భవదాయల్లకభరంబునం జరితప్తుం డగుచు నిన్ను
వరించుటకు నీకంటెను వేగిరించు నని తోఁచుచున్నయది రతీవిలాసంబును
దదంతరాయంబు సేయం జాలదు నీవు సకలసంశయంబులు నుడిగి సుఖం బుండు
మనిన విని యుద్దసుజేంద్రనందన తన డెందంబున సందియంబు నొందుచు రాగవల్లరి
మొగంబు చూచుటయు నది తదభిప్రాయం బెఱింగి హంసి కి ట్లనియె.

గీ. ఏమిటికి హితవుగఁ జెప్పి యెందు నదికి। తచ్చెరువు నీదుమాట లోయించ గరిత
కాముఁడు ప్రభావతీకాంక్షఁ గలఁగె నేని। మనచెలియ కిష్టుఁడు విరాళిగొనుట యెట్లు.

ఉ. అనిన న్నవ్వి మరాళి యిట్లనియెఁ జెల్వా కాముఁ డన్వాని మీ
రును విన్నారు గదమ్మ యాసకలసద్రూపోపమానత్వశో
భనకీర్తిప్రథితుండు తొల్లిటిసురూపశ్రీఁ గడు న్మించుచె
న్నొనరం బుట్టినవాఁడు రుక్మిణికిఁ బ్రద్యుమ్నుం డనం బుత్రుఁడై. ౧౨౦.

ఆ. అని నిజశంకల కన్నిటికినిఁ బరిహారములు చెప్పి గొంటక యుండక
దనయాన నిలుప దితిసుత తనయ రమణుఁ గలయ మిగులఁ దమకించుమదిన్.

వ. హంసిం జూచి. ౧౨౨.

సీ. నీ చెప్పినట్ల యిన్నియు నైన మొదలఁ దత్పుర మెంత దవ్వొ నీపోవు టెపుడు
పోయి వేళ యెఱింగి పొసఁగ నవ్విభున కీవృత్త మెనర్చ నాకోర్కెఁ దెలుపు టెపుడు
తెలిపిన నేవిఘ్నములకు లోఁబడక నాపై నతఁ డనుకంపఁ బూను టెపుడు
పూని తా నిచటికి పూనొక్కనెపమున గురునాజ్ఞ దొరకించుకొనుట యెపుడు
పట్టి యెనుమచ్చరపురాశి వజ్రనాభుఁ డస్మదిచ్ఛకు ననుకూలుఁ డగుట యెపుడు
విరహవారిధి నేఁ గడవెళ్ళు టెపుడు వలవనిదురాశలను గుమారిలుటె కాక.

ఆ. అని తాల్మి వదల విడుముచు ఘనముగఁ బ్రజ్వరిలుదర్పకజ్వలనముచే
ననయము శోషిలి చెలి లోచనముల వెడలించె మోవిసరసత యెల్లన్. ౧౨౪.

ఆ. అట్టియెడఁ గట్టెదుర నొక చెట్టున నురిఁ దగులు వడినచిలుక వెఱపుతో
నిట్టటు ఱెక్కలు తటతటఁ గొట్టుకొనుచు నెగయఁ బెనఁగఁ గోమలి కనియెన్.

ఆ. కని ఘనసంభ్రమమున దిగ్గున లేచి దయాకులం బగుమనోవృత్తిన్
దనతోఁ జెలియున్ హంసియుఁ జనుదేరఁగ దానిఁ జేరఁ జనియె రయమునన్.

ఆ. చని చిలుకఁ గదల కుండఁగ ననువునఁ దాఁ బొదుగఁ బట్టి యంఘ్రియురి వద
ల్చిన నది రయమున నభ్భామిని కేల్విడిపించుకొనుచు మింటికి నెగసెన్. ౧౨౬.

వ. అప్పుడు. ౧౨౭.

క. శుకపత్త్రంబులలోనుండి తదతిక్షోభంబునం జాతి ప
త్త్రిక పడ్డన్ వెఱఁ గంది యిట్టు లను దైతేయాధిపాంతఃపురం
బకటా చోద్యము చూచితే యిది కదున్ హంసీ విచార్యంబు కొం
కక యిం దెవ్వరి కెవ్వ రంపిరొకొ చిల్కం బట్టితే నోపుదే. ౧౨౮.

వ. అని ప్రభావతి పల్కిన హంసి యపుడ తూడఁ జని పట్టి తెత్తుఁ జిక్కుపడ కెంత
దవ్వు పాఱెడు ననుచుఁ బంతమునఁ బఱచె శీఘ్రగతి నింత నంత నాచిలుకఁ దగిలి.

సీ. అంతఁ బ్రభావతీసతి వయస్యఁ గనుంగొని యింతి చూచితే
యెంతటి చోద్యముల్ మొదల నిక్కడ నిట్లురు లెవ్వ రొడ్డిరో

వింతె యటన్న నీచెవికి వేఁడిగఁ బల్కుపికాళిఁ బట్టి శి
క్షింతు నటంచు నేఁ గడఁగి చేసినత ప్పిది యొప్పు నోర్వఁగన్. ౧౩౧.

క. చిత్రము మిక్కిలి నిపుడీపత్రికచందంబ యోప్రభాతాబ్జలన
నేత్ర యది చూత మనుచున్ బత్రిక పుచ్చుకొని విచ్చి భాసురఫణితిన్. ౧౩౨.

సీ. "శ్రీమత్సరస్వతీరామాకృపానంప్రయుక్తోపమాతిశయోక్తికామ
ధేనుసద్బిరుదాంక దివ్యమంజీరసంశోభితపాదకు శుచిముఖికిని
బ్రద్యుమ్నుఁ డూర్జితప్రణయపూర్వకముగా ననిపినయట్టిరహస్యలేఖ
ప్రప్రభాభావతిఁ బలుదెఱంగుల నీవు వచియింప" నని చదువుచు నె యుబ్బి
సంతసము సాపఁ జాలక చంక వైచుకొనుచు నొకదాఁటుగొని నిన్నుఁ గూర్చి కాంతుఁ
డనిపినట్టి పత్రికయె కదమ్మ భాగ్యవతివి నీ వని చెలి ప్రభావతిని బల్కె. ౧౩౩.

చ. పలికిన నట్ల యున్నదిదె పత్రికలో నదికించెదో ననున్
జెలి యిటు చూపుమా యనుచుఁ జేరఁగఁ బోవుచుఁ జేయి సాఁచె నా
యలినిభవేణి తత్సఖియు నట్టిటు పాఱుచు దేవునాన యేఁ
గలయది యంతయుం జదువఁగా విను చూచెదు కాని నావుడున్. ౧౩౪.

ఉ. ఆవిధిఁ దప్పకున్నఁ జెలియా ననుఁ జేకొను టెట్లు ప్రప్రభా
భావతి నాఁగ నెవ్వతెయొ పత్రిక యింకను లెస్స చూడు నా
కీ పల దన్నదె ల్లెఱుఁగవే భవదాఖ్యయె కాదె యిట్లుగా
నో వనజాక్షి వర్ణపునయుక్తిగ వ్రాసినవాఁడు భ్రాంతిచేన్. ౧౩౫.

వ. అనుటయు. ౧౩౬.

క. ఎట్టిటు కానిమ్మది యిఁక। నట్టిటు పాఱక మృగాక్షి యవలఁ జదువు మే
నిట్టే యుండెద నావుడు। గట్టిగ నట్లని వినుము కడమ చదివెదన్. ౧౩౭.

వ. అని ప్రథమప్రుతాంతంబు నందుకొని యిట్లని చదువం దొడంగె. ౧౩౮.

సీ. "ప్రప్రభాభావతిఁ బలుదెఱంగుల నీవు వచియింప నపుడు నిర్వచనవృత్తి
నే నున్కి కల్లగు భ్రాంతియె కాని యేయింతియంగము లెవ్వి యెట్లు చెప్పి
తవి యెల్ల నట్ల నాయాత్మఁ దద్దయుఁ బడి యచ్చున నద్దిన ట్లమర నంటి
మలిచినగతిని మిక్కిలి దృఢత్వముఁ జెంది సద్గుణసంపద్గౌరవమున నేమొ
యూఁడి బదలించుచున్నవి యోమరాళి। యధరసుధఁ దేర్చు మని వేఁడు మామృగాక్షి"
యనిచదువునంత గొబ్బున నజ్జి సుకుమారి। పుత్రి సఖిచేతి పత్రికఁ బుచ్చుకొనియె. ౧౩౯.

ఉత్సాహ. పుచ్చుకొనుడుఁ బెనఁగఁబోక బోటి చేయి వదలి పో
నిచ్చి నాకుఁ జదువఁ దగద యింతనుండి మిక్కిలిన్
బచ్చిగాఁగ వలపు తేటపఱిచి వ్రాసినాఁడొ నీ
యిచ్చఁ జదువుకొనుము వెనుక నిపుడు దాఁచి నావుడున్. ౧౪౦.

వ. ప్రభావతి భావంబునం గోపలజ్జాలోలయగుచు లేఖ వలిపి వేయుం బోయిన రాగ వల్లరి పెక్కానలిడుచుం బడుచుఁదనంబును మనంబున నింతఘనంబుగాఁ బూని యున్న దానవే దానవేశ్వరతనూజా నీమోజ మేలు మేలు చాలుం బదివేలు వచ్చె నా చేతికిఁ దెమ్ము తేనేనిం బదిలంబుగాఁ బొదివి దాఁచుము మొదల నీయాకునకు నీకుం బని యేమి యనుమానంబుం జిమ్ముఖిపేరం బుత్తెంచినాఁ డింతియ యాశకుంతకాంత చూచుకొనకుండ మనలో మనమె యనుకొంచిన నది యెట్లుండు మనము దానితోడం జేసినప్రాణసఖ్యం బెట్టిది యగు గట్టిగ నింతవట్టు నీవ భావించి కొను మదియునుం గాక నీపోకపనూలినతనం బేమి చెప్ప వల్లభుఁ డు వాల్లభ్యంబు నెఱపి యనిపిన పత్రిక భాగ్యవతులు కులదేవతంబలెఁ బూజించి దాఁచుకొనుట యొప్పుఁ గాక యిట్టట్టు సేయుటకంటె నమంగళంబు గలదే యని యుపరమైచియు బుజ్జగించియు బోధించియు వారించె నంచయు నించుకదవ్వనన చిలుకం గూడ ముట్టి పదంబులం బొదిగి పట్టిన నది యిట్టు నట్టుం బెనంగుచుం గీచు కీచు మని యఱచుచుం జరణంబులు గఱచుచు రాక చీకాకు పఱిచిన రేసి యోసి గడుసుం బులుంగ రొమెలింగించి చావక వేవేగ నావెంట రమ్ము యెక్కలలో దాఁచుకొని యెక్క డెక్కడిలేఖ లెక్కడికి నడుపుచున్న దానవు రక్కసులతేనియాఁడుబిడ్డ నిన్నుం బట్టి తెచ్చునందాఁక నదె కదల కున్నది యనిన నది యిట్లనియె. ౧౮౧.

క. చంపినఁ జంపుము నన్నటు। గొంపోకుండినను జాలు కొనసర కదయుతక
జంపిన నన్నొకటిన మఱి। కొంపోయిన నెంద యిట్లగుదురో యొఱుఁగక.

వ. అమటయు. ౧౮౩.

క. నిను విడిచినఁ గొంపోయినఁ। బనికొదవలు లేమి సరియె పత్రిక చేఁ జి
క్కినయది నీ వింక నీడిగి।లిన నొచ్చుట మీఁది మిక్కిలి వివేకింపక. ౧౮౪

గీ. వచ్చితేనియు విను ప్రభావతిమనమున। కెట్టిగతి నైన దయపుట్ట నేను జెప్పి
నిన్ను విడిపింతు ననుమఁ దన్విడక బలిమిఁ।గొని చనంగ మరాళి కిట్లనియెఁ జిలుక.

ఉ. ఏల చలంబు నీ వడిగెదేని వచించెద నాదుగోప్యముం
బేలవె యార్చి తేళ్ళఁ దలఁబెట్ట రహస్యము దప్పు నన్నచోఁ
దాలిమిఁ గప్పి పుచ్చినను దద్గుణ మొక్కొకచో ఫలించు నా
పేళబపంచు సేయు నొకవీనముఁ గల్గదు హింస తప్పదుక. ౧౮౬.

సీ. కావున నొకవివిక్తస్థలంబున నిల్పి వినుము నాత ప్పెల్ల వినినవెనుక
నీకుఁ దోఁచినయట్లు నైకొని చేయుదు గాని నావుకు హంసకాంత దనకు
నప్పటి కదియు కార్యముగ వివేకించి చుట్టుపట్టుల నెందుఁ జెట్టు చేమ
లేక యొప్పెడునొక్కలీలామహీధరశిఖరంబుపై నిల్పి చిలుకఁ దనదు

పక్షముల బల్మిఁ బట్టి యీపత్త్రికాప్రకార మేమియు నీ వింకఁ గడమపెట్ట
కంతయును నాకు నెఱిఁగింపుమనుచుఁ బలికె నంచ తొయ్యలి కదియు నిట్లనుచుఁ జెప్పె.

క. ద్వారక యను పురమున నొక కారణమున నేఁగి నేను గ్రమ్మఱి రాఁగాఁ
జారుతరమూర్తి యొకఁ డొక యారామములో నతివ్యథాకులుఁ డగుచున్. ౧౪౯.

సీ. కృప నెఱిఁగింపరే కీరోత్తములార వజ్రపురికిఁ బోవువారె మీరు
సదనుగ్రహమునఁ దుమ్మెదలార చెప్పరే వజ్రపురికిఁ బోవువారె మీరు
కరుణతో వినిపింపఁ గదరె కోయిలలార వజ్రపురికిఁ బోవువారె మీరు
తెలుపరే దయఁ జూచి మలయవాయువులార వజ్రపురికిఁ బోవువారె మీరు
చలువ లొసఁగెడు మేఘరాజంబులార యమలపక్షత నొప్పు రాయంచలార
నిలిచి నామాటలకు మాఱు పలుకరయ్య వజ్రపురికిని బోయెదువారె మీరు.

వ. అని కన్నకన్నవారి నెల్లఁ బ్రార్థించుచుండ విని దయ పుట్టి యేల పలవరించెదు వజ్ర
పురంబునకు నేఁ బోయెదు దాన నావలన నయ్యెడు కార్యంబుఁ జెప్పు మనిన నత్యా
దరం బై. ౧౫౦.

శా. శ్రౌతస్మార్తపథానువర్తనపరిష్కారాత్మవర్ణాశ్రమ
స్ఫీతాచారపవిత్రమూర్తి శమగాంభీర్యక్షమానత్యని
ష్ఠాతుష్ట్యాదిగుణోరుకీర్తి సముదంచన్నీతివిద్యామహా
చాతుర్యాపరకావ్యుఁ డార్యజనతాసంభావ్యుఁ డత్యంతమున్. ౧౫౧.

క. చారిమకారిమహత్తర గౌరిమహారిమహనీయగాఢయశుఁడు గం
భీరమదారినిషూదుఁడు భూరిమదారిమహిమవ్యపోహకుఁ డెపుడున్. ౧౫౨.

స్రగ్విణి. ఇందుపూతత్రతాయీతనూజార్థరాణ్ణందనస్వాంతభూ నైషధశ్లాసుతా
మందసౌందర్యసంస్కారకాకారసంస్పందితశ్రీధృతిప్రాభవుం డెంతయున్.

గద్యము. ఇది నిఖిలసూరిలోకాంగీకారతరంగితకవిత్వవైభవ పింగళి
యమరనార్యతనూభవ సౌజన్యజేయ సూరయనామధేయ ప్రణీతం
బైన ప్రభావతీప్రద్యుమ్నం బను మహాప్రబంధంబునందుఁ
దృతీయాశ్వాసము.



# చతుర్థాశ్వాసము.



క. శ్రీరుచిరతరుఁడు విమలా।చారధురంధరుఁడు సుకవిసముదయగోష్ఠీ
పారస్యపరుఁడు పింగలి। సూరనయమరార్యవరుఁడు సురగురుఁ డుక్తిన్. ౧.

వ. ఆరామవర్తి యైనకుమారోత్తముండు నన్నుం జూచి యోచిలుకలకులభూషణంబ నాకు నీవలన నయ్యెడుప్రయోజనంబు విను మావజ్రపురంబున శుచిముఖి యను రాజహంసి గలదు దాని నరసి యొక్కలేఖ యందింపవలయు ననియె నే నతనియతిదైన్యాతిభారంబు భావించి కారుణ్యపరవశత్వంబు నొందినదాననై తక్కినయాగాములు లెక్కసేయక యాకన్యహంసి కిచ్చుటింతియ కదా యని కొంచుఁబోయిన నెంత తప్పు వాటిల్లెడు ననుతలంపున నియ్యకొని యయ్యాకు పత్త్రంబులోన లీనంబుగాఁ గట్టించుకొని వచ్చి యిప్పు డప్పువ్వుఁదోఁటలోనికొలంకులు కలహంసకులకలకలాకులంబు లగుటయుఁ దత్కన్యకావరిచయంబున నున్ననిన్నుఁ బరికించి. ౨.

గీ. ఇచట శుచిముఖి యనుహంసియాగడ యొక
కొంత దొరకునో యంచు నక్కుజమునందు
నొయ్య నిలిచితి నంతనె యురిని దగులు
కొంటి లోనైతి నీపాట్లకు న్మరాళి. ౩.

వ. అని చెప్పుటయు. ౪.

క. తనకార్యము యది యగుటకు। ననయము ముద మొదవ మదిన యడఁచి యిది యెఱిం
గినయది యింతియ కావల।యును బత్రికచంద మింత యొనరునె యనుచున్. ౫.

వ. కావున నింక నీపత్రికాప్రసంగంబు నిస్సారంబుగాఁ బోనాడి ప్రసంగాంతరంబున మఱపించి విడిచెద నని హంసి చిలుక కిట్లనియె. ౬.

గీ. పక్షిపేర వ్రాసి పత్రిక యనిపెడు। నట్టివాఁడు భ్రాంతుఁ డగుట ధ్రువము
నా కతం డనిపినయాకన్య యెట్లుండె। నేమి మిగుల నొరసి యేల యడుగ. ౭.

క. నీ వాపురికిని మొదలం। బోవం బని యేమి చెప్పుము యథార్థముగా
నావుడును నీళ్ళు నములుచు। నావిహగము చెప్పఁ గొంక నంచయు దానిన్. ౮.

గీ. బిగియఁబట్టి యెందు బెణఁక నీ కడిగె నే।యర్థ మిందుఁ గలదొ యనుతలఁపున
జడియ కదియుఁ జత్తు నరిపోదు మాటపట్టిక చెప్ప ననుచు వీఁక నుండె, ౯.

గీ. నవనిధానములును దవిలి యిచ్చిన నైన। మెడలమీఁదఁ గత్తి యిడిన నైనఁ
జాల రనఘచరితు లేలినవారిర।హస్యభంగమునకు ననుమతింప. ౧౦

వ. హంసియు దాని కడిగినమాటప ట్టిచ్చి నదియు ని ట్లని చెప్పె. ౧౧

క. విను వజ్రనాభుతమ్ముఁడు। సునాభుఁ డనుఘోరరాక్షసుండు గలఁడు త
త్తనయలు గల రిద్దఱు సొబ।గున నధికలు చంద్రవతియు గుణవతియు ననన్. ౧౨

చ. అతఁ డొకనాఁడు నారదు విహారవశంబున నాత్మసత్సభా
గతుఁ డగువాని సద్వినయగౌరవపూజలఁ దన్పి సౌవిద
ప్రతతులఁ గూర్చి లోపలికిఁ బంచెను దేవుఁ డక్కుమారికా
ద్వితయము మ్రొక్కి రాతనికి దీవన లందుట కై వినీతితోన్. ౧౩

సీ. ఇవ్విధమ్మున నమ్మునీశ్వరుఁ బూజించి యతనిచే నాశీర్వాద మందుటకును
దనయింతిపురమునవారిని సునాభుఁడు నియమించి పంచినఁ బరమేష్ఠిసుతుని
గాంచును వివిధోపచారపూజలచేత సంతుష్టుఁ జేయుచోఁ జంద్రవతియు
గుణవతియును భక్తిఁ బ్రణమిల్లఁ బతిమనోవల్లభ లై పుత్రవతుల రగుడు
నొప్పఁ దనుమని దీవించె నప్పు డచటి। దాదు లోమునివర్య యీతలిరుఁబోండ్ల
కధిపు లెవ్వారు వారల నానతిండు। నావుడును గొంత చింతించి నారదుండు. ౧౪

మత్తకోకిల. వీరి కిమ్మడికిం గ్రమంబున విస్ఫురద్గుణశోభితు
ల్వారిజాననగాత్రలును ల్యాదవంశజు ల్గదసాంబు ల
న్వారు నాథులు గాఁ గలా రని వారి కానతి యిచ్చె న
న్నారదోక్తికి వారు చిత్తమున వ్విచారము నందిరన్. ౧౫

గీ. కుడిచి కూర్చుండి వెతఁ దెచ్చుకొంటి వెుకటి।యిన్న నెక్కడిద్వారక యెక్కడిగ
సాంబు లివి విన్నఁ బెనుచేటు స్వామిచేత। ననురలకుఁ బగవీడఁట యాపురంబు.

చ. అని తమలోనఁ దారడఁచి రాపలు కెందును నుబ్బుసుండ న
ద్దనుజవరేణ్యకన్యకలు తాపసవాక్యము విన్నయాదిగా
మనమునఁ గూర్మి హెచ్చి నియమంబులు నోములు దానధర్మన
ర్తనలుఁ గరంబు సల్పుదురు తద్గదసాంబశుభంబె కోరుచున్. ౧

చ. క్రమమున భోగయోగ్య మగుప్రాయము నిండుచు రాఁగ భర్తృసం
గమనమునందుఁ గోర్కులు నతిగాఢముగాఁగఁ బతిప్రవృత్తిలా
భము గను టవ్వగా నలసి బాలిక లిద్దఱు తద్దయున్ గత
క్షమఁ గుసుమాస్త్రబాణములఁ గాంతియె చిక్కఁగఁ జిక్కి రే మనన్. ౧౮

ఉ. అచ్చపలాక్షు లిద్దఱును నర్మిలిఁ బెంచియుఁ బల్కు నేర్పియున్
ముచ్చటకాపుగాఁ దమవినోదపు నెచ్చెలిగా నను న్గదున్

మీచేత వెళ్ళ నాడించుకొని మీ కుపకారం బెక్కించి విడుచుటకు వచ్చిన దని చెప్పి తత్ప్రార్థనావశీకృతహృదయ యగుహంసిచేత విడువంబడి యేను బోయినకార్యంబు వివరించెద నని వారల వేరువేరం జేరు గ్రుచ్చి యి ట్లనియె. ౩౧.

గీ. చంద్రవతి నీమప్రాణేశుఁ డింద్రనిభుఁడు
గదుఁడు ద్వారక నున్నాఁడు ముదముతోడ
గుణవతీ నీదుప్రియుఁడు సాద్గుణ్యరాశి
తనరుచున్నాఁడు సాంబుఁ డెంతయు శుభమున. ౩౨.

క. ప్రకటితచాతురి నారా।జకుమారులతోడ నుచితసమయముల న్న
చ్చిక చేసితి· నేఁ గ్రమమున। నొకఁ డెఱుఁగక యుండ నొకనియొద్దకుఁ జనుచున్.

క. విదితము చేసితి మీమీ। హృదయేశుల కంత మీయభీష్టము తెఱఁగుల్
తుద నంతయుఁ దెలిపితి మీ। బ్రదుకులతదుపేక్షణైకపర్యంతతయున్. ౩౪.

గీ. వారు నేయుపాయములను వదలక వరి।యించువారైరి మిమ్ము మీ రింతలోన
ధృతి వదల నిత్తురే నాత్మహతియ కాక। పతిహననపాతకముఁ గల్గఁ బల్కి రపుడు.

సీ. అని చెప్పుటయు విని యాకన్యకలు గరంబులఁ గర్ణయుగళంబు మూసికొనుచుఁ
దమ కంత యే లగుఁ దాము దీర్ఘాయురన్వితు లగుదురు గాక యతివియోగ
వనరాశి నేమును మునుఁగక తమమాటయాన పెన్దెప్పగా నచల మైన
తాల్మి నీఁదుచు నుండెదము తమ కస్మదీయప్రాణసంరక్షయందుఁ దగిన
త్రోవ మాభాగ్యవశమునఁ దోఁచుదాఁక। నోర్చుటయ కాక తమకింప యుక్త మగునె
యని పలికి యూరకుండిన నంచచెలువ। వారి కిట్లను సముచితవాక్యసరణి. ౩౬.

క. మీపతు లిట వచ్చుట కుచి।తోపాయము మిగులఁ దడయ కొక్కటి తగ నే
నాపాదించెద మీరలు। నాపై దయ మఱవకుఁడు మనంబులయందున్. ౩౭.

వ. ఏను బ్రభావతికిఁ బ్రాణసఖి నై యుండుదుఁ గావున నాచెలువపనుపున నీచిలుక నిట్లు దగులుకొని వచ్చితి నిది నిమిత్తంబుగా నైన మీతోడిమైత్రి దొరకె నింక నిక్కడ మిక్కిలిం దడయఁ దగదు పోయి వచ్చెద నచ్చట నిచ్చటిరహస్యంబు వెలి వోవ నీక తగినయుత్తరం బిచ్చి కప్పి పుచ్చెద నిచ్చలంపుమనంబుల నుండుం డని పలికి యామాటల కత్యంతసంతుష్టాంతరంగ లగునాయంగనల వీడ్కొని వజ్రనాభతనయకడకు నరుగు దెంచి యి ట్లనియె. ౩౮.

క. చెలువా నీసౌభాగ్యపు। విలసనము కదమ్మ యెచట వీక్షించిన వ
ర్మిలి నీపతి నీకై చిం।తిలి యనిపినలేఖ యఁట కదే తెలియంగన్. ౩౯.

వ. అనిన నక్కన్యకారత్నంబు నవ్వుచు ని ట్లనియె. ౪౦.

క. అడుగఁగ వలసినయది యే। నడుగుదు విశదముగ మొదల నాచిలుక యదె
క్కడిది యిటఁ దేక యేటికి। విడిచితి నీకడుపు కందవిత్తుగ హంసీ. ౪౧.

వ. అనుటయు శుచిముఖి యిట్లనియె. ౪౨.

క. నీపతి నీకై కుందుచు। నా పేరను శేఖ యనిపినాఁ డని యిది యే
నాపులుఁగువలనఁ దెలిసి ము। దాపూర్ణత నుబ్బి విడిచి యనిపితి దానిన్. ౪౩.

క. మన కిమ్మనుచు నతం డని।చినపత్రిక దొరకె నొరులచేఁ బడ కిదియే
మనకుం బదివే లెట్లట। చన నిమ్మాచిలుక తద్విచారం జేలా. ౪౪.

సీ. అని రాగవల్లరిఁ గనుఁగొని యాపత్రికార్థ మే విన్నట్లె యగుఁ గదమ్మ
చదువుకొంటిరె యన్న నది తాను జదివినయంతయుఁ జెప్పి నన్నవలఁ జదువ
నీక తా నొడిసి యాయాకు బలిమిఁ బుచ్చుకొనియె నీపదు చన విని మరాళి
యటమీఁదఁ దెలియ నాయము కాదు మనకు ననన్యప్రకాశనీయంబు లైన
ప్రేమభంగులఁ దా నేమి యేమి వ్రాసి। యనిపినాఁడో కదుర్ రహస్యంబు గాఁగ
నట్టియాకాముకునికూర్మి లతనిసతియె। చదువుకొని మోదసంపదఁ బొదలనిమ్ము.

క. ఓవనిత లేఖలోనఁ బ్ర।భావతి యనఁబోయి ప్రప్రభాభావతి యం
చీవిధమున వ్రాసినభ్రాం।త్యావిష్టుం డేమి వ్రాయఁ డమితపుఁగూర్మిన్. ౪౬.

క. వెఱఁ గయ్యెడు నే నపు డీ।తరుణిగుణంబులు నుతింపఁ దాను విరక్తి
స్థిరునట్ల యుండి తోడనె। విరహార్తుఁడ నైతి ననుట వివరింపఁ జెలీ. ౪౭.

క. ప్రాయపువాఁ డఁట సదృశ। శ్రీయుక్తిఁ దలిర్చు బిత్తరి న్వినునఁట యా
హా యాతనియాత్మ యిను మొ।ఱాయో కులిశంబొ నెటి దొలంగక యుండన్. ౪౮.

వ. అదియునుం గాక. ౪౯.

గీ. సకలసౌభాగ్యభాగ్యలక్షణగుణైక
ఖని ప్రభావతి సిద్ధసంకల్ప గాక
యుండునేని శాస్త్రము లిన్నియును బుధులకుఁ
బ్రత్యయానర్హతను వృథాభరమె కావె. ౫౦.

వ. అనినఁ బ్రభావతి దాని కిట్లనియె. ౫౧.

సీ. ఇపు డేమి గంటి నా కెక్కడిసిద్ధసంకల్పత గుమ్మడికాయలోన
నావగింజయుఁ బోదు హంసి నాచింతాభరంబులో లేశమాత్రము నుడుగుట
గలదె యీవేళకుఁ దలపోసి చూచినఁ దా దృశాశ్చర్యసౌందర్యకోమ
లాంగుఁ డవ్విభుఁడు నా కై యెంత యలసెనో యెంత కుందెనో యనునిట్టివెరయు

నొకటి తొంటికంటె విశేష మొదవె నేఁడు।దీనిఁ దరియింప నీకు నెద్ది తెరువుచెపుమ యసురపతి యొల్లఁ డాతని నుల్లఁదనము। పుర మితనియాజ్ఞ లేక ట్లుఁ జొరఁగ రాదు.

వ. అనుటయు శుచిముఖి ప్రభావతి కి ట్లనియె నోపువ్వుఁబోఁడి నీపలికినయంతయుఁ దప్పదు నీవిభు నిరాకకు నాకవిరోధియను మతి సాధించుటకు నుపాయం బొక్కటి గలదు దాని నేన యెఱుంగుదు నీకు ననువైనసమయంబున నన్ను నరనకథా కథనప్రవీణ యనియును సకలవిద్యాధురీణ యనియును ప్రభువుల నుబుసుపుచ్చి మెచ్చింప నేర్చు ననియును నిచ్చకు వచ్చునట్లుగా భవజ్జనకునకుం జెప్పి సమ్ముఖంబునకు రప్పించుకొనునట్లుగాఁ జేయుము మఱిమీఁదటి కార్యంబునకు దైవంబు గలదు పోయి వచ్చెద నిచ్చటికొలంకులన యుండెదఁ జామీ మాటపడిన పిలిపింతు గాని యనుచు నా రిద్దఱు వీడ్కొని నిజేచ్ఛం జనియెఁ బ్రభావతియు సఖీసహిత యై గృహంబున కరిగె నంత నక్కాంత యొక్కనమయంబున. ౪౩.

చ. వెలుపలికొల్వు వీడ్కొలిపి విశ్రుతతేజుఁడు వజ్రనాభుఁ డిం
పలరఁగ రాణివాసమున నాడెడిపాడెడిపువ్వుఁబోండ్లసే
వలు గొనుచుండఁ జేరి తగునర్తన నొప్పుచుఁ దన్నుఁ దండ్రి య
త్సలతయు గారవంబు వెసచల్లనిమాటల నాదరింపఁగన్. ౪౪.

వ. తదీయరత్నసింహాసనసమీపంబునఁ బ్రవర్తిల్లుచు నల్లన ప్రసంగంబు దిగిచి సవి నయమధురభాషణంబుల ని ట్లనియె. ౪౫.

క. మనబొడ్డనబావులలో। ననుదినముఁ జరించునంచలం దొకహంసాం
గన యేమిచెప్పఁ దండ్రీ। కని విని నే నెందు నెఱుఁగ గని విద్యలకున్. ౪౬.

చ. శుచిముఖి యాంద్రదు దానిని వచోనిపుణత్వమునందు నత్కథా
రచనలయందు నీతివిదురత్వమునందు బహుశ్రవావలో
కచణతయందు నెందు నరి గానము దానికి వేయు నేల దా
నిచతురతావిశేషములు నీవ కన న్వలయు న్మహాత్మకా. ౪౭.

గీ. అనుడు నాదైత్యపతి తనయనుఁగుఁగూఁతు।మాట లాకముద్దు సేయుచు బోటిఁబిలిచి
యమ్మ రప్పింపవే చూత మమ్మరాళి। ననియె నింతియు రప్పించె హంసి నపుడ.

వ. రప్పించి ముందట నిడుకొని శుచిముఖీ నీదువిద్యావిలసనంబు విన్నవించిన నయ్యది వినవలయు నని వేడుక పడుచున్నవాఁడు శాస్త్రప్రసంగంబు సేయు మనిన నదియును. ౪౯.

క. వీనులకు సుధారసముల। సోనలు వర్షించుమృదులసుస్వరఘటితిం
దా నిట్టటు ప్రసక్తిక పని।లేనిపునఃపదము లిడక లీల దలిర్పన్. ౫౦.

శా. కాణాదంబును గౌతమీయమును సాంఖ్యంబుఁ భుజంగాగ్రణీ
వాణీమార్గము జైమినీయమతముఁ వ్యాసోక్తశాస్త్రంబు వ
క్కాణించెం గడుఁ బూర్వపక్షములు బోకం బెంచుచు న్బెంచి య
క్షీణప్రౌఢిఁ దిరస్కరింపుచుఁ దదీయ సిద్ధాంతము ల్నిల్పుచుఁ. ౬౧.

మ. స్వమతిప్రౌఢి దృఢానుమానముల సంస్థాపించు నేవేళ నె
ద్ది మతం బప్పుడు దానివానికి నుపాధిగ్రస్తతావ్యాప్తిభం
గముఖానేకనుదూషణంబులు వెసం గల్పించుఁ దానన్యశా
స్త్రమతస్థాపనవేళ నవ్విహగి దైత్యశ్రేష్ఠుఁ డోహో యనన్. ౬౨.

వ. మఱియును. ౬౩.

గీ. కావ్యనాటకాలంకారగానమదన।శాస్త్రపరిచయమహిమంబు జాలపాద
భామినీమణి నెఱపె నుద్దామపటిమ। నాయసురభర్త మెచ్చి భళిరె యనంగ. ౬౪.

వ. అంత నద్దనుజనాయకుండు శుచిముఖీముఖం బవలోకించి నీవును నాదిగంతచారి
ణివి నీ కనినయద్భుతంబు లేమేనియుం గలిగిన నెఱింగింపు మనవుడు నాయంచ
యించుక విచారించుట యభినయించి యి ట్లనియె. ౬౫.

గీ. కనినచోద్యంబు లెన్నియో గలవు వాని। నేమి చెప్పుదు నందులో నెల్ల నాకు
నతివిచిత్రమై తోఁచినయది నిశాచ।రాధిప వచింతు నొక్కటి యవధరింపు. ౬౬.

గీ. నటుఁ డొకండు భద్రనాముండు మున్నొక్క।చోటఁ దాపసనభ నాటనేర్పు
వలన మెచ్చఁ జేసి వరముగా నత్యద్భు।తంపునాట్యపటిమ పెంపు వడసి. ౬౭.

సీ. ఏడుదీవులఁ జరియించుచు నున్నవాఁ డని చెప్పి యతనినాట్యములవేళఁ
గలయట్టియద్భుతంబులు సర్వమును సవిస్తరముగ వినిపింప దానవేంద్రుఁ
డాశ్చర్యకౌతుకాయత్తాత్ముఁ డగుచు నేనును గొంత కొంత యాతని నెఱుంగు
విని చూడవలయు నన్వేడుక నుండుదు నీవు ప్రవీణ వన్నిటను హంసి
యానటుని నిచ్చటికిఁ దెచ్చితేని మెచ్చు।గలదు నీ కని ప్రేమతోఁ బలికె నదియు
నట్ల చేసెద నని దనుజాధినాథు। వీడ్కొని ప్రభావతిని జూచి వినయ మొప్ప. ౬౮.

ఉత్సాహ. అనిపె దేమ ముదంబుతోడ నమ్మ పోయి వత్తునా
యనుడు నదియుఁ గొన్నియడుగు లనుప నేగుదేర నో
వనరుహాక్షి యింతయు న్భవత్ప్రియార్థమే సుమీ
మనమునందు నిది యెఱింగి మైత్రి మఱవ కుండుమీ. ౬౯.

వ. అనుచు గూఢవృత్తిఁ దదిష్టసాధనపరత సూచించి యనిపించుకొని ద్వారకానగ
రంబునకుం బోయి తాను వజ్రనాభుచేత భద్రనామధేయనటునిం దోడ్కొని తెచ్చు

టకు నియుక్త యగుట కృష్ణుని కెఱింగించి వజ్రనాభానుజుం డగుసునాభునికూ
తులు గదసాంబులకు భార్యలుగాఁ గల రని నారదవచనంబులకలిమి చెప్పి ప్రద్యు
మ్నున కసురజయసాహాయ్యకంబు నడుప గదసాంబు లరుగువా రని నిశ్చయించి
యాచక్రధరునినిశ్చయంబు విని యది తదీయశాసనంబున వాసవునకు విన్నవిం
చివంబునకుం జనుచుం బ్రద్యుమ్ను నింటి కరిగి యప్పు డతండు ప్రభావతీవియోగత
పాతిభారంబున నసురుసు రగుచు మిగుల నొగిలి తదుదంతచింతం జేసి నిజాగమనం
కోరుచున్నవాఁడు గావున నతనిచేత నతిమాత్రాదరగౌరవంబు వడసి యేకత
బున నతనితోడ. ౭౦

సీ. ఒకచిల్క చేతఁ బత్రిక యంచితే నాకు ననిచితి నది నీకు నందె వోకో
యనుచు నెవ్వరిఁగూర్చి యది వారికిని జేరె నాయింతికి శుభంబె హంసరమణి
నాలేఖ యందుట నామాట యన వచ్చు మున్నట్టికోదవ రా మూల మెద్ది
పత్రిక కదు దైన్య పడి నీవు పంచు ట ట్లాకాంతపై నెంతహాళికలిమి
నానతియు భవద్విరహాగ్ని నంత గుందె। నన్ను నెఱుఁగుట యెట్లుము వ్యాంఛ సేసి
శివ లిఖించి యిచ్చినది నీచెలువు దాని। కేమిటికి నిచ్చె వరుఁడు నీ కీతఁ డనుచు. ౭౦

మ. అనుచు న్నాటుమ మాటగా వరుసతో హంసీకులోత్తంస మా
తనికిం దైత్యతనూజకోర్కి తెఱఁగుం దన్మూలముం జెప్పి యి
ట్లను నేనీ కిది నాఁడె తెల్పుటకుఁ గాదా చేసితి జ్ఞాలఁ ద
ద్ఘనశోభాస్తుతి నీ వొకించుకయుఁ జిత్తం బీమిఁ జాలించితిన్. ౭

వ. ఆప్రభావతి నన్ను నత్యంతప్రియసఖింగా నడుపుకొన్నది గావున దానిగుట్టెం
కయు నే నెఱుంగనియది లేదు కనియు వినియు సమస్తంబు వాకళించినదా
నని యతనికి భవానీకృపానుగ్రహపత్రిప్రకారంబు నకలంబునుం దెలిపి ం
ట్లనియె. ౭

చ. భవదమలాకృతిప్రతిమఁ బర్వినయప్పుడు చూపు క్రమ్మఱన్
దివఁ గదలింప రాక సుదతి న్గతచేష్టితఁ జేసె నోయదు
ప్రవరుఁడ యేమి చెప్పుదును రాగకుతూహలవిస్మయాతిగౌ
రవమున నెంతప్రేఁ గగుచు రాపడి యుండెనొ కాని యత్తఱిన్. ౭

చ. కొనరక చూపుచేతఁ గడుఁ గ్రోలిననీచెలువంబు చెల్వమా
నసమున నెంత మిక్కిలి ఘనంబుగ హత్తెనొ కాని యప్పుడో
రసికశిఖావతంస యదురత్నమ కాకరకాయరీతిఁగాఁ
గినలయుపాణిచన్నుఁగవక్రేవ గగుర్పొడిచెం బొరిం బొరిన్. ౭

ఉ. వావిరి నెల్లప్రొద్దుఁ భవత్పరిరంభణచుంబనాదినా
నావిధభోగలీలకు మనంబున నువ్విళులూరు చున్క్రీ
డావతి దెల్పెఁ గొన్నినిశలం గను మూసినయంతమాత్రఁ బై
పై విలసిల్లుకుట్టమితభావవిశేషవిజృంభణంబులన్. ౭౭.

మ. కలలం గూడినవేళ నెట్టిపాలయల్కల్పుట్టెనో యేమి నీ
వలనం దప్పు ఘటిల్లెనో యెఱుఁగఁ దత్స్వప్నాగమామర్ష వి
హ్వలితస్వాంతయ పోలె నిద్ర నెఱయ న్వర్జించెఁ బద్మాక్షి య
త్తు లహోరాత్రములందుఁ బద్మకుముదస్ఫూర్తి న్విడంబింపఁగన్. ౭౮.

క. చిత్తజమహాగ్నికాఁకల। నెత్తు దఱిగి వన్నె యొక్క నెంతయు నెమ్మే
నత్తరుణికి జను లండఱుఁ। బుత్తడిబొమ్మ యనుమాట బొంకేల యగున్. ౭౯.

సీ. రోలంబనికురుంబనీలిమశ్రీఁ బోలె వేణి చుట్టుట కడు విరస మయ్యె
నమదకోకిలశుకస్వరసామ్యమునఁ బోలె సఖులసల్లాప మసహ్య మయ్యెఁ
బరిపూర్ణచంద్రబింబసమత్వమునఁ బోలె నిలువుటద్ద మదర్శనీయ మయ్యెఁ
బ్రసవాస్త్రవివిధమార్గణవర్ణధృతిఁ బోలె రత్నభూషాళి యగ్రాహ్య మయ్యె
వేయుఁ జెప్పఁగ నేల నీవిలసనంబు। లుల్లమునఁ దలపోయుట యొకటి దక్క
బహుదినంబులనుండి యాపడఁతి కితర। వస్తురుచు లన్నియును గానివావి యయ్యె.

క. వెదకికొని తానె యొంటు రా। మది సాహస మొంది కదలు మాటికి నీరూ
పెదుటఁ దన కంతఁ దోఁచిన। మదిరేక్షణ తత్తఱిలుచు మగుడున్ లజ్జన్. ౮౦.

క. ఆపడఁతి యడలఁ జేసెను। జూపఱ నవ్వు డేమి చెప్ప శోషిలుచుఁ గడున్
నీపత్రిక యానిమిషము। లోపల రా జేనిఁ బాటిలు దశాంతరమున్. ౮౧.

వ. ఆపత్రికయుపకారంబునుం దాత్కాలికస్థితికారణం బగుట యొక్కటియు కాని
యక్కన్యకు మిక్కిలిం దాపంబు గావించుచున్నయది యె ట్లంటేని. ౮౨.

క. క్రిందటిదినములు విరహదశ। కం దానలఁగుటయు కాని సరిగ నిపుడు నీ
వుం దన కై కుందుట విని। యిందుముఖికి నింక నిమిష మేఁ డై తోఁచున్. ౮౩.

ఉ. భావన చేసి చూడ క్షణభంగుర మింతులతాల్మి కల్మి వా
తావిలపల్లవాంచలహిమాంబుకణంబును నంతకం టె మే
ల్గావున నింక నెంత యవిలంబమునం గృప సేగి ప్రోచెదో
దేవరచిత్త మానతియదృష్టము వేయును జెప్ప నేటికిన్. ౮౪.

వ. అనిన విని యతండు. ౮౫.

క. గ్రక్కునఁ జని ప్రాణుదునో। ఱెక్కలు గట్టుకొని దివిజరిపుమేడలపై
నక్కొమ్మఁ జూచు టెపు డెపు। డొక్కొ యనునంతతమక మున్నది మదిలోన్.

గీ. ఏమి సేయుదు నాదైత్యునియ్యకోలు
లేక నీ కెవ్వరికిఁ జొరరాక యునికి
యరసి వేఁగుచు నున్నాఁడ నమరపతియు
హరియుఁ దలపోయుకార్య మే మయ్యెఁ జెపుమ. ౨౭

వ. అనిన శుచిముఖి యతనిం జూచి యోకుమారక నీకుఁ దత్పురప్రవేశచింత వలవదు తదుపాయంబు హరి నిశ్చయించుకొని యున్నవాఁడు వజ్రనాభవధకార్యంబునకు నేను భవదిష్టసాధనానుకూల్యంబు చింతించి నిన్నె యనుపునట్లుగాఁ జేసితి వాసుదేవుం డిపుడ యేతదర్థంబు నిన్నుఁ బిలిపించి యనుపుచున్నవాఁడు వజ్రికి నిది యెఱింగించి వజ్రపురంబున కరిగి యేనును దగినతెఱంగునం దావకీనకార్యానుగుణ్యంబు నడుపుచుండెద నని పలికి యతని వీడ్కొని చనియె నప్పుడు. ౨౮

సీ. అమరారికరులకుంభములు వ్రయ్యఁగ మొత్త రమణిచన్నులు నఖాగ్రముల నొత్త
సమదరాక్షసరథచక్రంబు లిలఁ గూల్పఁ గాంతశ్రోణికి నూడిగంబు సల్ప
నసురేంద్రజయశంఖ మవనిపై వ్రేయింపఁ గామినికంఠంబు గౌఁగిలింప
వజ్రనాభునిధనుర్వార్తలు గడతేర్పఁ బడఁతికన్బొమనంజ్ఞఁ బను లొనర్ప
దైత్యమెఱుఁగుఁదూపులు దళితములు సేయఁ
దత్తనూజచూపులు ఫలితములు సేయ
నుదుటుఁదనమును వలపు నొండొంటితోడ
దంటగొని క్రమ్మ నెమ్మది దాల్చె నతఁడు. ౨౯

సీ. అంతట గోవిందుఁ డతనుని గదసాంబులను బిలిపించి యలంఘ్యదర్ప
వజ్రనాభుని బ్రహ్మవరబలోద్ధతుని దేవహితార్థమై త్రుంపవలయుటయును
దన్మహత్త్వంబును దత్పట్టణప్రవేశం బన్యులకు నసాధ్యం బగుటయుఁ
దాను మరాలిచేఁ దగ ఘటింపించినతదుపాయమును విశదముగఁ జెప్పి
యందు రుక్మిణిసుతుఁడు భద్రాఖ్యురూపు
గదుఁడు పారిపార్శ్వకునియాకారము మఱి
సాంబుఁడు విదూషకునిప్రకారంబుఁ దాల్చి
చనఁగ నియమించి పంచెను దనుజపురికి. ౩౦

గీ. ఆముగురు పరస్పరావిదితస్వప్రియాంగనాసమాగమానుగుణతఁ
బ్రమద మొంది రపుడు ప్రత్యేక మీయాత్ర। నాదుభాగ్యవిలస నంబ యనుచు.

సీ. మనముల నిట్టులుబ్బుచును నటవేషంబు ధరియించి తమకును దగినయట్టి
వారసీమంతినీవ్రాతంబు గొలువ వైణికవైణవికమార్దంగికజనాది

నాట్యసామగ్రి మున్ భద్రున కెట్టిది యట్టిద యై కనుపట్టుచుండఁ
గదలి యుక్తోచితగతిఁ బయనంబులు వర్తిల్లఁగా నేగి వజ్రపురము
ప్రాంతమునను శాఖానగరములయందు। విరివి చూపట్ట మేళంబు విడిసి విడిసి
యతివిచిత్రంబు లగుతమయాట నేర్పు। లెల్ల నెఱపిరి కడువార్త కెక్కుచుండ.

క. దనుజేంద్రుఁడు తద్వార్తలు। వినుచున్ హృదయమునఁ బొదలువేడుకతో వా
రిని బిలిపించెను వారును। జని యాదనుజునకు నుచితసమయమునందున్. ౯౩.

క. తమనాట్యవిద్యఁ జూపఁగ। నమకట్టి తదర్హమైనసన్నాహవిశే
షముతోడ నేగుదెంచిరి। రమణ దలిర్పంగ నృత్యరంగస్థలికిన్. ౯౪.

వ. శుచిముఖి యటమున్న తనపలికినక్రమంబున వచ్చి వజ్రనాభునియాదరంబు వడసి ప్రవర్తిల్లుచుం బ్రభావతికిం జంద్రవతీగుణవతులకుం దత్పతులరాక తెఱం గెఱింగించి వియోగతాపంబున మిగుల నొగులకుండఁ దదాశాశీతలోపచారంబున సేద దేర్చుచు నుండి యప్పుడ యేతెంచినప్రద్యుమ్నునకు క్షణక్షణప్రవర్ధమానప్రభావతీరాగవృత్తాంతంబున నౌత్సుక్యంబుఁ బెనుచుచు నతిగూఢంబుగా రాకపోకలు గావింపు చునికిం జేసి యతనితోడ నేఁడు నీహృదయవల్లభ నీనాట్యంబు చూడ వచ్చు నని చెప్పి తదాగమనీయహర్మ్యస్థలంబునుం జూపి పోయె నంత. ౯౫.

సీ. వజ్రనాభుఁడు రాజ్యవైభవం బెంతయు మెఱసి నానాబంధుమిత్రసచివ
సంఘంబుతోడ నాస్థానమహామంటపమునందు నొడ్డోలగమున నుండి
పరులదృష్టికి నగోచర మగుసంవృతస్థలి నిల్చి రాణివాసపుజనంబు
చూచునట్లుగఁ జేసి సొంపారువేడ్కతో సావధానస్వాంతుఁ డగుచుఁ జూడ
సంవిహితరంగమంగళాచారుఁ డగుచు। సురహితముగ మాయానాట్యసూత్రధార
వృత్తి గైకొని శంబరద్వేషి యొనరెఁ। బూర్వరంగప్రవర్తన పొందు పఱుప. ౯౬.

వ. అప్పుడు. ౯౭.

శా. గాంధారప్రముఖస్వరశ్రుతికళాగంభీరవారాంగనా
గాంధర్వంబు ఘనస్వనంబు తతనిక్వాణంబు వంశాదినం
బంధిస్వానపరంపరామహిమయున్ మద్దెళ్ళదిందింధిమిం
ధింధోంధిక్కిధిమిక్కిశబ్దభరమున్ దీపింప నాపూర్ణతన్. ౯౮.

సీ. సరవిఁ జంచత్పుటచాపపుటోద్ఘట్టషట్పితాపుత్రకసంజ్ఞ లమర
వెలయు చుండెడుసమవిషమతాళప్రవృత్తులు నాల్గు ప్రస్తారకలనవలనఁ
గలుగునానాతాళములు యథోక్తస్ఫూర్తిఁ బరఁగు నేలాదిప్రబంధచయముఁ
దత్తదర్హస్థానదత్తపటాక్షరబిరుదాదికాంగవిస్ఫురణ దనర

క్షితిఁ జతుర్దశముద్రిక గీతభేదములు దురాపము లంద్రు వర్తిలె నవియును
నిఖిలకళలును గలరౌక్మిణేయశిక్ష వలనఁ దన్నాట్యకర్మప్రవర్తనమున. ౯౯.

ఉ. ఆవనజాక్షనందనుఁడు నంతట నాందిదగం బఠించి యిం
పావహిలం బ్రరోచనయు నాముఖముం దనరార నొప్పఁ బ్ర
స్తావనతో ముఖాదులగు సంధులు సాంగతఁ బెంపు మీఱ గం
గావతరాదినాటకము లాడె ననేకము లద్భుతంబుగన్. ౧౦౦.

సీ. ఆనాటకప్రయోగావసరముల భగీరథాద్యాకారధారణమును
గంగాదినిమ్నగాగతియుఁ గైలాసాదినగకల్పనమును నానావనప్ర
పంచనంబును బహుపక్షిమృగాదిజంతువిశేషరూపవృత్తులును మఱియు
నెచటి కయ్యది యోగ్య మచటఁ దత్తద్వస్తుసృష్టి సన్నిదము వేసియును గృతక
మగుట నిశ్చయింపఁగ లేక యబ్రపడుచుఁ జూచి సామాజికులు తమసొమ్ము లెల్ల
నొసఁగులుగ నైవ వడుపుచు నొప్ప మీఱె రుక్మిణీసుతుం డుమాయానిరూఢి మెఱసి

వ. ఇవ్విధంబున నాత్మీయదివ్యమాయాప్రపంచనముదంచితనాట్యవంచితులం గావించి నక్తంచరులధనసంచయంబు నూఁచముట్టుగా దోఁచుకొనుచుం జూచు ఖేచరులకు వేడ్కఁ బుట్టించె. ౧౦౨.

మ. ప్రియకాంతామణిచూడ్కికిన్ నిజవపుఃశ్రీతోన తోఁచెన్ మహా
వయమాయానిధి రుక్మిణీసుతుఁడు నానాభూమికాధారణం
డయి భద్రుం డయి పొల్చె వేశ నహిమాయాయామసంభావ్య మ
న్తి యటంచు న్బుధు లాడుమాట మదిఁ జింతింపంగ బోం కేలగున్. ౧౦౩.

శా. ఆభవ్యుం డటమున్న కొక్కనెప మొప్పార న్మరాళీప్రది
ష్టాభిజ్ఞానగవాక్షలక్ష్యదమజాధ్యక్షాత్మజావక్త్రవి
క్షాభద్రంబును సారెకుం దనకుఁ గల్గం జేసికొంచున్ కన
ట్లాభామామణికిం బ్రభున్నుతివిలీనార్థంబుగా నిట్లనున్. ౧౦౪.

చ. సకలవిశేషశోభనకుఁ జాలినయోనెఱజాణ వజ్రనా
భ కులవతంసరత్నమ ప్రభావతిరోహితకంటకంబు తా
వక మగుచూపు నాపయిఁ బ్రవర్ధితరాగతఁ బర్వఁ గాన న
ర్త్యకలువవృత్తి నానుకృత మంతయు నేఁడు సుమీ ఫలించుటల్. ౧౦౫.

గీ. నీకు నామీఁదఁ గలయట్టినెయ్యమును మహాదరము నీవు పనిచినహంసి చెప్ప
నాత్మలో ననవరతనాట్యప్రసంగమున నిను భజించువేడుక ఘనము నాకు. ౧౦౬.

క. నను నేలికొను మవశ్యంబును నీయూడిగము చిత్తమున కెక్కఁగ నే
నొనరింతు నేఁటిలెమి నీమనమున నెంతయు నిడుకొనిమన్నింపఁ దగున్. ౧౦౭.

క. అన విని కపోలయుగళము।ఘనపులకితముగ మరల్చెఁ గ్రక్కున నాత్మా
ననము ప్రభావతి యాలో।కనజాలకమునకు నెగడఁ గడు లజ్జమెయిన్. ౧౦౮.

చ. అపుడు తదీయపార్శ్వగత యైనమరాళవధూటి దానవా
ధిపతనయం గనుంగొని మదిం గనుఁగొంటివె యాత్మనాథువా
క్యపదవిఁ దోఁచునట్టియితరార్థము సర్వము నాననాబ్జముం
ద్రిప నిటు ద్రిప్పి తింతి గరుదాల్చెఁ గపోలము చాల నావుడున్. ౧౦౯.

క. విచ్చలవిడి ననుఁ జేర్కొని। యిచ్చను గల దెల్లఁ బలికి యిది నేఁటినిశ
న్వచ్చెద ననుచున్నాఁ డిఁక। నిచ్చో మఱి యర్థ మెద్ది యితరము దీనన్. ౧౧౦.

క. ఎవ్వరు వినుటకుఁ గైకొనఁ। డివ్విభుఁ డిది యేమిభ్రాంతి యొత్తెనొకో నా
కెవ్విధి ప్రాప్తమొకో యని। నివ్వెఱ పడి యింతతడవు నిలిచితి వినుచున్. ౧౧౧.

వ. అనుడు శుచిముఖి యాళిముఖి నీక్షించి. ౧౧౨.

మ. అతివా యన్నిట జాణ నీవగుదు నీ కాచింత యుక్తంబు గా
దతఁ డర్థద్వితయోక్తి నీకు నుచితం బైనట్టు నీకు స్వభా
వతి కర్థాం బగురీతి నాతనికిఁ దోఁపం బల్కినాఁ డేది నీ
మతిఁ దోఁచెం బ్రకృతంబు గామిఁ బరు లాత్మం గాన రాయర్థమున్. ౧౧౩.

క. సకియా నానార్థోక్తుల। నొకనియమము తెలియు మర్థ ముచితం బెచ్చో
టికి నెద్ది యదియ యచ్చోఁ। బ్రకటము హరి శ్రీవిభుఁ డనుపల్కునఁ బోలెన్.

వ. కావున నీవల్లభుండు నిన్నుఁ బలికినపలుకు లన్యు లెఱిఁగిరో యనుశంక విడువు మతం డితరులకు నాట్యావసానసమయసముచితస్తోత్రప్రకరణబలంబునఁ దోఁచుచున్నయర్థాంతరంబుచేతఁ బ్రభువు నుపచరించి యిది యతనిచేతఁ దనవిడిదికి ననిపించుకొని చను చున్నవాఁ డని పలికి శుచిముఖి యంతం బలికినట్ల సేయు రాక్షసిఁ జేయుం జూపి తనతలంపు యథార్థం బగుట తార్కాణించె నట్లు విహగమహిళారహస్యసంభాషణరసానుభవంబున విభాసిల్లుప్రభావతియు రాగవల్లరీసహితంబుగా గృహంబున కరిగి ప్రియసమాగమత్వరమాణమానస యగుచునుండె నంత. ౧౧౫.

ఉ. ఎప్పుడు వచ్చుఁ గాంతుఁ డినుఁ డెప్పుడు గ్రుంకు నటంచు నాత్మలో
నుప్పిరిగొన్నరాగము సముత్కట మై కనుదోయి కుబ్బఁగాఁ
దొప్పఁగఁ దోఁగుచూడ్కిని వధూమణి సారెకుఁ జూడఁగాఁ జుమీ
యిప్పాలు పొందె నీతఁ డన హేళి క్రమంబునఁ దాల్చె రక్తిమన్. ౧౧౬.

ఉ. అంబుధిలోని కంతటను హంసుఁడు డిగ్గ దినాంతమజ్జనా
ర్థంబును బోలె నట్టియెడఁ దత్తటి నాఱఁగఁ గట్టినట్టిర

శ్తాంబరమో యనంగఁ దనరారెఁ గడుం గడనంజకీవి యం
తం బొడసూపెఁ దారకలు తత్పతనోద్గతబిందులో యనన్. ౧౧౭.

క. తోరపుఁజీఁకటు లంతన్। మారోత్సవకలనమునకు మదిఁ బొంగుచుఁ ది
గ్జారిజను లాడెడి క।స్తూరివసంతములయొప్పు చొప్పడ నెరసెన్. ౧౧౮.

వ. అంత. ౧౧౯.

క. ఐరావణకరికరధూ।త్కారవమఘ రేణుపటలి కైవడిఁ గుత్కీ
లారిదిశఁ దెలుపు తోఁచెను। దారలు ప్రథమోత్థబిందుతతిగతిఁ బరఁగెన్. ౧౨౦.

వ. తదనంతరంబ. ౧౨౧.

చ. తివిరి త్రియామకు న్సొగసు దిద్దికొనంగఁ బురోదిశాళి దా
గవిసెన వెల్వరించుమణికల్పితదర్పణమో యనంగఁ గై
రవకులబంధుమండలము రాజిలె నోలిని లియ్యమాన మై
మివుల్లఁ గళంకలక్ష్మ్యతఁ దమీప్రతిబింబము నంత నేర్పడన్. ౧౨౨.

గీ. తామరసలక్ష్ము లాచందమామరాకఁ। గలఁగుచును గుముదాళికై తొలఁగె నపుడు
తొలఁగుబావయె కాఁడె తమ్ముల వరించు।నట్టిసతులకు నతఁడు ము న్నెట్టిఁ డైన.

చ. పసపడ వేణునాళములఁ బగ్గములం బలెఁ గ్రిందఁ బర్వుశో
భనకిరణప్రకాండములు భాసిలఁ జందురుఁ డొప్పె నెంతయున్
మనసిజుఁ డెల్లప్రాణులమనంబులు చేలుగ రాగబీజము
ల్వెనుజతనంబుతోడ వెదఁ బెట్టెడుకాపుపుజడ్డుగం బనన్. ౧౨౩.

చ. వెల యనువెండికుండఁ గడు నించి నిశాఖ్యచకోరనేత్ర యిం
పలరఁగ నంబరాహ్వయమహానటమూర్తిమహాభిషేకమున్
జలుపఁగ నెల్లదిక్కుల వెసం బ్రవహించెడుపాలవెల్లి నాఁ
బొలిచె సమస్తముం జలువఁ బొంద నమందత సాంద్రచంద్రికల్. ౧౨౪.

చ. తొలఁకెడుహంసకాంతుల విధుద్యుతిఁ బ్రోచి చకోరమైత్రిజో
శలు మెఱయించుకన్నవలకల్కితనంబునఁ బుష్పలావికల్
తలఁపులు గొల్లలాడి మిగులం బ్రమయించి యువవ్రజంబుచే
వెల లధికంబుగాఁ గొనుచు వేడుక నమ్మిరి పువ్వు లంగడిన్. ౧౨౫.

గీ. అప్పుడు ప్రభావతికి నొక్కయతివ విరులు
గొనుచుఁ బోవఁగ నందు నింపునఁ జరించు
తేఁటి గమిలోనఁ దా నొక్కతేఁటి యగుచు
నేగె మాయాఘనుండు రతీశ్వరుండు. ౧౨౬.

వ. అటమున్న పతిసమాగమోత్సవసముత్సాహంబునం జేసి యపరాహ్ణంబుననుండియుం గ్రీడాభవనపర్యంకాదిసముచితనూతనసత్క్రియావిశేషసంపాదనంబునకుం దగినపరిచారికల నియోగించుచున్న ప్రభావతిమనోరథం బెఱింగి రాగవల్లరి యతిప్రయత్నంబున. ౧౨౮.

క. చెలువకు సంపెఁగనూనెం। దల యంటె సుగంధవాసితము లగుచూర్ణం
బుల నలుఁగుఁ బెట్టె గంధా।మలకం బిడి చమురు దిగిచె మజ్జన మార్చెన్. ౧౨౯.

చ. చెలికి మెఱుంగుఁబావడలచేఁ దడి యార్చెను ధూపవాసనల్
దలకొలిపె న్వినూత్నసదలంకృతి మీఱఁగ వేరువేర మె
చ్చు లరసి కీలుగంటు జడ సుళ్ళము ద్రేలుడుఁగొప్పు మూడుమూ
లలబిగికొప్పు పెక్కుగతుల న్నిలిపెం బలుమాఱు విప్పుచున్. ౧౩౦.

వ. అప్పు డారాగవల్లరి ప్రభావతి నుద్దేశించి. ౧౩౧.

చ. విరిసిన నొక్కయొప్పు నరవీడిన వేరొకయొప్పుఁ జిక్కువా
టొరసిన నొక్కయొప్పు నది యూడ్చిన వేరొకయొప్పు వేణిభా
వరచన నొక్కయొప్పు ముడి వైచిన వేరొకయొప్పు కొప్పుగాఁ
బరఁగిన నొక్కయొప్పుఁ గనుపట్టక మానదు నీకచంబులన్. ౧౩౨.

క. తెఱవా సందిట సందెదు। సెతివెంద్రుక లాయతములు నీలము లివి యే
తెఱఁగున ముడిచిన నీకున్। గొఱఁతె గలదె యివియు జట్టిగొను నీవిభునిన్. ౧౩౩.

క. అనుచు విరు ల్కచబంధం।బునఁ జెరివెడుసఖిని మరలి పొలఁతుక వైచెం
దనచేతి పువ్వుబంతిని। గినుకయుఁ జిఱునవ్వుఁ గన్నుఁగ్రేవలఁ దొలఁకన్. ౧౩౪.

వ. అంత. ౧౩౫.

గీ. అని చెలువ యక్షకర్దమం బాదిగాఁగఁ। గలపములభేదములు దనవలసినట్లు
సంఘటింపించి కుంకుమచందనాదు। లలఁది నిలిపించుకొనియె మే లరసి యరసి. ౧౩౬.

గీ. మృగమదాదులఁ జుక్కబొట్టుగి సెయాకు। బొట్టు పూర్ణచంద్రతిలకంబు నెలవంక
విధము నామము గుమ్మడివిత్తునామ। మొకటి గా దని యొకటి యాయావిద దాల్చె.

గీ. వెలఁది మట్టెలు పిల్లాండ్లు వీరమద్దె।యలును నందెలు మొలనూళ్ళు నంగుళీయ
కంకణాంగదహారతాటంకముఖస।మస్తభూషణములు దాల్చె మార్చి మార్చి. ౧౩౭.

క. ఒక్కొకతో యమసొమ్ములె। పెక్కఁడెఱుంగులవి యయునికి పెంపున నివి యొం
డొక్కటి మీఱుచుఁ దనప్రభ। నెక్కుడగుటఁ ద్రిప్పిత్రిప్పి యింతి ధరించున్. ౧౩౮.

ఉ. అంచలపట్టొకింతతడవ వస్త్రపుమంజిడి కొంతసేపుఁ గ్రొ
మ్మించుజరంగుదళ్ళుఁ గడుమేలిమిమూదశసు ల్బవంతు లా

కించుక యించు కంతపడి యింపున నొక్కటి మెచ్చ కొక్కటిం
జంచలనేత్ర దాల్చెఁ బ్రియుసమ్మతి మెట్లగు నొక్కొ యన్మదిన్. ౧౪౦.

చ. తరుణి యొకింతసేపు చిఱుఁదమ్ములపుంబసతోడిమోవి మే
గరగరిక న్విరాజిలుచుఁ గమ్మలుఁ దీఁగెయుఁ బూని వేణికా
సురభితఁ బొల్చి యొక్కపరిశుద్ధపుసైకపుటొల్లె గట్టి భా
సురతఁ గడు న్వెలార్చెఁ బెఱసొమ్ముల కోపమి యన్మిషంబునన్. ౧౪౧.

వ. వల్లభమనస్సమాకర్షణకౌశలాకౌశలసందేహంబు సంజేసి యొందును మనస్స్థైర్యంబు చాలక మఱియును. ౧౪౨.

ఉ. శ్రీలలితాంగరాగములుఁ జీరలు సొమ్ములు నేర్చి యేర్చి తా
మేలుతరంబుఁ దాల్చియును మెచ్చక మార్చుచు నెన్నిమాఱులుం
జాలక దిద్దినట్టిదియె సారెకు దిద్దుచు మించుటద్దమున్
గేల ధరించి చూచుఁ బరికించుఁ బొరింబొరి సద్మసంస్క్రియల్. ౧౪౩.

సీ. కేళీగృహంబుముంగిట గరగరిక లాలోకించు గంధాంబుసేక మరయు
నలుకుపూఁతలపరిమళముఁ బరీక్షించు రంగవల్లికలతెఱంగుఁ జూచు
సకినలమంచంబుజాడ విమర్శించుఁ గుంకుమపరపుభంగులు గణించు
హొంబట్టుతలగడయొప్పు విచారించు నగరుధూపములసోయగము లెంచు
నలరుటొవర్లు మేల్కట్లు నంగరాగ। పూర్ణపాత్రికలును గందవొడిబరణులు
బాలవల్లిక లాదిగా సముపభోగ। సాధనశ్రేణులు పరికించు సారె కబల. ౧౪౪.

వ. ఇట్లు వర్తించుచున్నయన్నీలవేణి యాపువ్వు లాదరంబునం బుచ్చుకొనియె నట్టి యెడ నిట్టు నట్టుఁ జెదరి పఱచుతుమ్మెదపదుపుపొది వదలి యొదిగి యదుకుమారుం డక్కుమారిక నవరించుశ్రవణోత్పలంబులోనం గాన రాకుండ నడంగి యుండె నప్పు డప్పడంతి ముప్పిరిగొనురాగవేగంబునఁ బ్రియాగమనవిలంబంబు సహింపలేక బహిఃప్రాణంబు లన నొప్పుశుచిముఖీరాగవల్లరుల నేకతంబునకుం బిలిపించి శుచిముఖి కిట్లనియె. ౧౪౫.

శా. రాఁడయ్యెన్ హృదయేశుఁ డీహృదయభారం బెట్లు సైతున్ క్షణం
బేఁ డై యున్నది యేటికిం దడసెనో యేవిఘ్నము ల్పుట్టెనో
నేఁ డేతెంచుప్రయత్న మున్న నకటా నీతోడఁ జెప్పండె యె
వ్వాఁ డీకేళి యొఱింగెనో యపుడు న న్వాక్రుచ్చి యట్లాడఁగన్. ౧౪౬.

శా. ఆహా యప్పటి కట్లు న న్నలఁచెఁ గా కంతఃపురంబు ల్పదు
గ్రాహంబుల్ పెఱవారి కెట్లు చొరఁ శక్యం బైనఁ గా నీ కడున్
మాహాత్మ్యంబున మేటి యంటి వలనిన్ దౌవారికాత్యుగ్రస
న్నాహం బెక్కడ నుండు రావలసిన ట్రాతేఁడె యొ ట్లేనియున్. ౧౪౭.

క. వత్తు నవశ్యము నేఁ డని। చిత్తము తమి రేఁచి యంతఁ జింత యొకతె పై
హత్తిన నది వృథపుచ్చెనఁ। బుత్తురు మగవారిమాట పొసఁగదు నమ్మన్. ౧౪౮.

క. అనఘాత్మకుఁ డతఁ డాతని। వన నే మున్నది మదీయ మైనయదృష్టం
బును దూఱుట గా కట్లని। యొనర్ప నున్నదియె చంద్రికోగ్రదవాగ్నిన్. ౧౪౯.

వ. అని చంద్రు నుద్దేశించి. ౧౫౦.

క. నీ శైత్యము నమ్మితి న।త్యాశన్ హిమధాముఁడును సుధాంశుఁ డనంగా
నో శశధర యేలా ఘృత।కో శాతకి వయ్యె దేమి గూడెదు దీనన్. ౧౫౧.

క. చలువ యొనరించినంతయు।ఫల ముష్ణత విడువు మిదియ పదివే లింకన్
జలిపందిలి వెట్టుట కడ।వలఁ బో మొత్తమిదె మాకు వనజారాతీ. ౧౫౨.

సీ. శ్యామకంఠలలాటసామీప్యపరితప్యమానంబులుగఁ గళల్ మార్చి మార్చి
సింధూదకాంతస్సమింధనబడబానలోగ్రకీలలసెగ నూని యూని
ప్రత్యమావాస్యసంభవదర్కసంయోగకలితాధికోష్ణిమఁ గ్రాఁగి గ్రాఁగి
విప్రయోగోష్ణపాంథప్రాణపరిపానభూమజం బగుకాఁక పొంది పొంది
కాలకూటాహ్వయభ్రాతపాలుఁ బట్టి। పుచ్చుకొను దాహకత్వంబు ప్రోచి ప్రోచి
యింతవేఁడిమి సాధించితేమొ చంద్ర। నన్ను నేఁచుటకే ప్రయత్నంబుతోడ. ౧౫౩.

చ. ప్రథమకళ ల్నెలన్నెల నుపాయన మిచ్చుచు వహ్నిసూర్యులన్
బృథుతర మైనమైత్రిఁ గడుఁ బ్రీతులఁ జేయుట యీదృశోష్ణిమ
ప్రథమఫలీభవద్విరహిబాధకె కావలయు న్మృగాంక యీ
పృథివి నధర్మ కెన్నఁ బరపీడయె యుత్తమలాభ మెప్పుడున్. ౧౫౪.

చ. చలువయె భ్రాంతిమూలము నిశాకర యింకొక టెన్నిచూడఁ గే
వలమును వేంద్రపుంబ్రకృతివాఁడవ యొట్లనినం జకోరముల్
వెలయఁ గడంక నీయొడుకువెన్నెల జుఱ్ఱుచు దానఁ జేసి కాఁ
కలవడ శైత్యము ల్మరగినట్టివి నిప్పులమేఁత కోర్చునే. ౧౫౫.

మ. ఇటు గా కొక్కొకకాలదోషమున నా నేమో విపర్యాస మ
న్నిటియందు న్మలయానిలుండు నిదిగో నెమ్మేనికిం జాల ను
త్కటతాపం బొనరింపఁ జొచ్చె నిదియుం ద్వచ్చంద్రికాజాలసం
ఘటనాదోషమ్మము రాజధర్మ మనుచుం గ్రౌర్యంబుఁ దాఁ బూనెనో. ౧౫౬.

వ. అని దక్షిణానిలు నుద్దేశించి. ౧౫౭.

క. తలఁప జగత్ప్రాణుఁడ వై। వెలసిననీ విట్లు నన్ను వేఁచుట తగునే
యిల వెలుఁగు చేను మేసిన। మలయానిల యెద్ది కాపు మదిఁ జింతింపన్. ౧౫౮.

వ. అని యాతని వేఁడిమి మాన్పుటకై యనేకప్రకారంబులం దూఱియుం బ్రార్థించియు
గుణంబు గానక విసివి యిట్లనియె. ౧౫౯.

సీ. అంతకాశాసమాయాతత్వ మరసినఁ జలువకు నీకును జాలదవ్వు
రౌద్రమూర్తిత్వవార్తలు విచారించినఁ జలువకు నీకును జాలదవ్వు
దహనసాంగత్యతత్పరత భావించినఁ జలువకు నీకును జాలదవ్వు
శ్రీఖండవిషధరోచ్ఛిష్టత యెంచినఁ జలువకు నీకును జాలదవ్వు
పలుకు లేటికి నీయందు మలయపవన। చలువ గల దనునట్టిసంశయము దగదు
వసుధ నెందైనఁ జండాలవాటిలోన। బ్రాహ్మణగృహంబు వెదకుట భ్రాంతి గాదె.

ఉ. దక్షిణగంధవాహ నినుఁ దన్మలయద్రుమరూఢగూఢపా
దృక్షణ వింత కెంతయు నపాయము పొందదె పొంద కుండఁగా
నిక్షుశరాసనుండు విరహిశ్వసితోపచయక్రియ న్విము
క్తత్వముఁ జేసెఁ గావలయుఁ గాక తదుష్ణత నుష్ణ మెక్కుఁగన్. ౧౬౧.

వ. అని మలయసమీరు నుపాలంభించి. ౧౬౨.

శా. పాథోరాశిగభీరు సద్వ్రతరణప్రాగల్భ్యమందారు భూ
నాథాస్థానవిధేయవర్తను నపైనఃపద్ధతీవర్తనున్
యాథాతథ్యవిధప్రయోగవివిధోపాయార్జితద్విణ్మదో
న్మాథఖ్యాతసునీతికౌశలు ననస్వార్గచ్ఛిదాపేశలున్. ౧౬౩.

క. వ్యాచక్షాణసుధీజన। వైచక్షణ్యోదయాభివర్ధన వైద
గ్ధ్యచుంచురనిజకృతమై। త్రీచుంచువిశృంఖలాష్టదిక్చరకీర్తిన్. ౧౬౪.

మాలిని. అమలమప్రియసూనున్ యామినీశోపమానున్
గమలభవమనీషున్ గణ్యవాక్ప్రౌఢిశేషున్
శమదమగుణనిష్ఠున్ శాస్త్రచింతాగరిష్ఠున్
బ్రమథపతిసుభక్తున్ బ్రహ్మవిద్యానురక్తున్. ౧౬౫.

గద్యము. ఇది నిఖిలసూరిలోకాంగీకారతరంగితకవిత్వవైభవ పింగళి
యమరనార్యతనూభవ సౌజన్యజేయ సూరయనామధేయప్రణీతం
బైనప్రభావతీప్రద్యుమ్నం బనుమహాప్రబంధంబునందుఁ
జతుర్థాశ్వాసము.



# పంచమాశ్వాసము.



క. శ్రీఫలతులసీనక్తుష|లాఫుల్లజ్జాతివిచికిలప్రముఖద్ర
వ్యాఘ్ర్యుక్త తేశ్వరపూ|జాఫలచిద్గుణ్యు నమరసచివవరేణ్యు౯. ౧.

వ. మన్మథు నుద్దేశించి యాకన్యకాతిలకంబు. ౨.

ఉ. భూనుతలీల రుక్మిణికిఁ బుట్టి మనోభవ మత్ప్రియత్వము౯
బూనినవాఁడ వీవయఁట పూర్వపునీయతనుత్వధర్మము
న్మానక యేఁచుచున్న నది మామకభాగ్యము నిన్నెటాడఁ బోఁ
గా నెటు వచ్చునో తడవఁగా వెఱతు౯ గరము ల్మొగిడ్చెదన్. ౩.

వ. అని పలుకుచున్నప్పు డంత కంతకుం బెల్లయినయాయుల్లకభరంబునం బెల్లగిల్లునుల్లంబు
తాల్మి నిల్వరింపం జాలక యబ్బాలాలలామంబు. ౪.

గీ. నాఁడె చనకుండ లేఖఁ బ్రాణములు నిలిపి| యంత భరపడి వచ్చి నేఁ డాత్మవీక్ష
నోర్వరానినాతమికి న ట్లొనరఁ బలికి|ప్రియుఁడుతుదనిట్లువిడిచెనన్నియనువ్యథగ.

మ. అనుచు౯ ఱెప్పలు తేలవైచుచు విపన్నత్యంత యై రుక్మిణీ
తనయా మీఁదట నైన నీవ పతివై తద్ధర్మ మీడేర్పుమీ
యనుప ల్కొంచుక సోలుక౯ దడఁపుచుం బ్రాణార్తి దీపింపఁ జ
య్యనఁ బూఁబాన్పున వ్రాలఁ బోవుటయు మీనాంకుండు చిత్రంబుగ౯. ౬.

వ. సంభ్రమంబునఁ గర్ణోత్పలంబు వెలువడి నిజరూపంబుతోడ. ౭.

క. హా తాలిమి వదలెదు సు| స్మేరెంచియె యున్నవాఁడ నిదె నీపతి న
న్నోతరుణి చూడు మని తా| నాతల్పమునందు నిలిచి యక్కన్నఁ జేర్చె౯. ౮.

మ. అతిశీఘ్రంబున నాలతాంగి యుఁ దదీయాలింగనస్పర్శనా
మృతసేకంబున మూర్ఛ దేఱుచు నెయ్యు స్మిలన్మహానందమూ
ర్ఛిత యయ్యె౯ మగుడ౯ బదంపడి మదిం జేష్ట లజనింపంగఁ దాఁ
బతిఁ గ౯ ఱెప్పలు విచ్చి చూచి భయకంపస్వేదలజ్జాత్త యై. ౯.

క. చిరకాంక్షితనిజపరిరం|భరసస్థితిఁ జొక్కి యున్న పతిచేతులు న
త్వరత విడిపించుకొని యో|వరిలోనికిఁ బాఱి పోయె వనజాక్షి వడి౯. ౧౦.

వ. ప్రద్యుమ్నుండును శుచిముఖీరాగవల్లరులం జూచి యిట్లనియె. ౧౧.

ఉ. సర్వయువాధికుం డనుయశం బెసఁగు న్నను నేలికొన్న మ
త్పూర్వసమస్తపుణ్యఫలభూమిక మీచెలి యీవిలంబ మే

నోర్వమిఁ జూడ కిట్లరుగు టొప్పునె తోడ్కొని రండు పోయి గాం
ధర్వవివాహలీలకు ముదమ్మున మీరలె పెండ్లిపెద్దలై. ౧౨.

వ. అనిన విని రాగవల్లరి నవ్వుచు నతనిం జూచి. ౧౩.

చ. తనవిరహాసహిష్ణుతవిధం బఖిలంబును నీవు వింటిగా
యనఘుఁడు నాఁడు కోఁగ నిపు డంచు మనంబున నెత్తుసిగ్గునన్
మునుఁగుచుఁ గుందుచున్నదియె ముద్దియ నీతమకం బెఱింగి ని
ల్వనితెఱఁ గొక్కతప్పుగఁ దలంచెదు నూ చతురుండ వన్నిటన్. ౧౪.

వ. అని పలుకునంత నతనికి శుచిముఖియు నిట్లనియె. ౧౫.

గీ. నీవు సకలనాయికావిశేషస్వభా।వములు నెఱిఁగినట్టివాఁడ వైన
నాకుఁ దోఁచినంత యాకన్యచిత్తంబు। విధము నీకు విన్నవింతు వినుము. ౧౬.

ఉ. తాఁ గడు మోహించెఁ గద తద్గతి నీవు నెఱుంగ సిగ్గునన్
లోఁగుచు నింతనుండి యిఁక లోనుగ నొల్లక పట్టఁబట్టఁగా
నేఁగుచుఁ గోరు నీబలిమి నీప్సితసిద్ధిగ నీవు గాన రా
డాఁగుట దీనిపేరు నిబిడం బిది బాలిక కెల్ల నాత్మలోన్. ౧౭.

వ. కావున నప్పడుచు తప్పేమి గలిగిన నదియుఁ నొక్కయనురాగవిలసనవిశేషంబ
కా నెఱుంగుకొని యనుగ్రహంబు వదలక పరిగ్రహింతుగాని వే ఱొండుగఁ దలం
చెదు సుమీ యేము పోయి యాముద్దియకు బుద్ధి చెప్పి యెత్తుకొని వచ్చెద మని
రాగవల్లరియుం దానునుం దత్సమీపంబునం దెరమఱుంగున నుండి తమపలుకు లాల
కించి వినుచున్న యన్నెలఁతపాలికిం బోయి యల్పస్వరంబున నిట్లనియె. ౧౮.

గీ. తలిరుఁబోఁడి మంచిదానవు గలిగి తి। ట్లరుగు టెంతురమ్మ యధిపుమనను
విరస మయ్యెనేని వెరవెద్ది మఱి చక్కఁ। జేయ నీవ చింత చేసి చూడు. ౧౯.

వ. అనిన శుచిముఖికి రాగవల్లరి యిట్లనియె. ౨౦.

క. అప్పటి కట్లు దెంచుట। తప్పన రాదెంత మనము దండ నునికిఁ దా
నప్పడుచుఁ దనము మానక। యిప్పడఁతుక యంత వెఱ్ఱియే యిఁకఁ జేయన్. ౨౧.

వ. అని ప్రభావతి నవలోకించి. ౨౨.

క. వరుఁడు సమాగమకాంక్షన్। త్వరితపడుచు నుండ నిచటఁ దడయుట తగ దో
వరవర్ణిని రా రమ్మొక। సరవిని దమి యుండ దెల్లసమయములందున్. ౨౩.

వ. అని కేలుపట్టి తివియఁబోయి యాలజ్జావతిచేత విదుల్పలం బడి నగుచు నిట్లనియె.

క. ఏరీతిం బెనఁగిన నెవ్వా। రెఱుఁగరు నీదుగుట్టు వనితామణి రో
ష్మారోఁకండ్లం బాడిన। కూరుము లిపు డింత చాఁచుకొన్న నడఁగునే. ౨౫.

వ. అని వెండియు నతిప్రయత్నంబున. ౨౭.

సీ. విభుఁడు దండనె యిది వినుచున్నవాఁ డెంత గబ్బివే యిది లజ్జక్రమమె యనియు
నతఁ డిది నరకు సేయమిగ భావించిన నపు డేమి యగుదు వీ వబల యనియు
రసికశేఖరుఁడు సర్వజ్ఞుఁడు ప్రియుఁడు నీకొలఁదిన నడుచు భీతిలకు మనియు
నతిగోప్య మీశుభావాప్తి దీనికి నింత తడయు టొప్పమి యెట్లు దలఁప వనియు
మఱియు నెన్నియొ బిసిబిసిమాట లమరఁ బ్రియము చెప్పియు నదరవైచియు హితాను
వృత్తిఁ దెలిపియు నొకకొంత మెత్తఁబడఁగఁ జేసి కేల్పట్టి తిగిచె నాచెలువఁ గదల.

సీ. తిగిచిన రాక యీడిగిలం బడుచును లజ్జాలసత్వమున మల్లాడి యాడి
నిలునిలు మొకమాట గల దని నిలిపి పల్కుట కేమియును లేక గ్రుక్కిగ్రుక్కి
యడుగడుగునకు నత్యంతనిర్బంధంబు నలిపెడునందాఁక నిలిచి నిలిచి
తెరువున నర్గళాదిక మేది చేతి కందినఁ బట్టు విడువక పెనఁగి పెనఁగి
యిందుబింబాస్య కడు నలయించెఁ జెలిని। వినివి పోదుగదా యనువెఱపు నొదవ
విభునినూతనసంగమవేళఁ గరము। వక్రములు వో పడంతులవర్తనములు. ౨౮.

క. ప్రకృతిజ్ఞయు హితనిర్వా।హకయు నగుట నల్ల నల్ల నేనుఁగుఁ గంబా
నకుఁ దిగిచినట్లు యత్నా।ధికతం జెలి తెచ్చె నానతిం బతికడకున్. ౨౯.

వ. ఇట్లు తెచ్చి. ౩౦.

క. అనయము చేకయగుతఱి। ననివార్యవ్రీడ భయభరాకులగతి యై
తనవెనుక నొదుగ నొదుగఁగ। వనితామణిఁ దేర్చి తేర్చి వల్లభుఁ జేర్చెన్. ౩౧.

వ. ఇట్లు దగ్గఱఁ దెచ్చి యజ్జలజాక్షి యత్యూర్జితసముజ్జిహానదుర్జయలజ్జాసముద్వేగవేగ
యు నుద్దామరోమహర్షణస్వేదోద్భేదసాదితప్రకృతిమకరికాపత్రాంగరాగయుఁ బుర
స్థితిపరిత్యాగయత్నసంక్షోభసంచలీభవదుత్తరీయపార్శ్వపునఃపునరాలక్ష్యమాణవక్షో
జకుంభతటవిజృంభణాభోగయు నగ్రదృష్టిప్రసారపరిహారనియమనియతకటాక్షసం
చారచారుకర్ణగోళకూలంకషలోలలోచనద్రాఘిమశ్లాఘనీయముఖపరావృత్తిప్రౌఢపు
న్యథన్యాయితోభయోపాంతభాగయు నైనయొలనాగం జూపుచు నాపురుషరత్నం
బుం గటాక్షించి. ౩౨.

చ. పడఁతులచర్య లిట్టివి నృపాలకుమారక నేఁటిదాఁక గు
ట్టెడలఁగ నీదుకూటమియపేక్షఁ బడం గలపాటు లెల్లఁ దాఁ
బడి యిపు డిష్ట మబ్బుతఱిఁ బాఱుచుఁ దాఱుచు నేక్రియం బెనం
గెడుఁ గనుఁగొంటె యంచుఁ జెలికే ల్గదియించె రతీశుచేతితోన్. ౩౩.

క. ప్రమదంబున రాకొమరుఁడు। కమలాక్షిఁ బరిగ్రహించె గాంధర్వవివా
హముచే నయంముహూర్త। స్సుముహూర్తో స్తంచుఁ గెలన శుచిముఖి నవ్వన్.

క. అప్పు డించుకతడవ నన్యో।న్యపాణిసంస్పర్శసంభృతానందస్తం
భపరీతాత్మత నుండిరి। ప్రపంచ మంతయును మఱచి పతియు న్సతియున్. ౩౫.

వ. తదనంతరంబ. ౩౬.

క. తనరెడులజ్జాభయభా।సన లుద్బోధమునఁ దనర నతి కనుఁగొని మె
ల్లన నిలుఁ డని యాన లిడన్।జని రొక్కొకనెపముఁ జెప్పి సకియ లిరుపురున్. ౩౭.

వ. అప్పుడు ప్రద్యుమ్నుండు. ౩౮.

క. నిలువక యటు పోచున్నా।రలికుంతల చెలుల నేల యానవొడిచె దేఁ
జెలికాఁడఁ గానె యని పై।వలి చెవిలోఁ జెప్పు చెప్పుఁ దార్కొనఁ బలికెన్. ౩౯.

వ. అప్పుడు. ౪౦.

చ. ఉవిద తదుక్తి కంత చెవి యొగ్గక పోఁ బెనఁగ న్విభుండు కే
ల్దవిలిచి ముట్టు నిందుకయెడన్ భుజము ల్వలగొల్పి పొ మ్మనన్
సువదన వెల్వడం దిరుగ శ్రోణిభుజస్తనవేణికాధర
శ్రవణకపోలము ల్పతిని సారెకు సోఁకుచుఁ దేల్చె నింపులన్. ౪౧.

వ. అంత. ౪౨.

చ. నళినదళాక్షి సిగ్గరితనంబు గదా యని యింత చెల్లునే
యలయఁ బెనంగి తెంచు విభుఁ డంగనహస్తము పట్టి నిల్పి చె
క్కిలి మిగులం జెమర్పఁ బులకింపఁగ ఘర్మకణావళు ల్నఖం
బులఁ గొని పాఱ మీటుచును బొల్పగ మే నిమిరెం గరంబునన్. ౪౩.

సీ. మఱియుఁ గపోలచుంబనసమీపతయాస రిత్తమంతనము సారెకు వచించి
యభివీక్షణేచ్ఛ నమ్రాననం బెగనెత్తి కొనగోళ్ళఁ బలుమఱుఁ గురులు దువ్వి
చనుగుబ్బ లంట ముచ్చట పడి మాటికిఁ బయిఁటపై నెరసులు పాఱ మీటి
గనయంబు ముట్టుటకును జేరికలుగ వేమాఱును మొలనూలిమణులు దుడిచి
బెద రుడిపి వ్రీడజాడ్యంబు వదలఁ జేసి। కాంత నొగి మెత్త మెత్తనఁ గౌఁగిలించె
నీవి తనయంతటనె జాఱె నెయ్య మెఱిఁగి।పాణిఁ జెక్కిలి నొక్కి చుంబనము చేసె.

వ. తదనంతరంబ. ౪౫.

ఉ. శౌరిసుతుండు బాలికను శయ్యకుఁ దార్చి యదీర్ఘయత్నత
ద్వారణసంప్రబుద్ధరసతం దరితీపుగ మించుబాహ్యనా
నారతభోగలీలల మనంబునఁ జొక్కుచుఁ జొక్కఁ జేసెఁబో
తా రత మల్ప మల్పముగఁ దన్మతియోర్పుకొలందిఁ జేయుచున్. ౪౬.

గీ. సౌరభమె చిక్క లోనికి జాఱె నొక్క। రాయిడికిఁ గాక బహిరంగరాగ మెల్ల
నసఁగ నినుమడించుచు నంతరంగరాగ। మలరఁ బెనఁగిరి దంపతు లతులరతుల.

వ. ఇవ్విధంబున. ౪౮.

చ. స్వకుతుకపూర్తి గాఁగ రతి సల్పి సుషుప్తి వహించి రంత నా
యికయును నాయకుండుఁ దమయిద్దఱియంగములు న్వ్యమిశ్రభా
వకలనఁ జిక్కుజీరుపడ వైచినచంపకనీలకంజమా
లికలతెఱంగునం బరఁగ లేఁజెమట ల్మనుగాలి నాఱఁగన్. ౪౯.

వ. అంత. ౫౦.

క. అరుణాంశుపటలి యనువా।నరరాజపుకోధృతధ్వజంబుకొనన్ వి
స్ఫురిత మగురత్నమో యన। సురపతిదిశయందు వేగుఁజుక్క వెలింగెన్. ౫౧.

చ. యదుకులచూళికాభరణ మంతట మేల్కని నిద్రచొక్కునన్
వదలినకౌఁగిలి న్మెలపునన్ బిగియించుచుఁ జెక్కు చెక్కటన్
గదియఁగ నొత్తి యొత్తి తనకాంతను మేల్కొలిపెన్ మృగాక్షియున్
నిదుర దొఱంగి చూచుచునె నేత్రము లెప్పటి మూసె సిగ్గునన్ ౫౨.

సీ. అంతఁ గామిని కన్ను లరవిచ్చి సురతసంక్షుభితవేషము పతి చూడకుండఁ
దనదుచెక్కిలి మొగంబున కడ్డముగఁ జేర్చి పొరిఁ బొరి నది దాన పులకితముగఁ
గొంగేల నతనికౌఁగిలి యూఁగి యెడగొంచుఁ జేలాంచలము పెఱచేతఁ దడవి
తెచ్చి పాలిండ్లమీఁదికిఁ జొనుపుచు నితంబావృత్తి యరసి కెందవచెఱంగు
కటితటం బెత్తి యొత్తి కిందటికిఁ బరపి। లోనుగా దానిపైయంచుతో నమరఁగఁ
బొక్కిలి గదించి పట్టి మూపున నరవిరి। వదలుతురుమానుకొనుచు లేవంగఁ గడఁగె.

క. ఈచాడ్పునఁ బానుపుపై। లేచుచుఁ గడు నింపు గులుకులేమవిలాస
శ్రీచేఁ జిత్తము గరఁగఁగ। నాచెలువుఁడు మగుపఁ దిగిచి యక్కునఁ జేర్చెన్. ౫౪.

వ. తదనంతరంబ కార్యాంతరచింత చిత్తంబునఁ బొడమఁ దనవదనంబు ముదితచెవిం
గదియించి యోయువిద యిది మొదలుగ మాపు లెల్ల నిచ్చటికి వచ్చెదఁ గాని రేపులు
దప్ప కుండ మావిడిదిన యుండ కున్న రహస్యభంగంబు పుట్టిన మనమనోరథంబు
విఘ్నాకులం బగుం గావున నిక్కడనుండి మదీయనివాసంబు దాఁక భూవివరంబు
గల్పించుకొని పోయెదఁ దద్వారం బన్యుల కెఱుకపడ కుండునట్లుగ సంవరణంబు
గావింపు మని చెప్పి యప్పలుకులకు నాలజ్జావతి యంగీకారసూచనంబుగాఁ దల
యొగర వైవ నుక్తప్రకారంబున నిజనికేతనంబున కరిగెఁ బ్రభావతియుఁ దద్బిలంబు
తగుతెఱంగున సంవృతంబు గావించె నంత. ౫౫.

మ. సమయాభిజ్ఞతఁ గుక్కుటంబు వివిధచ్ఛందస్స్క్రియా మంతరం
తిమయామో భగవా నృషిః కుసుమధన్వీ దేవతా మానినీ
రమణారాధనవినియోగ యంచు నిది యారంభించెఁ గాఁబోలు నా
నమరెం దధ్వని మానిసుల్ రతికిఁ దా నైమె నాథులం బైకొనన్. ౫౭.

వ. మఱియు నానమయంబున వానరప్రత్యాసక్తినిమిత్తవిరహాశంకాసమంకురితసంతాపం
బున లోపలిపట్టు వదలి వెలికి నిర్గమించునిఖిలకాముకద్వంద్వసముదయహృదయం
బులచలువలం ద్రోవ యడ్డగించి గద్దరికి యాక్రమించెనో యనఁగఁ దనరారుచు హార
మౌక్తికంబు లత్యంతశైత్యంబునం బ్రవర్తిల్లె నచిరభావి యైనభావజవశంవదస్త్రీ
పురుషపరస్పరపరిరంభవిశ్లేషఖేదవేదనాప్రాచుర్యంబు సూచించుభంగి నొండొంటి
యంటు విడిచి బిగుసెడలినదళంబులతో నతివిరళం బగుచు మేల్కట్టుపువ్వుదండ
లం దమరుమంత్రగుణంబులకొలఁది విశదంబుగాఁ దెలిపె నన్యోన్యసన్నిధిం జెన్ను
మీఱుదంపతులింపుసొంపున నాదరింపం బెంపొందుసౌభాగ్యవైభవంబు నేఁటికిదియ
కదా యనుహృదయౌత్సుక్యంవిలసనవిశేషంబునం బోలెఁ దాంబూలంబు లచలితం
బుగా రుచులప్రచురతం బచరించెఁ బ్రచురసురతంబులఁ జరించునుద్దామయౌవనమద
మదనమత్తమత్తకాశినీమణులమణితరణితంబులజోక లేక సంతన గ్రహించి యంచిత
ప్రేక్షాదక్షతం బరీక్ష యిచ్చుభావ మావహిల్ల గృహశారికాకీరపారావతకులంబులును
గలకలితలయలలితకలకాకుభావంబు దులకించుకులుకు లెలుంగుఁ గలకలికిపలుకు
లవికలంబులుగాఁ గులుకరింప దొరకొనియెఁ బ్రతికలనవనవాయితప్రౌఢి యుపమిథు
నరతిపరిమళంబులఁ గలపడం బయి పోలు పెనఁగ వికసనారంభశుంభదంభోజముకుళ
సుకుమారసౌరభంబు సొరెకు వెదచల్లుచు నల్లనల్లన సంచరించు చల్లకరువలిబలంగము
లు తెరువరులతనువుల నవిరళముగఁ దలకొనం బులకాంకురంబులు మొలపించుగతిదివ
సావసానసమయంబున జిగీషితదేశాంతరుం డైనభాస్వంతుచేత నాత్మతేజస్సమర్పణా
నల్పలాలనాపురస్సరంబుగా నియోగింపంబడియుం దమతమయున్నభవనంబుల నివ
సించుకొంచెపుఁ జీఁకటులనే కాని నానాతమోనీకంబులం బోకార్ప లేనితప్పు గలిగి
యున్నయవి గావున నావేళ కాసన్నం బయినయావానరాధీశురాక యాకర్ణించి కా
ర్యవైక్లబ్యంబున నాకులత్వంబు నొందెనో యన నేపు దఱిగి దీపకళికలు వెలవెలం
బాఱె విక్రమవిహారంబు ముగియించి గవుసెనఁ బొదివినకుసుమకోదండు వెండిజల
పోఁతపళుకుటరిగ తెఱంగున మెఱుం గడంగి యుండు రాజమండలంబు మాఁగుడు
వాఱి కానిపించెఁ దొల్లి నిజసంతతి హితార్థిని యై సురభి ప్రార్థింప నిలింపవిభుం
డమృతం బిడుట ప్రత్యక్షం బయ్యెనో యనునట్లుగా దట్టం బగుచు శాద్వలప్రదే

శంబులం బ్రకాశించుముక్తాఫలస్థూలప్రాలేయబిందుబృందంబు పశ్చిమరాత్రిగోచరప్రచార్యమాణపశువిసరంబులచేతఁ గసవుతోఁగూడ గ్రసింపంబడుచు నుండ గగనముకురపరిదృశ్యమానతదీయప్రతిబింబవిభ్రమదృఢీకారపారీణంబు లై తారకంబులు క్రమంబునం బలుచ గాఁ దొడంగెఁ బ్రాబోధికంబు లైనభూపాలదేవగాంధారిప్రముఖరాగాభోగసౌగంధ్యబంధురగాంధర్వనాదమేదురమృదువాద్యవిశేషపోషితసూతమాగధాదిక్రియమాణస్తుతిపాఠరవంబులు ప్రభుద్వారంబులఁ దోరంబు లై సొంపు మీఱె నపరరాత్రస్వాధ్యాయాధ్యయనశబ్దస్థానంబుల నైనయాదేశంబులుం బోలె నిర్భరక్షీరభారభిద్యమానపీనాపీనస్మార్యమాణశకృత్కోపసరణరణరణికసంభ్రమసముదితసముత్థానధైనుకగంభీరహంభారవంబులు విజృంభించెఁ జంద్రాస్తమయసంభవక్లేశభవపరిఘూర్ణార్ణవధ్వానంబు పెచ్చువను వెక్కిరించినట్లు మిక్కిలి నక్కజపుబాహుళ్యంబు నెరపుమహానందోహదోహనిస్స్వానసాహచర్యసమధికదధిమథనవిధివిహితఘుమఘుమఘోషంబు లందు గండూషితదిక్కంబు లగుచుఁ బిక్కటిల్లె నప్పుడు. ౫౭.

సీ. మును విలూనం బైనదినపాదపముమొదల్ మగుడఁ జిగిర్చినచిగు రనంగ
గతనిద్రశక్రేభకర్ణతాళానిలేరితకుంభసిందూరరేణు వనఁగ
ధ్వాంతజాలముమీఁద దండెత్తుభానుమంతునివెలిగొల్లెనతోఁ పనంగ
మార్తాండపథశోధమందేహబలపదోద్ధుతపూర్వనగధాతుధూళి యనఁగ
వనజరంగస్థలిని నాట్యమునకు వచ్చు। సిరికిఁ బట్టినకెంబట్టుతెర యనంగఁ
బ్రాగ్దిశాలిప్రఘుసృణాంగరాగ మనఁగ। మెఱసె నరుణోదయపుదీప్తి మింటికెలన.

చ. అనుదితసూర్యహేళము లగుయజ్వలప్రజ్వలదగ్నిదీప్తులొ
ద్ద నమరుసోమిదమ్మలమిథఃకషణోల్లసితస్తనంబులన్
దనరుచు గేలి చేసెఁ గడుఁ దత్సమయాత్తపరస్పరోపగూ
హనరసరంగదంగకరథాంగపతంగతతారుణద్యుతిన్. ౫౯.

ఉ. ఏఁ గలలోన నొం డెఱుఁగ నీవె విభుండవు నందియుంబు నా
పైఁ గలదేని చూడు మని ప్రాగ్దిశ గౌతమదారజారునిన్
డాఁ గడు నమ్మఁ జేయుటకుఁ బ్రాగఁగ నెత్తెడునట్టియొట్టిగాఁ
గాఁగినమడ్డుచంద మెనఁగం గనుపట్టె నినుండు నుష్ణతన్. ౬౦.

వ. అప్పుడు. ౬౧.

సీ. బిగువుఁగౌఁగిళ్ళచేఁ బ్రియుబాహుపురు లొత్తి కుస్మెలు వోయినకుచతటములు
వరుమేన నొఱసి పోవఁగఁ జిట్లినట్టిగంధపుఁజేంట్లతో నొప్పునఖపదములు
రమణుకుండలపీడనముల రేఖలు మాయ కలరుచున్నకపోలఫలకములును
బ్రాణేశదశనకోరకశిఖాసంసర్గమునఁ గందినట్టికెమ్మోవిసిరులు

నిలువుటద్దాలచేరువ నిలిచి నిలిచి। పలుమఱును జూచుకొనుచు నాబాగు సడలఁ
జేయఁ జాలక తడసె దైతేయకన్య। ప్రాతరుచితాంగసంస్క్రియాపరత లేక. ౬౨.

వ. అంత నచ్చటికి శుచిముఖీరాగవల్లరు లరుగుదెంచి యాచంచలాక్షి యున్నచెల్వు దవ్వుదవ్వుల నవలోకించి నవ్వుచు. ౬౩.

ఉ. పుక్కిటితమ్ములం బుమియుఁబ్రొద్దును గాదొ కదమ్మ నేఁడు మా
యక్కకు నిప్పుడి ట్లిటఁ బ్రియంబునఁ జూడఁగఁ గల్గెఁ జాలు మా
కిక్కడి కేగుదెంచుట నభీష్టరతి స్వనివాళ్ళు వాడునీ
చక్కనిరూపము న్నిదుర చాలనికన్నులుఁ జిట్లుగందమున్. ౬౪.

వ. అనుచు డగ్గఱ నేతెంచి. ౬౫.

సీ. పలుగర సేయక పసుపును నలిపించుకొనక మొగంబుమజ్జనము లేక
పరిశుద్ధవస్త్రంబు ధరియింపక కచంబు లాగిఁ జిక్కువుచ్చి క్రొత్తగ ముడువక
ప్రత్యగ్రతిలకధారణ మొనర్పక నవీనముగఁ గాటుక లోచనముల నిడక
తగునట్టిసొమ్ములు దాల్పక దినముఖనియమపుణ్యంబు లెవ్వియుఁ జలుపక
నీవు తడయుట చోద్య మోనీరజాక్షి। ఘనము గాఁబోలు శ్రమ మట్లు గాక రతుల
చిన్నె లింపునఁ జూచుకొం చున్నదాన। వేమొ విఘ్నమై వచ్చితి మెఱుఁగ కేము.

వ. అని పరిహాసగర్భంబుగాఁ బలుకుచు లజ్జారోషభూషితంబు లయినయాయోషారత్నంబు చేతియదరువ్రేఁతలు తమకు నూతనోత్సవంబు లగుచుఁ గౌతుకం బొనరించుచుండఁ బ్రవర్తిల్లుచున్నంతఁ జంద్రవతీగుణవతు లటమున్న నిజవల్లభసమాగమంబునకు నుపాయంబు గానక శుచిముఖితోడివిచారంబు గోరుచు నుండుటం జేసి యమ్మరాళిఁ దమనిలయంబున కెలయించుకొనిపోవుటకు నుద్యోగించి ప్రభావతీదర్శనమిషంబున. ౬౬.

క. లలితప్రియసంభోగా। కులవేషము చక్క దిద్దుకొన నెడ లేమిం
గళవళ పడుచుఁ బ్రభావతి। యలుక నతర్క్యగతి వచ్చి రచటి కిరువురున్. ౬౭.

సీ. ఈతెఱంగున వచ్చి యాతరుణీమణిచందంబునకుఁ గొంత సందియంబు
మదిలోనఁ గందళింపఁగఁ గ్రమంబున విమర్శించి తదాకారచేష్టితముల
కతమునఁ బురుషసంగతికల్మిఁ బదిలంబు గా నిశ్చయించి యక్కాంతమీఁద
భావసంసూచనపాండిత్యగంధివిలోలకటాక్షావలోకనముల
కలిమిఁ మొలకనగవుతళుకుతోఁ బలుమఱు। నగుచు నొకరొకళ్ళ మొగము చూచి
యంతఁ గనినయర్థ మాప లేకి ట్లని। పలికి రాసఖి విన జలజముఖులు. ౬౮.

ఉ. ఎంతయు మేన వింతపస లేర్పడు చున్నవి యప్పు గంటె య
త్యంతము నిద్ర చాలమియు నక్షులు తెల్పెడు రాత్రి యుద్దియో
కొంత విశేష మబ్బినది కోమలికి న్మముబోంట్లకుం గడున్
సంతసమే కదా తనదుజవ్వన మెవ్వలన న్ఫలించినన్. ౨౦.

వ. అని మర్మంబు దాఁక నాడుచు నావ్రీడావతిమొగంబుఁ జూచి. ౨౧.

క. ఏ మైన నయ్యె నిఁక నేఁ।లా మాటినపనికి నిట్టియంతిపురములో
నోముద్దరాల యేగతి। నీమహిమ గడించుకొంటి విది వెఱఁగు కదున్. ౨౨.

సీ. అని యుల్లసము దోఁప నాడుమాటలకు వెల్వెలఁ బాఱుచును దైత్యవిభుతనూజ
కలఁగి రహస్యభంగభయంబుచేతఁ బ్రత్యుత్తరం బేమియుఁ దోఁప కునికి
నిట్టటు గ్రుక్కుచున్నట్టిలా గరసి యాయతివకుఁ దనచెలియండ్రగుట్టు
బయలు సేయక యున్నఁ బాయ దీవెడఁగుఁబా టనియు వారికి నిది యభిమతార్థ
సిద్ధిహేతు వనియుఁ జిత్తంబులోపల। నీతిసరణిఁ బరిగణించి చూచి
యాసునాథసుతల కంచపడంతి యి। ట్లనియె నుచితఫణితి యతిశయిల్ల. ౨౩.

క. ఇది యెంత పేర్చెదరు మీ।చదివినయాకువనె తానుఁ జదివినయది మా
నుదతియు మొదల ఫలించెన్। దదభీష్టము పెద్దపిన్నతనములవయసన్. ౨౪.

వ. అనుటయుఁ దెలి వొందినమొగంబుతోఁ బ్రభావతి యావిహంగిం జూచి. ౨౫.

క. ఎట్టెటూ మును వీరల। గుట్టును నీపోఁగునకుఁ దగుల్పడినదియే
యెట్టుండె నట్టె చెప్పుము। గట్టిగ నావుడు మరాళకామిని నగుచున్. ౨౬.

వ. తను నధికభయలజ్జానమాకులచిత్త లగుచుం గనుసన్నల వారించుచున్న చంద్రవతీ
గుణవతులవంకం గనుంగొని చెప్పం గొంచించుటయు నక్తంచరరాజనందనయుం
దనమీఁద నాన లిడుచు నడిగినం బులుఁగుపడంతి తదనుజల విలోకించి. ౨౭.

గీ. మీర లార కుండ రీరు దివ్వఁగఁ జేసు। వచ్చు ననుట వినరె వనితలార
యాన పెట్టి యడుగ మాన నా దీఁకఁ జెప్పు। వలసె మీరహస్యవర్తనములు. ౨౮.

వ. అని పలికి ప్రభావతితోడం బ్రద్యుమ్నలేఖాహరణం బొనర్చినచిలుకనుద్దులు మొ
దలుకొని వారిప్రయత్నంబు సకలంబునుం జెప్పిన నవ్వుచు నావువ్వుఁబోఁడి వ్రీడా
వనతవదన లైనయమ్ముద్దియల నీక్షించి. ౨౯.

క. మునిముచ్చులార మీచే।సినపని యటు గట్టిపెట్టి చేకొని యేలా
నసుఁ దటిమిటి రిఁక నేమియు। ననకుఁడు నాతోడిదొంగ లైతిరి మీరున్. ౩౦.

వ. అనిన నాయింతికి శశిమంతకాంత యి ట్లనియె. ౩౧.

గీ. లలన యెంతటివారు గావలయు నెందు। నైన నీతోడివారు గా నంత కిపుడు
ప్రియునితోఁ జెప్పి నీవు రప్పించు కున్న। వీరలకు నెక్కుడిది నిజవిభులరాక. ౭౨.

ఉ. ఎల్లియు నేఁడు నీకు హృదయేశ్వరు నెద్దియుఁ బల్కు సిగ్గుచే
నుల్లము గొల్పదేని వికచోత్పలలోచన యేన నేఁడు నీ
వల్లభుతోడఁ జెప్పెద నవశ్యము నీచెలియంద్రకోర్కి నం
ధిల్లెడునట్లు గాఁగ భవదీయనియోగమహత్త్వశక్తిచేన్. ౭౩.

వ. అని తన్నయనచేష్టావిశేషంబున నంగీకారంబు వడసినదియై సునాభతనయల నభివీక్షించి యీప్రభావతికిం బతియైనవాఁ డతిలోకమహిమమహనీయుం డైన యొక్కదివ్యపురుషుండు గావునఁ దదనుగ్రహంబునం దక్కఁ దక్కినయుపాయంబుల నీయంతఃపురంబు మీవరులకుం జొరం నలవి గా దని తలపోసి యిట్టినీతి నిశ్చయించి పలికితి నని పలికి యిట్లనియె. ౭౪.

క. మదితహతహ విడిచి యిఁకన్। ముదమున సతులార కొంగుముడి వేసికొనుం
డిదె నేఁటిమాపటికిఁ గూర్చెద వాలాయముగ నేను బ్రియులను మిమ్మున్. ౭౫.

క. అని హంసి మృదుస్మితశోభనలజ్జావనతవదనపద్మంబులతోఁ
గనుపట్టువారి నిండ్లకు। ననిపించె నిశాచరేశ్వరాత్మజచేతన్. ౭౬.

వ. ఇవ్విధంబున నవ్వధూమణుల నమ్మించినదియై యంచబోటి నాఁటిరాత్రి యాదవుల విడిదికిఁ బోయి యేకాంతంబునఁ బ్రద్యుమ్నగదసాంబుల ముగ్వురం గూర్చి. ౭౭.

క. సాకల్యంబున మీప్రత్యేకపుఁబను లైనఁ గాని యెద్దియు నాకున్
బై కార్యము దెలియదు నాకొక స్వామికిని జెప్పి యనుపుట కనుదున్. ౭౮.

ఉ. అందఱకుం దలాయొకటి స్వార్థము గల్గుట దోఁపఁ బల్కె నం
క్రందనకార్యవర్తనము గాకయు నాకును బోలె నెవ్వియే
నిందు నిజార్థము ల్కడమయిద్దఱకుం గల వేమొ యంచు నా
త్మం దలపోఁత వూనిరి సమంబుగ నప్పుడు వారు ముగ్వురున్. ౭౯.

వ. శుచిముఖియు వారిభావంబు భావించి. ౮౦.

క. మీమీప్రత్యేకార్థము। లేమియు నొక రొకరెఱుంగ రేమొ వినుం డం
చాముగురకు ముగురకుఁ గల। ప్రేమవతులతెఱఁగు వారిప్రేమలుఁ దెలిపెన్. ౮౧.

వ. తెలిపి ప్రద్యుమ్నుం జూచి. ౮౨.

క. నీ వొకఁడవు మాయావివి। గావునఁ బ్రియఁ బొందఁ గంటి గాని యితరుల
త్యావిలధృతి నున్నారి। ప్టావాప్తికిఁ ద్రోవఁ గాన కాత్మలలోనన్. ౮౩.

వ. కావున వీరలయభిమతసిద్ధియు భవదధీనంబ యిందులకుఁ దగినయుపాయం బూహింపు మనియె నప్పు డాముగ్వురుం బరస్పరరహస్యకార్యప్రకటనంబునకు నవ్వుచు

మహృద్భావసుభగంభావుకనర్మసంవర్తితవచనంబులతో నొండొరుమొగంబులు గ
నుంగొనుచు. ౯౪.

క. నీవచ్చుటివి గని యాలా వానవకార్యపరత యను చుంటిఁ గటా
నీ వీతెఱఁగే యన మఱి నీవో యన నీవొ యనఁగ నిగిడె న్నగవుల్. ౯౫.

వ. అంతఁ బ్రద్యుమ్నుండు శుచిముఖిం జూచి నీవు సునాభతనయలకడకుం జని తమ హృదయేశ్వరు లిదె వచ్చెద రని యూఱడింపు మని పనిచి తానును గదసాంబుల కిష్టసిద్ధి యగునట్లుగ నాత్మకల్పితభూవివరద్వారంబున దానవేశ్వరకన్యాంతఃపుర ప్రవేశంబు గలిగించి నిజాంగనం గూడి రమియించుచుండె నప్పుడు. ౯౬.

సీ. ఆననాంభోజవ్యపావర్తనాముహుర్విఘ్నితాధరపానవిలసనంబుఁ
గరకృతాంతర్థిభంగురితకపోలచుంబనరణరణకసంభ్రమభరంబుఁ
బ్రబలభావహృతకుచప్రావరణాంశుకస్థానాభిషిక్తదోస్స్వస్తికంబు
నమహోఢజఘనవస్త్రప్రయోజనసమాధిష్ఠోరుయుగమిథోవేష్టనంబు
నగుచుఁ దనసిగ్గుపెక్కువ యవిరతంబుఁ గరకరి యొనర్ప రాయిడిఁ గరముఁ గెరలు
నతనురాగవేగంబున నతిశయిల్లు రమణురతి నొప్పె నొక కొన్నిరాత్రు లబల. ౯౭.

వ. అంత. ౯౮.

ఉ. సిబ్బితి మాని నేఁటినిశఁ జిత్తములోపలికాంక్ష దీఱఁ జన్
గుబ్బల నొత్తి యేనె మును గ్రుచ్చి కవుంగిటఁ జేర్చెద న్విభుం
గొబ్బునఁ బట్టి దంతశిఖ నొక్కెద మోవియు నంచుఁ గోరు నా
గుబ్బెత రేపు లెల్లఁ దఱిఁ గొంకు నిరంకుశలజ్జ పెంపునన్. ౯౯.

క. యాదవుఁ డంతట రతులవి భేదములు గ్రమక్రమాభ్యుపేతములుగ నా
పైదలికిఁ గఱపి చిత్రాపాదిసురతరాజ్యమునకుఁ బట్టము గట్టెన్. ౧౦౦.

వ. అందు. ౧౦౧.

క. ఏవిధిఁ బతి వేఁడినఁ బుంభావాదిని లజ్జఁ దొట్రుపడుఁ గాని తుదన్
యావనపుంజిందఱ గొని భావజుసివ మెత్తి యతివ ప్రౌఢిమ నెరపెన్. ౧౦౨.

ఉ. ఆచనుబ్రేగు నట్టిజఘనాళిభరంబు విరోధి గాక తో
డై చపలాక్షి కిం పొసఁగె నప్డు సముద్గమవేగ మున్న మై
ఖేచరచక్రసామ్యధృతికిం దగ నొక్కటి మీఁదికిం దివన్
భూచరచక్రసామ్యమును బొందెఁ దదన్యము క్రిందికీడ్చుచున్. ౧౦౩.

వ. తదనంతరంబ. ౧౦౪.

సీ. గుబ్బపాలిండ్లు గన్గొను వేడుకను మించు గాఢపరిరంభకౌతుకంబు
గాఢపరిరంభకౌతుకంబును మించు జఘనలోలుపహస్తచాపలంబు
జఘనలోలుపహస్తచాపలంబును మించుఁ దిలకమంటినకురు లిద్దుతమియుఁ
దిలకమంటినకురు లిద్దుతమిని మించు వాతెఱచవు లానువలపుపెంపు
వాతెఱచవు లానువలపుపెంపును మించు। రతులరహియు రతులరహిని మించు
నధరరసము విఘటితాన్యోన్యముగఁ దత్త। తెలుచుఁ బతి రమించెఁ జెలువఁ గూడి.

వ. ఇత్తెఱంగున నమ్మత్తకాశిని హృదయేశుచిత్తంబు రంజిల్ల నుల్లసిల్లెఁ జంద్రవతీగుణవతులుం బతులచేత నతులానురాగపూర్వకనివర్తితగాంధర్వవివాహ లగుచుం గ్రమప్రవర్ధమానానారతిప్రాగల్భ్యనిర్భరంబు లగువిహారంబుల నతిశయిల్లి రివ్విధంబున. ౧౦౬.

సీ. అతియత్నరుద్ధలజ్జాశ్లేషచుంబనకుచపీడనాద్య మై కొన్నినాళ్ళు
మందమందక్రియమాణనానాప్రాతికూల్యాభిరామ మై కొన్నినాళ్ళు
కృతకప్రమాదానుమతసముల్లసదసంకుచితక్రియాక మై కొన్నినాళ్ళు
విరళత్రపాతిరస్కారిణీపరిస్ఫురత్కౌతుకసంరంభ మై కొన్నినాళ్ళు
ప్రకటముఖరితమేఖలారణితగుణిత। మణితఘంటారవాఘోష్యమాణమసృణ
కుసుమసాయకౌద్ధత్య మై కొన్నినాళ్ళు। రతి జరగఁ జల్పి రతివలు పతులసేవ. ౧౦౭.

వ. అందు నొక్కనాఁడు. ౧౦౮.

శా. ప్రద్యుమ్నుండు ప్రభావతీరతివిహారప్రౌఢిసారస్యసం
పద్యుక్తిన్ గడుఁ జొక్కి దక్కితి రతీ మత్ప్రాణమా నీకు నం
చుద్యత్ప్రేమసమృద్ధిఁ బల్కె నది యాయోషాలలామన్ శ్రవ
స్సద్యఃపాతనిశాతశూలసమ మై చాలంగ నొంచె న్వెసన్. ౧౦౯.

క. ధాత్రిఁ జిరార్జితతాదృ। క్ఛ్రోత్రమిథఃప్రేమ నుల్లసిలుచో బెరు కే
మాత్రము లే కెనసినప్రియయు। గోత్రస్ఖలిత్యమొర్వఁ గోమలివశమే. ౧౧౦.

ఉ. ఏ మని చెప్ప నప్పు డసురేంద్రసుత న్సకలాంగసంపదు
ద్దామరతోత్సవానుపమతత్ప్రథమక్షణసంభవత్సుఖ
శ్రీమయ మూర్ఛఁ జేడ్పడఁగఁ జేసెను దుఃఖపుమూర్ఛ యై కడున్
భామల కట్టిచో సవతినామము మారణమంత్ర మౌఁ జుమీ. ౧౧౧.

గీ. ఆప్రభావతి కొంతసే పవ్విధమున
మానదుఃఖనిశ్చేష్టిత యైనవెనుక

మున్ను రనుచును వేడినిట్టూర్పు నిగుడ
వగలఁ బొగులుచుఁ బొరలె మార్గాగముగాఁగ. ౧౧౨.

గీ. అరిగె శయ్యాంతరమునకు నంత లేచి। యతివరో యిది యేమి నాయందుఁ దప్పు
గలిగెనో యంచుఁ దోన రాఁ గడఁగువిభుని। నట్లు రాకుండ ఘనమైనయాన వెట్టి.

క. ప్రద్యుమ్నుఁడు తా నటు చను। నుద్యోగము దక్కి యున్నరున్న రనుచు-నా
హృద్యతరాంగివియోగము। సద్యఃపరితాప మొనఁగ సందేహమునన్. ౧౧౪.

వ. తనకుఁ గొంతసమీపంబున నొక్కపర్యంకంబున నవ్వలిమొగంబుగా శయనించి యున్నయాప్రభావతికిఁ గర్ణగోచరం బయ్యెడుపాటిపరిమితస్వరంబున ని ట్లనియె.

ఉ. తామరసాక్షి నావలనఁ ద ప్పొక టెయ్యది యైనఁ గంటివో
నామదితాల్మి చూడఁగ మనంబునఁ గోరియొ యల్గి కూడినం
బ్రేమలు వింతయింపు నవరించు నటంచునొ యల్క చొప్పు గా
కే మయిన న్నిమిత్త మొకయించుక గల్గెనొ లేచి పోవఁగన్. ౧౧౬.

క. అనుటయు ఘనదుఃఖవశం। బున నొకయుత్తరము నీక పొలఁతుక నిట్టూ
ర్పు నిగిడ్చి యూర కుండిన। దనుజారిసుతుండు ప్రచలితం బగుమదితోన్. ౧౧౭.

శా. నాయం దేయది తప్పు దోఁచినది యోనారీమణీ నీకు దుః
ఖాయత్తత్వము చూడ నిక్క మిది మత్ప్రాణంబ నీ వెందునుం
జేయ న్నేర్తునె తప్పు నీకు నిది నీచిత్తంబు రాఁ దెల్పుకో
డాయ న్వచ్చెద నాకు రా ముదల పెట్టంగాఁ దగు న్నత్కృపన్. ౧౧౮.

వ. అట్లుం గాదేని. ౧౧౯.

గీ. వనిత యిటువచ్చి నీవు నీవలయునోటి। గొనుము దప్పున్న మఱి నాకుఁ బెనఁగఁ జోటు
గలదె నీమొలనూలునఁ గట్టువడుదుఁ। బూనుదును నీవు మెడఁ బెట్టుపాగడదండ.

క. నావుడును గంతగద్గది। కావిష్కృతి యడంచుకొంచు ఘనయత్నత వ
ర్ణావలి యేర్పడఁ బలికెఁ బ్ర। భావతి చెవి యొగ్గి తనదుపతి యాలింపన్. ౧౨౧.

చ. అవఘుఁడ నిన్ను సోఁ దెగొనునంతటిదాననె యేను దప్పు లే
దును దలపోయ నీవలన దోసమె యాత్మను బాయకున్నవా
రిని బలు కొక్కమా ఱనుసరించుట మే నది వించునేఁ దోఁబం
గని పెనుదప్పు నాయదియ కాక పదింబదిగాఁగ నెంచినన్. ౧౨౨.

ఉ. అట్టిమదీయ మైనవపురాశ్రయలోభమహాపరాధమే
గట్టిగ లేచి వచ్చుటకుఁ గారణ మైనది నాకు దోసముల్

గట్టెదు నీమృషాచటువికారముఁ జూడఁగఁ జేసి యిప్పుడున్
దిట్టును రట్టు నర్హ మగు దీనికి నిన్ననఁ జెల్ల దేమియున్. ౧౨౩.

గీ. దూఱఁ దగు నిన్ను నొకటికిఁ దొంటియట్లు। కల్లకూరిమి నెరపువాక్యముల నన్ను
నిప్పుడును బయ లీఁదించె దిదియ కాదె। కుటిల తడిపొఁతఁ గుత్తుకఁ గోయు టనఁగ.

ఉ. వట్టిప్రియోక్తు లెందుఁ దగవా మిముబోంట్లరసజ్ఞ కాత్మ ను
న్నట్టివ కాక యిప్పు డివి యట్టివ యైనను నీకు మోహపుం
బట్టపుదేవి యైనరతిభ్రాంతిన పల్కెద వేమొ నాథ యే
గట్టిగ నారతిప్రమదఁ గాను ప్రభావతి యండ్రు నన్నిలన్. ౧౨౫.

క. అని మానదుఃఖ ముద్దీపన మొందఁగ నవ్వధూటి ప్రక్కఁ దెగయ నే
డ్చెను వెక్కి వెక్కి లోలో। నసె యకటా యిదియు జీవనమె నాకనుచున్. ౧౨౬.

క. నాయకుఁడును దాను మను ర।తీ యని తద్రతులసంగతిన పల్కినప
ల్కాయింతికిఁ గోపము రాఁ। జేయుట తద్వచనరీతిచేఁ గని నగుచున్. ౧౨౭.

క. రమణీ యిందాఁకను దెలి।యము నీయల్కకు నిమిత్త మదియే భవదు
త్తమరతి నేఁ గరఁగుచు మె।చ్చుమరఁగ నట్లంటిఁ దాని నది తప్పగునే. ౧౨౮.

క. అనుటయు భవదుత్తమ రతి। యనుపలు కొక్కటియె యాత్మ నంటె నతికి నా
ఘనిపలుకులలో రతి యీ।సున దృఢవాసిత మితరముఁ జొరనీదు మదిన్. ౧౨౯.

క. ఊవిదయు భవదుత్తమ రతి। భవదుత్తమ రతి యటంచుఁ బతిపలు కీర్ష్యా
వివశతఁ బలుమఱుఁ దడవుచు। నవివేకంబునఁ దదర్థ మరయుచుఁ దనలోన్. ౧౩౦.

క. నాకంటె నకట యుత్తమ। యాకె యగుట చెప్ప వలయునా యీగతి నీ
వాకున నీ దగుప్రేమో।త్సేకమె చాటంగ ననుచుఁ జింతిలు చుండెన్. ౧౩౧.

వ. ఇట్లు తద్దయుం బ్రొద్దు చింతాక్రాంత యై యున్నప్రభావతికిఁ బ్రద్యుమ్నుం డి
ట్లనియె. ౧౩౨.

క. పలుక వొకింతయు నాతోఁ। జిలుకవు కరుణామృతంబుచిను కొకటియు లోఁ
నులుకవు నాదగు దైన్యపుఁ। బలు కవగణనమున వినుచుఁ బద్మదళాక్షీ. ౧౩౩.

క. చేరక యుండఁగ నాకొక। ఘోరపుటాన యిడి నీవుఁ గూరిమి కెడ యై
కారుణ్య మెడలి నావెత। చేరవ నే వినుచు నునికి చిత్రము తరుణీ. ౧౩౪.

క. దానవునకు నుదయించిన। దానవు గావున లతాంగి దయ చాలదు నీ
మానసమున నీవిలఁ బ్రభ।మానసమస్తోరుగుణనమంచిత వైనన్. ౧౩౫.

ఉ. నీ విభుఁ డింత పేరలుక నెట్టుకొనన్ ధరియించి యున్కి నా
కో వనజాక్షి మందపవనౌషధినాయకముఖ్యు లుగ్రతా
పావహు లౌట చిత్రమె నిజాత్మ యనంగుఁడు నొంచుచున్నవాఁ
డే విధిఁ బ్రేమపాత్రుఁ గినియించినవారికి శత్రు వాత్మయౌన్. ౧౩౬.

గీ. ఆన విడువు మచ్చటికి నే నరుగు దెంచి । యలుక తీర్చెదఁ గాదేని జలరుహాక్షి
యాన విడువు మిచ్చటికి నీ వరుగు దెంచి । నీదు మధురంపు మోవి తేనియలు నాకు.

వ. అని యంత కంతకుఁ బెరిఁగెడు పరిరంభరాగతత్పరతావశంబున. ౧౩౭.

ఉ. రాఁగదె యో సుధాంశుముఖి రాఁగదె యో కరినోన్నతస్తనీ
రాఁగదె యో విలాసవతి రాఁగదె యో కలకంఠభాషిణీ
రాఁగదె యో కళావిదుషి రాఁగదె యో కలహంసగామినీ
రాఁగదె యో గుణైకనిధి రాఁగదె యో లలితాంగి డగ్గఱన్. ౧౩౮.

క. కలికీ రాఁగదె చిలుకల । కొలికీ రాఁగదె లతాంతకోదండుని పూ
ములికీ రాఁగదె యూరక । యలికీ రార్చటుల నేల యలిఁచెదు నన్నున్. ౧౪౦.

వ. అని వేఁడుకొనుచున్నంతం బట్టణంబులోనం దనవిడిది వాకిటం బ్రాభాతికంబు లైన వాద్యధ్వనంబులు వినంబడుటయు వజ్రనాభుపడవాళ్ళు పిలువ వచ్చు వేళ యయ్యెఁ గావలయు నింతటం బోక యున్నఁ గార్యంబు తప్పు ననుచు లేచి యాత్మకల్పిత భూవివరద్వారంబునకై చనియె నప్పుడు. ౧౪౧.

క. వెలిపింపఁ బోయి వెలిచిన । తెలఁగునఁ దా వేఁడుకొనఁ బతి స్వైరుకొనియెం
దెలివ తనయల్కఁ గడుఁ గీ । ద్వలచి విజృంభించు విరహపరితాపముచేన్. ౧౪౨.

క. తనరమణి యిట్లు తను వెను । కొనుట యెఱుంగఁడు మురారికొడు కపుడు ప్రయో
జనవశతఁ జనియె నతిరయ । మున నాత్మనివాసమునకు భూవివరమునన్. ౧౪౩.

క. అవనితయు వడివడిని బి । లావధిగా నరిగి యంత నవ్వల నరుగం
గా వెలిచి తిరిగి వచ్చెను । భావము గలఁగంగ విభునిపానుపుకడకున్. ౧౪౪.

వ. అట్లు వచ్చి. ౧౪౫.

చ. తనవిభుపాదసంగతిని ధన్యము లైనసువర్ణపాదుకల్
చనుఁగవ నొత్తుకొంచు మఱి శయ్యను రాలినతద్విలిప్తచం
దనలవము ల్శరీరమునఁ దాల్చుచుఁ దత్ప్రభుభుక్తముక్తమా
ల్యనికర మక్షియుగ్మమున నద్దుచు నించుక సేపు రంజిలెన్. ౧౪౬.

చ. తదనుభవోదితశ్రుతికతంబున నవ్విభురామణీయకా
భ్యుదయము చర్చ సేయు సురతోత్సవచాతురి యెంచుఁ బ్రేమసం

పద గణియించు లాలనలభంగులు భావన నిల్పు మిక్కిలిన్
హృదయమునందు రాగిలుచు నింద్రవిరోధితనూజ మాటికిన్. ౧౪౭.

ఉ. అక్కట యిట్టివల్లభునియందును గోపము పుట్ట నాకుఁ ద
ప్పొక్కటి యేల తోఁచె నదియున్ మఱి మద్రతిఁగూర్చి యంటఁ గా
దక్కఁగఁ దెల్పె వల్లభుఁడు దానికి నర్థము నప్పు డేను నే
డొక్కటిగాఁ దలంచి విడ నొల్లన కోపము దైవవంచనన్. ౧౪౮.

ఉ. ఆయనఘుండు దాఁ దొలుత నంపినపత్త్రికలోన నున్నయ
త్యాయతరాగభంగు లరయంగ ననన్యసమానభాగ్యఁ గా
నా యది చూడ నాదయినయల్కయ మూలము కాక యున్న నా
నాయకుఁ డట్లు ప్రార్థన మొనర్పఁగ నే విన కున్కి యొప్పునే. ౧౪౯.

క. మగవాఁడుఁ దుష్మ్యేదయు సరి। జగతి నదియుఁ గాక నాఁటిచాటూక్తులప్పే
మగురుత్వము నలపత్రిక।యు గణింపఁగ నతనియందు నొదవునె తప్పుల్. ౧౫౦.

వ. అని విరహవేదనం బొరలుచుండఁ బ్రభాతం బగుటయుఁ బ్రభావతి తనగృహదేవత
యుం బోలెఁ బూజ లందుచు ననన్యవిదితగుప్తం బై యున్నయాపత్త్రికం బుచ్చుకొని
శృంగారపుందోఁటలోనికిఁ జని యొక్కవివిక్తస్థలంబునం గూర్చుండి మున్ను రాగ
వల్లరి చదువఁగా మిగిలినపత్త్రికాభాగంబు తనచేత నటమున్ను బహువారపఠితం
బయ్యు నవోత్కంఠఁ గలుగం జేయుచుండ నల్పస్వరంబునఁ దనలో నిట్లని చదు
వం దొడంగె. ౧౫౧.

ద్విరదగతిరగడ. ఓహంసి నీచేత నున్నయది నాబ్రదుకు
నాహృదయ మింతి డెందము నేకముగ నదుకు
కరుణ నిది పదివేలుకమ్మలుగఁ గైకొనుము
పరఁగ నతితోడ నాపలుకుగా నిట్లనుము
విద్యున్నిభాంగిరో వినుమ నీకృప గన్నఁ
బ్రద్యుమ్నుఁ డనుపేరు ఫలిత మగు నా కెన్నఁ
ద్రైలోక్యనిత్యసామ్రాజ్యవైభవ మైనఁ
బోల దొకలేశమును బొలఁతి నీకృపలోన
గరిమ నెల్లెడల నీకనునన్నలో వత్తు
హరిమధ్య యేజాన యైన దీనికి నిత్తు
నీజాక్షి విను నీయుపేక్ష నాచెవిఁ బడినఁ
బ్రాణము హరించు విరులావార్త వెంబడిన

నీమోవిచిగురు తేనియలు గ్రోలెడియాన
నీమొలకనవ్వువెన్నెలచలువ గొనునాన
నీమృదుకపోలసన్నిధిని మో మిడునాన
నీమోహనశ్రోణి నిమురఁ గలిగెడునాన
నీదుపాలిండ్ల నా నెదు వత్తు మనునాన
నీదుశృంగారకళ నెలవు లంటెడియాన
నీదుమణితామృతము నింతుఁ జెవి ననునాన
నీదులలితోరువు ల్నెమ్మి నొత్తెడియాన
నొడలిలోఁ బ్రాణవాయువులు నా కిందాఁక
వెడల కుండఁగ నిట్లు విన్నవించెదఁ గాక
యీకమ్మపూఁదోఁట యీ తేనియలజళ్ళు
నీకోమలపుగాడ్పు లీవెన్నెలబయళ్ళు
తను వైదుపాళ్ళు నింతక పంచి లోఁ గొనవె
యనయంబు నివి విరహి కపకారు లన వినవె
నిండుచందురుఁడు నీ నెమ్మొగంబు సుహృత్తు
గండుఁగోయిలఫణితి కలభాషలకుఁ దొత్తు
మెఱుఁగుఁదీఁగెలు నీదుమృదుతనూలతయంట్లు
కఱకుఁబాయపుఁదేంట్లు కచభరశ్రీబంట్లు
కెంజిగురుచాయ నీకెమ్మోవికిని దాసి
కంజవైభవము కన్గవకు నంతేవాసి
యివి యెల్ల నా కింపు లిల నీవు చేపట్ట
నివియె పెనుమృత్యువు లొకింత నీ వెడ పెట్ట
నని తన్నుఁగూర్చి నే నాడుట చెవిఁ జొనుపు
వనిత యే మనియె నది వ్రాసి వేగమె యనుపు
మో రాజహంసి నీయుల్ల మెందు నహేతు
కారుణ్య మని గట్టిగాఁగ నారసి చూతు
వని చదువుకొన వినియె నటమున్న యేతెంచి
వెనుక నుండి తదీయవిభుఁ డాత్మ హత్తించి. ౧౫౨.

వ. ప్రభావతియు నిట్లు లేఖ చదువుకొని తదర్థంబు మఱియు మఱియు భావంబునం
బరామర్శించుచు. ౧౫౩.

మ. ఇవి యాదిం గల ప్రేమభంగు లిఁక నాయే లెంచుయత్నంబు న
ట్టివిధి న్నన్నుఁ బరిగ్రహించుట నిరూఢి న్నేఁటిదాఁకన్ రతో
త్సవసాహార్దరతుల్ శతోత్తరత మించం జల్వు టాభవ్యప్రా
భవరూపాదిగుణవ్రజం బరయ నాభాగ్యంబె భాగ్యం బిలన్. ౧౫౪.

క. ఈరాత్రి యకారణపుం। బేరలుకఁ దదాత్మ కెడసి పిరువీఁ కగుచో
న్వారయ భాగ్యవిహీనలు। లే రెవ్వరు నవనిమండలి న్నన్నుఁ బోలన్. ౧౫౫.

వ. అని చింతించు చుండ. ౧౫౬.

గీ. రాగవల్లరి యంత నారమణికడకు। నరుగుదెంచి యాసఖివెన్క నచలవృత్తిఁ
బొంచి యున్నట్టిప్రద్యుమ్నుఁ గాంచి యతని। యత్నిసంజ్ఞచేఁ గాననియట్ల యుండె. ౧౫౭.

వ. తదనంతరంబ యాయంబుజాక్షిచందం బభివీక్షించి. ౧౫౮.

చ. పయిదలి నేఁ డిదేమి ముఖపాండిమ యున్నది మీఱి ప్రత్యుషః
క్రియలఁ బరాకు మాన్పినది కృష్ణచతుర్దశి నాఁటిచంద్రరే
ఖయుఁ బలె మేను చిక్కినది కాటుకక ప్పదె యొప్పెడుం గుచ
ద్వయిఁ బికరాజిమ్రోఁతఁ గయిర్వాలెదు సోలెదు చల్లగాడ్పులన్. ౧౫౯.

ఉ. లోలతరాక్షి యాపయిఁటలోనిది యొక్కడిలేఖ యల్లనాఁ
డేలిక యంపినట్టిదియొ యొయ్యది యైనను సిగ్గు లేల నేఁ
డాలిఖితార్థ మే మయిన నట్టిటు గొంటినఁ జూచె దేమొ యాఁ
బోలిక చూడ నట్ల యిభిక్రు ల్సతులందును నల్వసంఘులే. ౧౬౦.

క. అని నడుమ నడుమఁ బ్రద్యుమ్నుని సదనముఁ జూచి నగుచు ముద్దియ తల్లో
చనసంజ్ఞాప్రేరణమున। దనుజేశ్వరసుతకు మఱియుఁ దా నిట్లనియెన్. ౧౬౧.

క. ఈరేయి రమణుఁ డేంచెనుః। గారించినవాఁడు నిన్ను గట్టిగఁ దెలిసెన్
నారీమణి మానునె మదిః। గూరిమి దాఁచుకొని యలుగఁ గూడదు నీకున్. ౧౬౨.

క. నీ వలిగెనుదాఁకను తే।దో వనితా యాట మాని యొడ్డించుకొనం
గా వలసె విభువిటుబుకల।చే విరహాకులిత వై కృశించితి విదిగో. ౧౬౩.

ఉ. తా నటు లల్క దెప్పుకొని ధైర్యబలంబున రాక తక్క నీ
దైనవియోగతాపమృదులాకృతి చూడఁగ నప్పు డిష్ట మో
మానిని తాను నోర్వఁ డతిమాత్రవియుక్తికి నిష్ఠ మాన్పు నీ
కా నెఱజాణ యోగ్యకరుణామృతవృష్టి నయోగఖేదమున్. ౧౬౪.

వ. అనిన రాగవల్లరికిఁ బ్రభావతి యి ట్లనియె. ౧౬౫.

సీ. అట్టియసత్యంపుటలుకలు గల్పించుకొని వియోగవ్యథఁ గుందఁ జేసి
కాంతలయారూపు గనుఁగొను వేడ్కలు రాగుండు తోడినిర్దయులయందు

సంభవించునో కాని సత్కృపారాశి మత్ప్రాణేశుఁ డేవినోదమున కైన
నను జిన్నపుచ్చి కన్గొనఁజాలఁ డొకనిమేషార్ధమాత్రంబు నోయంబుజాక్షి
నేఁటిరాత్రి తెఱంగు నానేరమున జనించె నది యొక్కమాట కే నెమ్మనమున
నలిగి తేఱన యే నెన్నిప్రార్థనములఁ దానిచే నెంత యొడసెనో ధవునిమనసు. ౧౬౬.

చ. అన విని రాగవల్లరి సమంకురితస్మితకోమలావలో
కనముల నాప్రభావతిని గన్గొనునట్లు తదీశ్వరుం గనుం
గొని బళి గోపపుత్త్ర రసికుండవు నీదగుధార్త్య మింతిపై
ఘన మనుమా నవీనసుధ గాంచి చవుల్గొనుకోర్కి కోర్కియే. ౧౬౭.

క. నా విని యోసితుటారి దయావారిధి నధిపుఁ గూర్చి యనకు మొకటియుఁ గ
న్నావెత్తికినుక యింతకుఁ దావల మని చెప్ప వినవె తరుణీ యనియెన్. ౧౬౮.

వ. అని యోరాగవల్లరీ నీవు నాకు బహిఃప్రాణంబవు గాని సఖీమాత్రంబవు గావు నీకు దాఁపురంబు సేయ నేల మా తెఱంగు వినిపించెద విను మని తనకోపనిమిత్తంబును బ్రియుండు తనతోడన రాకుండ నాన వెట్టి తాను శయ్యాంతరంబున కరుగుటయును మొదలుకొని ప్రియునిర్గమపర్యంతంబుగాఁ దమవృత్తాంతంబు సకలంబునుం జెప్పఁ దగినప్రకారంబునం జెప్పి యిట్లనియె. ౧౬౯.

క. కాంతుం డాగతి నాయత్యంతకఠోరతకు నాత్మయందు విఱిగియో
వింత యగువిరహదశ కుపశాంతి యరసికొనెనో లేచి చనియెం బెలుచన్. ౧౭౦.

క. తఱి నంత వేఁడుకొన వినఁ నెఱుఁగని వానిష్ఠురతకు నేడువిఱుగుల
న్విఱిగె నొకొ ప్రియునిచిత్తము విఱుగక యున్నం ద్యజించి వెన నేల చనన్.

ఉ. వ్రీడకు మానసంపదకు వెల్తి గదా యిది యంచు నెంచ కేఁ
గూడఁగఁ బాఱి పట్టుటకు గొబ్బున నప్పుడ సాహసించితిన్
జేడియ దాఁప నేర కిది చెప్పెదఁ బ్రాణము నీవు గావునన్
గూడఁగ లేక యంతఁ గడుఁ గుందితి ఘోరవియోగవేదనన్. ౧౭౨.

ఉ. ఆపరిపాటి కంతఁ గడు నల్గుచు నట్టివిభున్ దథావిధా
లాపవిచిత్రతం దురపిలంగ వియోగదవానహత్వముల్
జూపుచుఁ జేర వేఁడువివశుం గయికోక కఠోరవృత్తిఁ బె
న్పాపముఁ గట్టుకొన్నగతభాగ్యకు నా కివి పాట్లు నెచ్చెలీ. ౧౭౩.

సీ. తెఱప కేలున్నవి నెత్తలిరీటెలు తమవాఁడి యెల్ల నాతనువుమీఁదఁ
బఱప కేలున్నవి పరభృతశ్రేణులు శ్రుతులలోఁ దమపల్కు సూదు లెల్ల
నుఱుప కేలున్నవి నెఱయ ధైర్యంబును గందంపుమలకొ దెగాడ్పుగములు
విఱుప కేలున్నవి వెస నంటఁ బొదివి వపుర్మహాశఁ బరాగముర్మురములు

నన్ను నొకభూమిగోపలినాతిగాఁగఁ। దలఁచి వే చంప కిట్లోర్వ దాల్చినవియొ
తెగితెగనిచిఱుగత్తికోఁతగ వధించు। టుచిత మని రోలి నిక్లేఁచు చున్నయవియొ.

చ. అని విరహంపుఁబేరలఁత నాశ్రితచంద్రశిలాతలంబుమీఁ
ద నొరుగుచున్ సఖిం దిగిచెఁ దన్వి శిరోదిశకై తదంకముం
దనకుఁ దలాడగాఁ గొనఁగఁ దజ్ఞత బోటియుఁ దత్క్రియాప్రవ
ర్తనకుఁ దదీశు దాకొలిపి తాఁ దనయింటికిఁ బోయె నవ్వుచున్. ౧౬౫.

గీ. ప్రాణసఖి యిట్లు పన్నినపన్నుగడలు। తెలియమింజేసి యపుడు దైతేయకన్య
తనకు నంకోపధాన మట్లనువు పఱిచి। యాలతాంగియ యున్నది యనుతలఁపున.

ఉ. ప్రాణసఖీ నిను న్నెరయఁ బాసి చనన్ దటి వచ్చె నాకుఁ గ
ల్యాణి తలంపుమీ సునమయంబుల నన్నని ప్రేమ పెంపునన్
బాణి మెడం దగిల్చి తనపైకిఁ దదాస్యము వంపఁ బూని సు
శ్రోణి నికేశుమో మసుట చూచి త్రపాద్భుతమోదమగ్నతన్. ౧౬౬.

క. ఒక్కింతతడవు చేష్టలు। దక్కి కనంబడియెఁ జిత్రతనువును బోలెన్
మిక్కిలిఁ గమనీయత నతి। దక్కు కురుస్తంభసంగతత్వముశతనన్. ౧౬౭.

వ. అప్పుడు ప్రభావతికిఁ బ్రద్యుమ్నుం డి ట్లనియె. ౧౬౮.

చ. వెఱఁగు పడంగ నేల యలివేణి భవత్పతిఁ గానె యేను నీ
విరసత మాన్ప లే కపుడు వేఁగుచు నంతటిలోఁ బ్రయోజనాం
తరమతి నేగి నేఁటికిని దానిప్రసంగము లేమి వచ్చితిన్
దిరిగి వసించితి న్నెనుకదిక్కున నీవిధ మెల్లఁ జూచుచున్. ౧౭౦.

చ. అని యిరుకేలఁ గ్రిందటిగ నానతి బాహులు పట్టి యెత్తి వె
న్నెనుకకు రా వెసం దిగిచి వేడుక నంకకృతోపవేశఁ జే
సె నెరులు దువ్వెఁ జెక్కిటను జెక్కిలి చేర్చెను మోవిచుంబనం
బొనరిచెఁ జన్నులం టెఁ గరయుగ్మము ప్రక్కలఁ బాఱఁ జొన్పుచున్. ౧౭౧.

మ. సుముఖీ యెన్నఁడు నింక నల్గ నను మంచు న్మోక్కి పట్టెన్నఖా
గ్రములన్ దంతశిఖన్ గుచాధరము లాకాంతుండు తత్కాంతయున్
సుముఖా యెన్నఁడు నల్గఁ జేయ నను మంచు న్మోవి తా నట్ల నొ
క్కి మనోనాథు వరిష్ఠనిష్ఠురకుచక్లిష్టాంగుఁ జేసెం దుదన్. ౧౭౨.

చ. అలుక యొకింతకాలము మహత్తరసేతువురీతి నాఁగి భే
దిలి తొలఁగన్ సహస్రముఖతీవ్రత చూపెను దొంటికంటె వా

రలయ సమానమానిత పరస్పర కేలిరస ప్రవాహ మ
గ్గలికఁ దదుత్తరంగరతికర్మ విచిత్రతఁ జెప్ప శక్యమే. ౧౭౩.

వ. ఇవ్విధంబునఁ బ్రద్యుమ్నుండు ప్రభావతిం గూడి బహుకాలంబు యథేష్టభోగంబు లనుభవించుచు నప్పటప్పటికి వజ్రనాభుని నపూర్వవర్తనప్రవర్తనంబుల వశవర్తిం జేసికొనుచుఁ బ్రవర్తిల్లె గదసాంబులును జంద్రవతీగుణవతులతోడఁ గూడి రాత్రు లెల్ల రమియించుచు నాట్యసమయంబులఁ బ్రద్యుమ్నునకు విదూషకపారిపార్శ్వకాదికృత్యంబుల సహాయత్వంబు నడపుచు దైత్యవిభునిచిత్తంబు వడసి రంత. ౧౭౪.

ఉ. రమణ దలిర్పఁగా ఋతువురాకలు దక్కె నొడళ్ళ చిక్కెఁ జి
ట్టుము లుదయించె వేవిళు లనూనత మించెఁ గపోలసీమఁ బాం
డిమ గనుపట్టెఁ జన్మొనల నీలిమ పుట్టె వలగ్నముం గురు
త్వము పొరసెన్ వళు ల్విరిసె దానవకన్యలకుం గ్రమంబునన్. ౧౭౫.

ద్వి. నవమాసానంతరమునఁ బ్రవిమలశుభదినమునం బ్రభావతి గాంచెన్
శివ గుహునిఁ గాంచు కైవడి। నవనిఁ బ్రభావంతుఁ డనఁగ నమరెడుతనయున్.

ద్వి. ప్రణుతగుణ చంద్రవతి దిన। మణినిభుఁ జంద్రప్రభుం గుమారునిఁ గాంచెన్
గుణవతియుఁ గాంచె నిరువుర। గుణవంతుం గీర్తిమంతుఁ గోర్కులు పొదలన్.

వ. ఇట్లు గాంచినకుమారు లుదయించుచుం దోడన పరిపూర్ణయౌవనులును సకల వేదవేదాంగపారగులును ధనుర్విద్యాసంపన్నులు నగుచుం గన్యాంతఃపురంబునఁ బ్రవర్తిల్లుచున్నంత నొక్కనాఁడు తద్రక్షణాధికారులవలన వారలయునికి నిశ్చితంబుగా విని వజ్రనాభుం డాగ్రహోదగ్రుం డగుచుఁ దనసభాసదులఁ గలయం గనుంగొని. ౧౭౬.

సీ. కంటిరె కాలవక్రతప్రకారము దానవముఖ్యులార నా
యింటికి ద్రోహముం దలఁచి యిష్టసుఖాప్తికి ముచ్చు లిట్లు నా
లొక్కంట దలంప శేషఫణికోటుల వ్రేలిడి గోఁకుకోఁగ ము
క్కంటివెలుంగుకంటఁ జణకంబులు వేఁచుకొనంగఁ బూనరే. ౧౭౭.

ద్వి. వాండ్రు సురవంశభవులైన స్వర్గమునకుఁ। బ్రళయసమయ మిప్పుడు నాగకులజులైన
నాశకాలంబు తద్భువనమున కిదియ। నరు లయిన నంత్యదశ నేఁడ ధరణి కెల్ల.

ద్వి. ప్రాణములతోడ నిట వాండ్రఁ బట్టి తెచ్చి। తెలిసి తల్లోకమును గడతేర్పవలయు
నీవు చని పట్టి తెమ్మని నిజపురంబు। పెద్దతలవరిఁ దాఁ బంచె భీమబలుని. ౧౮౧.

ద్వి. వాఁడు చని తిరుగక యున్న వరుస దండ। నాయకోత్తములను దళవాయిఁ బనిచె
వారుఁ దిరుగ కుండినఁ దదవస్థ దెలిపె। నరులు కోటకొమ్ములఁ గట్టిరట్టితలలు.

వ. వజ్రనాభుండు తా నత్యంతకోపాటోపదీపితముఖుం డగుచుఁ దనతమ్ముఁడు సునాభుండును సకలమిత్రామాత్యవర్గంబులును రథతురంగమాతంగపదాతివ్రాతపాదఘాతంబులచేత భూతలంబు వడవడ వడంక నద్భుతోత్సాహంబునం జేర్చి కొలువ నలువు మిగిలి కన్యకాభవనప్రాకారంబు చుట్టు ముట్టుకొనియె నప్పుడు తమువిడుదుల నున్నప్రద్యుమ్నగదసాంబులు మన మింతట నంతఃపురప్రవేశంబు సేయక తడసిన నీబెడిదంపురక్కసునియక్కజంపువిక్రమంబు కుమారులకు నోర్వ శక్యంబుగా దని పూర్వవిహితమహీవివరద్వారంబున నాక్షణంబ ప్రవేశించి భీతివశంబున నొక్కచోటనే చేరి యున్నతమకళత్రంబులయుత్తలపాటు దీర్చి తత్పూర్వకృత్తదైత్యగాత్రంబుల నెత్తుటం జొత్తిల్లినయాయుధంబులు తమచేతులవ యుండ సంభ్రమంబునం జను దెంచి మ్రొక్కి యున్నకుమారుల సంశ్లాఘావచనంబుల నలరించి రట్టియెడఁ బ్రద్యుమ్నుండు ప్రభావతిం జూచి యిట్లనియె. ౧౯౩.

గీ. మగువ వినుము మిగులఁ దెగి విక్రమింప మీ।తండ్రి కదలి వచ్చె దర్ప మెనఁగ
మనకు వచ్చెఁ గదుఁ బ్రమాద మే మింతట।యుద్ధమునకుఁ దెగక యూరకున్న.

క. కుదుములప్రేట్లాటలు గా। వుదు రాజానన రణంబు లూహించినవెం
బడి రా వే మటు తొడరినఁ। దొడిఁబడ నెవ్వాఁడు బిట్టు ద్రుంగునొ మాచేన్.

ఉ. చేడియ నీమనంబునకుఁ జింత యొకింత జనించెనేని నేఁ
జూడఁగఁ జాల నీజనకుచొప్పు దలంప హతుండు గాక తాఁ
గీడు చలంబు మానఁ డనికిం జొర కొండొకత్రోవ ద్రొక్కఁగాఁ
గూడద యేమి సేయుదును ఘోరవిచారము పుట్టె నాత్మలోన్. ౧౯౭

చ. అని తనుఁగూర్చి దానవకులాగ్రణిపైఁ దెగ లేనిచింత సే
యునధిపుఁ గోటలగ్గలకు నుగ్రత డగ్గఱుభూరిసైన్యుఁ దం
డ్రినిఁ బరికించి యింతి విభునిం దముఁ గాచికొనంగ వేఱ త్రో
వ నెమకి కాన కంతఁ బితృవత్సలభావముఁ బాఱ నూకుచున్. ౧౯౮

క. తాన చని మూల నున్నయ
నూనతదీయాసిఁ దెచ్చి యొనఁగి గెలువుమీ
దానవపతిఁ దక్కినయను
మానము మాను మని పలికె మానవతి పతిన్. ౧౯౯

చ. పలికిన నంతసిల్లి హరిపట్టి గదాదుల సాత్వరన్ వధూ
నిలయములోని కావలికి నిల్పి రయంబున నొక్కరుండుఁ దా
వెలువడి కోట కుగ్రబలవేష్టనము న్విడిపించుచున్ నిర
ర్గళగతిఁ జుట్టునుం దిరిగె ఖడ్గవిహారపటుత్వదీప్తుఁ డై. ౧౯౯.

ఉ. కాంచనదీప్తిచేఁ బసిఁడిగట్టు తెఱంగు నగళ్ళకోట సూ
చించఁగఁ దాను భాస్కరుని చెన్ను వహించెను దానిఁ జుట్టి రా
సంచరణం బొనర్చుచును శౌరితనూజుఁడు కోటచుట్టునున్
డించిన దైత్యసైన్యము వడిం దమము వ్వలె విచ్చి పాఱఁగన్. ౨౦౦.

క. లగ్గలకు నట్లు కోటకు
దగ్గుఱుతనమొనల నెల్లఁ దఱిమి తఱిమి పే
రగ్గలిక చూపుమరుపో
టగ్గించుచు వజ్రనాభుఁ డతని నెదిర్చెన్. ౨౦౧.

వ. ఎదిర్చి యి ట్లనియె. ౨౦౨.

ఉ. ఎవ్వఁడ వీవు నాముదల యించుక లేక చొరంగ రాదు వీ
డెవ్వరి కైన బ్రహ్మవర మిట్టిది యేగతిఁ జొచ్చి తీవు తా
నివ్విధి నాకుఁ గల్లవర మిచ్చిన బ్రహ్మకు శిక్ష చేసెదన్
గ్రొవ్వడఁగించి ని న్నిపుడ కొట్టెద నీకుల మెల్ల రూపఱన్. ౨౦౩.

వ. అనుటయు నతండు. ౨౦౪.

క. విను నేఁడు తిరిగి చన ని
చ్చినఁ గద బ్రహ్మకును శిక్ష సేయుదు వీదు
గ్జనతలె కావే మిముఁ జెఱ
చినవి యసలోక్తి బ్రహ్మజిహ్వకుఁ గలదే. ౨౦౫.

క. మొదలను బురిఁ జొచ్చితి నీ
ముదలన భద్రనటవేషమున హరిసుతుఁడన్
యదుకులజుఁడఁ బ్రద్యుమ్నుఁడ
మదిచ్ఛఁ గైకొంటి నీకొమారితఁ బొందున్. ౨౦౬.

ఉ. కోరికఁ దానవానుజనితాఁతులకుం బతు లైనవారు మా
వారలె నాకు వారికి నవార్యబలు ల్సహజాతయౌవనో
దారులు గల్గి రాత్మజులు తల్లులరక్షకు నున్నవారు ప్రా
కారములోన నీదొరల గన్యలఁ బట్టిరఁ దిన్నమృత్యువుల్. ౨౦౭.

గీ. వారికి దేవేంద్రునకు నీవు శరణు చొచ్చి
లేని నీప్రాణముల కెందు నేను దెగను
శరణు చొరవేని నావాలు కరుణ గిరుణ
యెఱుఁగినది కాదు నీ వది యెఱుఁగె దిపుడ. ౨౦౮.

గీ. అనిన విని యోరి నీ వేమి యనినఁ జెల్లు
నేను నాసృష్టియెదుట ని న్నింతతడవు
పెట్టుకొని యుండుటకు నని బెట్టిదంపు
టంపవానలు గురిసె భయంకరముగ. ౨౦౯.

క. తనవాలునఁ దచ్ఛరములు
దునుముచుఁ బ్రద్యుమ్నుఁ డతనిఁ దునుమకడంకన్
ఘనరయమునఁ జనఁ దాఁకిరి
సునాభముఖ్యు లగురాక్షసులు బలములతోన్. ౨౧౦.

క. అది యంతయుఁ గని మనముల
గదసాంబులు గినిసి కోటగవనులు దెఱపిం
చి దురాధర్షాటోపత
నెదిర్చిరి సునాభముఖుల నింద్రాహితులన్. ౨౧౧.

శా. అంతం గేశవుఁ డంచవేగయుతచే నాదైత్యసంగ్రామవృ
త్తాంతంబున్ విని శౌరి వాహనుఁడు చక్రాద్యాయుధప్రోల్లస
త్ప్రాంచిక్రాంతిదిగంతరుం డయి వడిన్ దా వచ్చె నచ్చోటికిన్
సంతోషంబున వజ్రి సత్వరగతి స్పందించి సేవింపఁగాన్. ౨౧౨.

వ. అప్పు డింద్రుండు ధనురాదినకలహేతిసమేతంబును మాతలిసారథికంబును నైన తనదివ్యరథంబు ప్రద్యుమ్నునకు ననిపి గదసాంబులకు ననన్యదుర్జయంబు లైనదివ్యస్యదనంబులఁ బనిచె దాన నపూర్వోత్సాహంబునం బొదలియు యదుకుమారులు ప్రతిభటుల మించం జాలక సత్వరంబునఁ బోరుచుండి రయ్యవసరంబునఁ గృష్ణుండు.

క. సాహసము నాహతప్ర
త్యాహతనైపుణము నొక్కయంతగ సుతుతో
నాహవ మొనరించుమహో
త్సాహనిధి వజ్రనాభదైత్యునిఁ జూచెన్. ౨౧౩.

గీ. చూచి యిట్లైన నెన్నండు సులభ మగును
విజయ మని మరుచేతికి విష్ణుఁ డనిపెఁ
దనదుచక్రము నతఁడును దత్ప్రయోగ
మునను ఖండించె వజ్రనాభునిశిరంబు. ౨౧౫.

క. గదసాంబులు తద్విజయా
భ్యుదయముఁ గని పొంగి బహువిధోగ్రాస్త్రములన్
జిదురుపలుగ నొనరించిరి
కదిసి సునాభాదిదనుజగణదేహంబుల్. ౨౧౬.

వ. అప్పుడు. ౨౧౭.

శా. మందారద్రుమపుష్పవృష్టితతులున్ మంద్రస్ఫురద్దేవతా
దుందుభ్యారవసంప్రవర్తనలు నప్సోకాప్సరోనర్తనా
మందోల్లాసము దివ్యగాయకులనన్యాదృశ్యగానంబు నా
నందోత్సేకము నిచ్చె లోకులకు మింటం జాల దీపించుచున్. ౨౧౮.

వ. అంత నచ్యుతుం డనాథత్వదైన్యదశాపన్ను లగుపౌరజనుల ననేకవిధలాలనాచాతుర్యశీతలవచనామృతంబున నపగతాశేషశోకపరితాపుల నపూర్వసంభృతానందవిశేషులం గావించి వజ్రనాభునిరాజ్యంబు సర్వంబును జతుర్భాగంబులుగా విభజించి తదాధిపత్యంబునకుఁ బ్రభావంతునిఁ జంద్రప్రభుని గుణవంతునిఁ గీర్తిమంతునిం బట్టాభిషిక్తులం గావించి కొడుకులం గోడండ్రనుం దమ్ముని మఱఁదలిని నత్యంత విభవంబు మెఱయం దోడ్కొనుచు ద్వారకానగరంబున కరుగుదెంచి దేవేంద్రునిం దదీయస్థానంబున కనిచి సకలసామ్రాజ్యవిభవంబు లనుభవించుచు నిరంతర కరుణావలోకనంబుల భక్తజనంబుల నవలోకించుచు మహానందంబునం బొలుపొందు చుండె నప్పుడు. ౨౧౯.

క. వావిరిఁ బ్రద్యుమ్నుండు ప్ర
భావతితో నిష్టకేళిపరిపూర్ణత నిం
పావహిలఁగ వర్తిల్లెను
శ్రీవరుఁ దమతండ్రిఁ దగ భజించుచు ఘనుఁడై. ౨౨౦.

గీ. అఘహరణహరివంశకథాశ్రయంబు
నాత్మపుత్రగుణస్తవనాంకితంబు
నైనయీకావ్యమునకు మహాప్రసిద్ధి
యిచ్చుఁ గావుతఁ గరుణ లక్ష్మీశ్వరుండు. ౨౨౧.

శా. శ్రీరాజేంద్రగురూత్తమాన్వయజనుర్విఖ్యాతసౌభాగ్య సో
మారాధ్యప్రభునత్కృపాచతురమత్యానీతఫాలాక్ష భ
క్త్యైరబ్ధవ్యుపగూహనాతిసుఖితాత్మాప్తక్షమాశాంతిస
ద్వైరాగ్యోదయ బోధముఖ్య బహుసంతానప్రసిద్ధుం డిలన్. ౨౨౨.

క. వరచామరమిషవృతది
క్కరటిశ్రుతకీర్తిసామ్య కామ్యత్కృతిగో
చరితాఖిలవిద్వత్కుం
జరకర్ణుఁడు కర్ణుఁ డీగిచాతుర్యమునన్. ౨౨౩.

వనమయూరము. భృత్యజనపోషణుఁడు పింగళిపురాంకా
మాత్యకులభూషణుఁడు మార్దవమహీయ
స్సత్యశుచిభాషణుఁడు సాధుజనతానం
పత్యుదయపోషణుఁడు భవ్యకృప పేర్మిన్. ౨౨౪.

గద్యము. ఇది నిఖిలసూరిలోకాంగీకారతరంగితకవిత్వవైభవ పింగళియమరనార్యతనూభవ సౌజన్యజేయ సూరయనామధేయ ప్రణీతంబైన ప్రభావతీప్రద్యుమ్నం బనుమహాప్రబంధంబునందుఁ బరిపూర్ణభావభాసురం బయినపంచమాశ్వాసము.

---

సంపూర్ణము.

చ. పలికిన నంతసిల్లి హరిపట్టి గదాదుల నార్వురన్ వధూ
నిలయములోని కావలికి నిల్పి రయంబున నొక్కరుండుఁ దా
వెలువడి కోట కుగ్రబలవేష్టనము న్వెడిపించుచున్ విర
గ్గళగతిఁ జుట్టునుం దిరిగె ఖడ్గవిహారపటుత్వదీప్తుఁ డై. ౧౯౯.

ఉ. కాంచనదీప్తిచేఁ బసిఁడిగట్టు తెఱంగు నగళ్ళకోట సూ
చించఁగఁ దాను భాన్కరుని చెన్ను వహించెను దానిఁ జుట్టి రా
నంచరణం బొనర్చుచును శౌరితనూజుఁడు కోటచుట్టునున్
డించిన దైత్యసైన్యము వడిం దమము న్వలె విచ్చి పాఱఁగన్. ౨౦౦.

క. లగ్గలకు నట్లు కోటకు
దగ్గఱుతెనమొనల నెల్లఁ దఱిమి తఱిమి పే
రగ్గలిక చూపుమరుపౌ
టగ్గించుచు వజ్రనాభుఁ డతని నెదిర్చెన్. ౨౦౧.

వ. ఎదిర్చి యి ట్లనియె. ౨౦౨.

ఉ. ఎవ్వఁడ వీవు నాముదల యించుక లేక చొరంగ రాదు వీ
డెవ్వరి కైన బ్రహ్మవర మిట్టిది యేగతిఁ జొచ్చి తీవు తా
నివ్విధి నాకుఁ గల్లవర మిచ్చినబ్రహ్మకు శిక్ష చేసెదన్
గ్రొవ్వడఁగించి ని న్నిపుడ కొట్టెద నీకుల మెల్ల రూపఱన్. ౨౦౩.

వ. అనుటయు నతండు. ౨౦౪.

క. నిను నేఁడు తిరిగి చన ని
చ్చినఁ గద బ్రహ్మకును శిక్ష సేయుదు వీదు
ర్జనతలె కావే మిముఁ జెఱి
చినవి యసలోక్తి బ్రహ్మజిహ్వకుఁ గలదే. ౨౦౫.

క. మొదలను బురిఁ జొచ్చితి నీ
ముదలన భద్రనటవేషమున హరిసుతుఁడన్
యదుకులజుఁడఁ బ్రద్యుమ్నుఁడ
మదిచ్చఁ గైకొంటి నీకొమారితపొందున్. ౨౦౬.

ఉ. కోరికఁ దావకానుజునికూఁతులకుం బతు లైనవారు మా
వారలె నాకు వారికి నవార్యబలు ల్సహజాతయాదవో
దారులు గల్గి రాత్మజులు తల్లులరక్షకు నున్నవారు ప్రా
కారములోన నీదొరల గన్యలఁ బల్వురఁ దిన్న మృత్యువుల్. ౨౦౭.

గీ. హరికి దేవేంద్రునకు నీవు శరణు చొచ్చి
తేని నీప్రాణముల కెందు నేను దెగను
శరణు చొరనేని నావాలు కరుణ గిరుణ
యెఱుఁగినది కాదు నీ పది యెఱుఁగ దిపుడ. ౨౦౮.

గీ. అనిన విని యోరి నీ వేమి యనినఁ జెల్లు
నేను నావృష్టి యెదుట ని న్నింతతడవు
పెట్టుకొని యుండుటకు నని బెట్టిదంపు
టంపవానలు గురిసె భయంకరముగ. ౨౦౯.

క. తనవాలునఁ దచ్ఛరములు
దునుముచుఁ బ్రద్యుమ్నుఁ డతనిఁ దునుముకడంకన్
ఘనరయమునఁ జనఁ దాఁకిరి
సునాభముఖ్యు లగురాక్షసులు బలములతోన్. ౨౧౦.

క. అది యంతయుఁ గని మనముల
గదసాంబులు గినిసి కోటగవనులు దెఱపిం
చి సునాభక్షాటోపత
నెనర్పి సునాభముఖుల నిర్జితాహితులన్. ౨౧౧.

శా. అంత [illegible] సంగ్రామవ్య
త్యా [illegible] చక్రాద్యాయుధప్రోల్లస
త్స్వాంత [illegible] వడిన్ దా వచ్చె నచ్చోటికిన్
సంతోషంబున వజ్రి సత్వరగతి స్సంధించి సేవింపఁగాన్. ౨౧౨.

వ. అప్పు డింద్రుం డు ధనురాదినకలహేతినమేతంబును మాతలిసారథికంబును నైన తనదివ్యరథంబు ప్రద్యుమ్నునకు ననిపి గదసాంబులకు ననన్యదుర్జయంబు లైనదివ్య స్యదనంబులఁ బనిచె దాన నపూర్వోత్సాహంబునఁ బొదలిరియు యదుకుమారులు ప్రతిభటుల మించం జాలక నత్వరంబునఁ బోరుచుండి రయ్యవసరంబునఁ గృష్ణుండు.

క. సాహసము నాహతప్ర
త్యాహతనైపుణము నొక్కయంతగ సుతుతో
నాహవ మొనరించుమహో
త్సాహనిధి వజ్రనాభదైత్యునిఁ జూచెన్. ౨౧౩.

గీ. చూచి యిట్లైన నెన్నండు సులభ మగును
విజయ మని మరచేతికి విష్ణుఁ డనిపెఁ
దనదుచక్రము నతఁడును దత్ప్రయోగ
మునను ఖండించె వజ్రనాభునిశిరంబు. ౨౧౫.

క. గదసాంబులు తద్విజయా
భ్యుదయముఁ గని పొంగి బహువిధోగ్రాస్త్రములన్
జిదురుపలుగ నొనరించిరి
కదిసి సునాభాదిదనుజగణదేహంబుల్. ౨౧౬.

వ. అప్పుడు. ౨౧౭.

శా. మందారద్రుమపుష్పవృష్టితతులున్ మంద్రస్ఫురద్దేవతా
దుందుభ్యారవసంప్రవర్తనలు నస్తోకాప్సరోనర్తనా
మందోల్లాసము దివ్యగాయకులనన్యాఘుష్యగానంబు నా
నందోత్సేకము నిచ్చె లోకులకు మింటం జాల దీపించుచున్. ౨౧౮.

వ. అంత నచ్యుతుం డనాథత్వదైన్యదశాపన్నులగు పౌరజనుల ననేకవిధలాలనాచాతుర్య
శీతలవచనామృతంబున నపగతాశేషశోకపరితాపుల నపూర్వసంభృతానందవిశేషులఁ
గావించి వజ్రనాభునిరాజ్యంబు సర్వంబును జతుర్భాగంబులుగా విభజించి
తదాధిపత్యంబునకుఁ బ్రభావంతునిఁ జంద్రప్రభుని గుణవంతునిఁ గీర్తిమంతునిం
బట్టాభిషిక్తులం గావించి కొడుకులం గోడంద్రమునం దమ్ముని మఱఁదలిని నత్యంత
విభవంబు మెఱయం దోడ్కొనుచు ద్వారకానగరంబున కరుగుదెంచి దేవేం
ద్రునిం దదీయస్థానంబున కనిచి సకలసామ్రాజ్యవిభవంబు లనుభవించుచు నిరంతర
కరుణావలోకనంబుల భక్తజనంబుల నవలోకించుచు మహానందంబునం బొలు
పొందుచుండె నప్పుడు. ౨౧౯.

క. వావిరిఁ బ్రద్యుమ్నుండు ప్ర
భావతితో నిష్టకేళిపరిపూర్ణత నిం
పావహిలఁగ వర్తిల్లెను
శ్రీవరుఁ దమతండ్రిఁ దగ భజించుచు ఘనుఁడై. ౨౨౦.

గీ. అఘహరణహరివంశకథాశ్రయంబు
నాత్మపుత్రగుణస్తవనాంకితంబు
నైనయీకావ్యమునకు మహాప్రసిద్ధి
యిచ్చుఁ గావుతఁ గరుణ లక్ష్మీశ్వరుండు. ౨౨౧.

శా. శ్రీరాజేంద్రగురూత్తమాన్వయజనుర్విఖ్యాతసౌభాగ్య సో
మారాధ్యప్రభునత్కృపాచతురమత్యానీతఫాలాక్ష భ
క్త్యారబ్ధవ్యపగూహనాతిసుఖితాత్మాప్తక్షమాశాంతిన
ద్వైరాగ్యోదయ బోధముఖ్య బహుసంతానప్రసిద్ధుం డిలన్. ౨౨

క. వరచామరమిషవృతది
క్కరటిప్రసుతకీర్తిసామ్య కామ్యత్కృతిగో
చరితాఖిలవిద్వత్కం
జరకర్ణుఁడు కర్ణుఁ డీగిచాతుర్యమునన్. ౨౨౩

వనమయూరము. భృత్యజనపోషణుఁడు పింగళిపురాంకా
మాత్యకులభూషణుఁడు మార్దవమహీయ
స్సత్యశుచిభాషణుఁడు సాధుజనతానం
పత్యుదయపోషణుఁడు భవ్యకృప పేర్మిన్. ౨౨౪.

గద్యము. ఇది నిఖిలసూరిలోకాంగీకారతరంగితకవిత్వవైభవ పింగళియమర
నార్యతనూభవ సౌజన్యజేయ సూరయనామధేయ ప్రణీతంబైన ప్రభా
వతీప్రద్యుమ్నం బనుమహాప్రబంధంబునందుఁ బరిపూర్ణ
భావభాసురం బయినపంచమాశ్వాసము.

---

సంపూర్ణము.